శ్రీమతే రామానుజాయ నమః



# శ్రీసూక్తభాష్యమ్ - అనువాదంతో,

( అజ్ఞాతకర్తృకము )

# శ్రీగుణరత్నకోశ వ్యాఖ్యానము

(కాంచీ మహావిద్వాన్ ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామివారి
ద్రావిడ వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదం)

అనువక్త : ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామివారు





అష్టమ ఉభయవేదాంత సభల జ్ఞాపిక - 2014

సమర్పణము

శ్రీమతి అలుమేలుమంగ, శ్రీమాన్ పి. గోపాలకృష్ణమూర్తి దంపతులు

శ్రీమతే రామానుజాయ నమః



# శ్రీసూక్తభాష్యమ్ - అనువాదంతో

(అజ్ఞాత కర్తృకము)

# శ్రీగుణరత్నకోశ వ్యాఖ్యానము

( కాంచీ ప్ర.భ.అణ్ణంగరాచార్యస్వామివారి
ద్రావిడవ్యాఖ్యానానికి ఆంధ్రానువాదం )


అనువక్త

**డా॥ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులు**



సమర్పకులు

శ్రీమతి అలిమేలుమంగ,
శ్రీమాన్ గోపాలకృష్ణమూర్తి దంపతులు,
అష్టమ ఉభయవేదాంత పండితసభల
జ్ఞాపిక - ఏప్రియల్, 2014

# శ్రీసూక్తభాష్యమ్, శ్రీగుణరత్నకోశవ్యాఖ్యానమ్

## అనువక్త - డా॥ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులు

ప్రథమముద్రణము - 2014

ప్రతులు - 500

వెల - అమూల్యము.

ఆవిష్కరణము - అష్టమ ఉభయవేదాంత పండితసభలు

తేది - 4-4-2014



ముఖచిత్రం - శ్రీరంగనాయకి (శ్రీరంగం), పరాశరభట్టర్,
ప్ర.భ. అణ్ణంగరాచార్యస్వామి

హైదరాబాద్ వాస్తవ్యులు శ్రీమతి అలమేలుమంగ,
శ్రీమాన్ శ్రీగోపాలకృష్ణమూర్తి దంపతులు సమర్పించిన
పవిత్ర ద్రవ్యంతో ఈ గ్రంథం ముద్రింపబడింది.

గోపాలకృష్ణాఖ్యసుహృద్ద్వారేణ ప్రకాశితః శ్రీగుణరత్నకోశః ।
శ్రీసూక్తభాష్యం చ ముదే భవేతాం విపశ్చితాం శ్రీవిభవాత్మకత్వాత్ ॥

ప్రతులకు

1. ఈ.ఏ. శింగరాచార్యులు

18-3-58/7, శాంతినగర్, కె.టి.రోడ్, తిరుపతి-517 507

ఫోన్ : 09885003420

డి.టి.పి. : 1. యస్.చంద్రశేఖర్, తిరుపతి.
2. శ్రీమతి ఏ.యస్. జయలక్ష్మి, భవానినగర్, తిరుపతి.

ప్రింటింగ్ : సి.ఎన్. ప్రింటర్స్, ప్రకాశంరోడ్, తిరుపతి.

# ప్రాగుక్తి

శ్రీవైష్ణవసంప్రదాయంలో లక్ష్మీదేవికి గల ప్రాధాన్యం దొడ్డది. ఈమె ప్రస్తావన వైదికవాఙ్మయంలో విస్తృతంగా, స్పష్టంగా లేదనే అభిప్రాయం కొంతమంది ఆధునికవిమర్శకులు వ్యక్తం చేశారు. కాని, శ్రీపరాశరభట్టర్ శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రంలోని "**మాధవః**" అనే నామాన్ని వ్యాఖ్యానిస్తూ "**అస్యాః స్వరూపవత్ నిత్యనిర్మలరూపత్వమ్, నిరుపాధికపరమైశ్వర్యాది, జగన్మాతృత్వమ్, ఔత్పత్తికో భగవత్సంబంధో, నిత్యానపాయశ్చ ఇత్యాది తత్త్వపరేషు శాస్త్రేషు అమర్యాదమ్. వేదేషు తావత్ శ్రీసూక్తమ్, శ్రద్ధాసూక్తమ్, మేధాసూక్తమ్, ఉత్తర నారాయణమ్, కాషీతకీబ్రాహ్మణమ్– ఇత్యాదౌ**" అని వివరించినందున వేదంలోని శ్రీసూక్త, శ్రద్ధాసూక్త, మేధాసూక్తాదులలో లక్ష్మీవైభవం ప్రస్తుతింపబడినట్లు తెలుస్తున్నది. శ్రీసూక్తాన్ని వ్యాఖ్యానించిన శ్రీరంగనాథముని (నంజీయర్?) తమ భాష్యావతారికలో శ్రద్ధాసూక్తాన్ని, మేధాసూక్తాన్ని, అదితిసూక్తాన్ని లక్ష్మీపరంగా వ్యాఖ్యానించడమే కాక, వాక్సూక్త, పృథివీసూక్తాలలో కూడా లక్ష్మీవైభవం ప్రతిపాదింపబడినదని నిరూపించారు. ఋగ్వేదంలోని వాగాంభృణీసూక్తం హయగ్రీవుని పత్ని అయిన, విద్యా అనే నామాన్ని కల్గిన లక్ష్మి యొక్క వైభవాన్ని ప్రతిపాదిస్తున్నదని అభిజ్ఞులైన ఆచార్యుల వివరణం. ఈ విధంగా లక్ష్మీవైభవం వేదంలో పలుచోట్ల ప్రసిద్ధంగా కన్పిస్తున్నదనడంలో లోటులేదు. తైత్తిరీయశాఖకు చెందిన శ్రీసూక్తం లక్ష్మీతత్త్వాన్ని మనకు కళ్ళకు కట్టినట్లు విశదంచేస్తున్నది. ఈ సూక్తం తైత్తిరీయశాఖలోనే కాక మాధ్యందినాది శాఖలలోకూడా అధ్యయనం చేయబడుతున్నది. ఈ విషయాన్ని పరాశరభట్టర్ శ్రీగుణరత్నకోశమనే స్తుతిలో "**శ్రీసూక్తం బహుముఖయతే తాం చ శాఖానుశాఖమ్**" అని అంటూ తెలియ జేశారు. ఈవిధంగా వేదప్రతిపాదితమైన లక్ష్మీవైభవాన్ని లక్ష్మీతంత్రాది ఆగమసంహితలు, ఇతిహాసపురాణాది ఉపబృంహణవాఙ్మయం, దివ్యసూరి ప్రబంధాలు వివరించాయి. దివ్యసూరుల సూక్తులలో లక్ష్మీతత్త్వాన్ని నిరూపించే సందర్భాలు ఎన్నో ఉన్నాయి. ఉదాహరణకు తిరువాయ్మొ౹గ్రి ప్రబంధంలోని "**అఱుక్కుమ్ వినై**" (9–8) అని ప్రారంభమయ్యే దశకం సమగ్రంగా లక్ష్మీవైభవ ప్రతిపాదకమని శ్రీవేదాంతదేశికులు ద్రవిడోపనిషత్తాత్పర్యరత్నావళిలోని "**వల్లీమధ్యత్వయోగాత్, అపి చ సువిదిత శ్రీవచోవాచ్యభావాత్, భూమ్యాత్,**

**ఐశ్వర్యయోగాత్, అవతరణదశసాహచర్యాత్ స్వభర్తుః, సంధాతృత్వాత్, సుబోధప్రద దురితహరత్వాత్, సమాసన్నభావాత్, లక్ష్మాః శ్రీశం శఠారిః ప్రథయతి చ సుమజ్ఞాని భావేన నాథమ్"** అనే ఈ దశక సంగ్రహార్థాన్ని తెలిపే శ్లోకంలో తెలిపారు. ఈ దశకంలో 1, 2, 3, 4, 5, 7, 10వ పాశురాలలో లక్ష్మీప్రస్తావన ఉన్నందున, మిగిలిన పాశురాలు కూడా లక్ష్మీవైభవాన్ని తెలియజేస్తున్నవి అని భావించి శ్రీదేశికులు ఈవిధంగా ఈ దశకార్థాన్ని లక్ష్మీవైభవపరంగా ప్రతిపాదించారని వ్యాఖ్యాత అభిప్రాయపడ్డారు. ఈ విధంగా ఉండే లక్ష్మీవైభవాన్ని పూర్వాచార్యులు మధురమైన స్తుతులలో మనకు అందించారు. అటువంటి పూర్వాచార్య స్తుతులలో శ్రీపరాశరభట్టర్ ప్రణీతమైన శ్రీగుణరత్నకోశం ప్రసిద్ధమైనది, విలక్షణమైనది.

శ్రీవైష్ణవాచార్యపరంపరలో శ్రీపరాశరభట్టర్ ఒకరు. భగవద్రామానుజుల కటాక్షాన్ని పూర్ణంగా పొంది, వారికి పిమ్మట విశిష్టాద్వైత సంప్రదాయ ప్రచారాన్ని సమర్థవంతంగా నిర్వహించినవారు, వీరు. శ్రీరామానుజుల శిష్యులలో ప్రథమగణ్యులైన కూరేశుల పుత్రులిద్దఱిలో పరాశరభట్టర్ మొదటివారు. **"ప్రజ్ఞా నవనవోన్మేషశాలినీ ప్రతిభా"** అని నిర్వచింపబడిన ప్రజ్ఞను కల్గిన వీరి సర్వశాస్త్రపాండిత్యం అసమానం. శ్రీరంగనాయకీ శ్రీరంగనాథుల ముద్దుబిడ్డగా పేరు పొందిన పరాశరభట్టర్ శ్రీరంగనాథుని విషయంగా శ్రీరంగరాజస్తవాన్ని, శ్రీరంగనాయకి విషయంగా, శ్రీగుణరత్నకోశమనే అత్యంత ప్రౌఢమైన గహనమైన స్తుతిని రచించారు. ఇవి రెండు కేవలం స్తుతులేకాదు. ఉభయవేదాంతరస్య రహస్యార్థ ప్రతిపాదకాలు. ఈ రెండిటిలోను, శ్రీగుణరత్నకోశంలోని రచనాసంవిధానం, సూక్తిమాధుర్యం. అర్థగాంభీర్యం నిరుపమం. లక్ష్మీవైభవాన్ని ఈ స్తుతి విశ్వతో ముఖంగా ప్రతిపాదిస్తున్నది. ఆమె స్వరూపరూపగుణ లీలాది విశేషాలను విశదీకరిస్తున్నది. ద్వయమంత్రంలోని శ్రీశబ్దార్థాన్ని మతుప్ ప్రత్యయార్థాన్ని శ్రీగుణరత్నకోశం వివరించగా, మిగిలిన మంత్రార్థాన్ని శ్రీరంగరాజస్తవం-పూర్వోత్తర శతకాలు వివరిస్తున్నవని సాంప్రదాయికమైన వివరణం.

శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందిన పూర్వాచార్యులు రచించిన స్తుతులన్నీ కేవలం స్తుతులు కావు వేదాంతార్థ ప్రతిపాదకాలు. ఈ విషయంలో శ్రీగుణరత్నకోశమనే ప్రకృతస్తుతి ప్రబలనిదర్శనం. ఈ స్తుతిలోని పలు శ్లోకాలు వేదతదుపబృంహణ దివ్యసూరిపూర్వాచార్య సూక్తుల అర్థాలను అందంగా అనుసంధిస్తున్నవి. **"అస్యేశానా"** ఇత్యాది శ్లోకాలలో శ్రుత్యర్థాలు, **"రతిర్మతిసరస్వతీ"**

ఇత్యాది శ్లోకాలలో శ్రీవిష్ణుపురాణాది ఉపబృంహణాలలోని, "**సుమన స్సందర్శనమ్**" ఇత్యాదులలో ఆళ్వార్ల సూక్తులు- అనుసంధింపబడడం దిఙ్మాత్రోదాహరణంగా గమనించవచ్చు.

శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రంలోని కొన్ని నామాలలో లక్ష్మీవైభవవిశేషాలు తెలుపబడినవనే విషయాన్ని భట్టర్ తమ భగవద్గుణ దర్పణమనే భాష్యంలో వివరించారు. ఆ విశేషాలను దృష్టిలో పెట్టుకొని శ్రీగుణరత్నకోశంలోని పలు శ్లోకాలను భట్టర్ రచించినట్లు తోస్తుంది. (1) "**శ్రీనివాసః**"- అనే 614వ నామాన్ని "**దివ్యవల్ల్యా ఇవ కల్పద్రుమః, తస్యా నిత్యోపఘ్నః**" (దివ్యమైన తీగకు కల్పవృక్షంవలె లక్ష్మీదేవికి నిత్యమైన ఆధారం) అని వివరించారు. ఈ భావమే "**అనుకలతనుకాండాలింగన**" ఇత్యాది శ్లోకంలో అనుసంధింబడింది. (2) "**శ్రీపతిః**" అనే 610వ నామాన్ని "**తుల్యశీలవయోవృత్తామ్**"- **ఇతివత్ తస్యాః సముచితో నిత్యస్వయం వరపతిః**" అని వివరించిన భట్టర్ ఈ భావాన్ని వరుసగా 32,33,34, 35వ శ్లోకాలలో విస్తృతంగా అనువదించారు. (3)"**శ్రీమతాం వరః**" అనే 611వ నామాన్ని "**తస్యాః సాదరపూర్ణనిర్వర్ణననిత్యపాత్రం భగవాన్, బ్రహ్మాదయస్తు తన్నాంతరీయకకటాక్షశీకరక్షణలక్ష్యమ్**" (ఆదరంతో కూడిన, పూర్ణమైన ఆమె కటాక్షానికి భగవానుడు లక్ష్యం. బ్రహ్మాదులైతే, ఆమె తాత్కాలిక కటాక్షలేశానికి మాత్రమే పాత్రులు) అని వివరించి, ఆ భావాన్ని "**అపాంగాః భూయాంసః**" ఇత్యాది శ్లోకంలో అనుసంధించారు. (4) "**శ్రీశః**" అనే 613వ నామాన్ని "**శ్రియః శ్రీశ్చ భవేదగ్ర్యా- ఇతి తస్యా అపి తథాత్వనిదానత్వాత్ శ్రీశః**" అని, "**శ్రీరేవాస్యాపి ఈశా- సర్వావస్థావ్యవస్థాపికా**" అని రెండు రీతులలో వివరించి, ఈ రెండు అర్థాలను "**శ్రియః శ్రీః**" అనే శ్లోకంలోను, "**శ్రియై సమస్తచిదచిత్**" అనే శ్లోకంలోను అనుసంధించారు. (5) అదే రీతిలో "**శ్రీవిభావనః**" అనే 616వ నామాన్ని "**సైవాస్య విభావనీ ప్రఖ్యోపఖ్యాహేతురితి**" అని వివరించి, ఆ భావాన్ని "**స్వరూపం స్వాతంత్ర్యమ్**" అనే శ్లోకంలో ప్రతిపాదించారు. (6) "**శ్రీధరః**" అనే 617వ నామాన్ని "**తాం రత్నమివార్చిషం, పుష్పమివ సురభిమ్, ఇందురివ చంద్రికామ్, అమృతమివ స్వాదుతామ్ ఔత్పత్తికేన సంబంధేన ధరతి**" అనే వివరణను "**తవ స్పర్శాదీశమ్**", "**స్వతః శ్రీః**" అనే శ్లోకాలలో ప్రస్తావించారు. (7) "**శ్రీకరః**" అనే 618వ నామాన్ని "**తామ్ పరత్వే ఇవ వ్యూహావతారాదిష్వపి స్వానురూపాం కరోతి**" అని వివరించి, ఆ వివరణను "**యది మనుతిరశ్చామ్**" అనే శ్లోకంలో

అనువదించారు. (8) "**స్వక్షః**" అనే 621వ నామాన్ని "**తత్సౌందర్యసుధోదధిపారీణ దివ్యకరణః**" అని వివరించి, దానిని "**దశశతపాణిపాద**" అనే శ్లోకంలో వ్యక్తం చేశారు. (9) "**శతానందః**" అనే 623వ నామాన్ని వివరిస్తూ "**పరస్పరప్రణయ ప్రవహదపరిమితానందః**" అని పల్కిన భావాన్ని, "**నందిః**" అనే 624వ నామాన్ని వ్యాఖ్యానిస్తూ "**ఏకం సర్వదా సర్వత్ర సర్వథా చ అనయా సమృధ్యతి**" అని పల్కిన భావాన్ని "**తత్ర స్రక్**" ఇత్యాది శ్లోకంలోను, (10) "**జ్యోతిర్గణేశ్వరః**" అనే 625వ నామాన్ని "**ఉభయానుకూలోజ్జ్వలశేషశేషాశనాది నిత్యపరిచారకగణపరిచరణీయ త్వాత్**" అని వివరించి, ఆ భావాన్ని "**తే సాధ్యాః**" అనే శ్లోకంలోను అనుసంధించారు. ఈ విధంగా పలు శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రనామాల తాత్పర్యాన్ని ఈ స్తుతిలోని పలు శ్లోకాలు వెలువరిస్తున్నవి – అనే విషయం సుస్పష్టం.

ఇదే రీతిలో, పలు దివ్యసూరి సూక్తుల భావాలు కూడా ఇందులో అందంగా ప్రతిబింబిస్తున్నాయి. "**అమోదాద్భుతశాలి**" అనే 44వ శ్లోకంలో "**కోమలాంగ సుమనః సందర్భణం దేవి ! తే కాంతోరఃప్రతియత్న మర్హతి**" అని చేసిన ప్రయోగం "**ఉన్ మార్వత్తుమాలై నజ్జై**" అనే తిరువాయ్‌మొ*ౙ్రి* (10-10-2) సూక్తి భావాన్ని అనుసంధిస్తున్నది. "**పుష్పావళీ రసికభ్రమరోపభుక్తా**" అనే 45వ శ్లోకంలోని ప్రయోగం "**దెయ్వ వణ్డు తుదైత్త ఎమ్ పెణ్ణైయమ్ పూవు**" అనే తిరువాయ్‌మొ*ౙ్రి* (9-9-4) సూక్తిని స్మరింపజేస్తుంది. "**తిరుమకళుమ్**" అనే పొయ్‌కై ఆ*ౙ్వా*ర్ల పాశురభావం. "**భోగ్యా వా మపి**" అనే (26)శ్లోకంలో అనుసంధింపబడింది. "**ఒన్జుణ్డు శెజ్గణ్‌మాల్**" అనే పెరియతిరువన్దాదిలోని భావం "**ఐశ్వర్య మక్షరగతిమ్**" అనే (58) శ్లోకంలో అనుసంధింపబడింది. "**పయిన్జదు అరజ్గమ్**" అనే పూదత్తా*ౙ్వా*ర్ల పాశురభావం 57వ శ్లోకంలోని "**సీతావతారముఖ్యమేత దముష్య యోగ్యా**" అనే సూక్తిలో ప్రతిఫలిస్తుంది. "**ఎన్నైక్కుమెన్నై**" అనే తిరువాయ్‌మొ*ౙ్రి* పాశురభావం. "**సూక్తిం సమగ్రయతు**" అనే 7వ శ్లోకంలో ఈ రీతిలో ఈస్తుతిలోని పలు శ్లోకాలు పలు దివ్యసూరిసూక్తుల భావాలకు ఉత్తమోత్తమసంవాదాలు.

శ్రీరంగరాజస్తవంలోని శ్లోకభావాలు కూడా ఈ స్తుతిలో భాసిస్తాయి. "**శ్రీరంగరాజభృంగః**" అనే శ్రీరంగరాజస్తవప్రయోగభావం. 44వ, 45వ శ్లోకాలలో గోచరిస్తుంది. "**స్మేరా సనాక్షి**" (37) ఇత్యాది శ్లోకభావం. "**అజ్ఞానుగ్రహా**" అనే 23వ శ్లోకంలో "**సర్వాత్మసాధారణ**" (38) అనే శ్లోకభవం "**తస్యాంచ**" అనే 24వ శ్లోకంలో "**రంగభర్తురపి**" (88) అనే శ్లోకభావం "**పాథారుంతుదమేవ**"

అనే 42వ శ్లోకంలో "**అనుజనుః**" అనే 49వ శ్లోకభావం. "**యదిమనుజ**" అనే 48వ శ్లోకంలో భాసిస్తున్నాయి.

"**స్వవైశ్వరూపేణ**" అనే స్తోత్రరత్నశ్లోకభావం. "**భోగోపోద్ఘాతకేళీ**" ఇత్యాది 4వ శ్లోకసూక్తిలో "**ఈషత్**" అనే చతుఃశ్లోకభావం. "**ఉల్లాసపల్లవిత**" అనే 2వ శ్లోకంలో గోచరిస్తాయి. "**ఐశ్వర్యమ్**" అనే కూరేశుల శ్రీస్తవసూక్తి. "తుంగం మంగళమ్" (15) "**ఐశ్వర్యమ్**" అనే శ్లోకంలో "**లోకేవనస్పతి బృహస్పతి**" అనే శ్రీసూక్తి భావం. "**సహస్థిర**" అనే 18వ శ్లోకంలో ప్రకాశిస్తున్నాయి. ఈవిధంగా ఈస్తుతి వేదతదుపబృంహణ దివ్యసూరి పూర్వాచార్యసూక్తి సారమని స్థాలీపులాకంగా చూపబడింది.

జగద్విఖ్యాత ప్రతిభాపాండిత్యాలను కల్గిన **మహావిద్వాన్ కాంచీ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారు** తమదైన శైలిలో పలు పూర్వాచార్య స్తోత్రాలకు ద్రావిడంలో మధురవ్యాఖ్యలను వెలయించారు. శ్లోకభావాలకు దివ్యసూరి సూక్తి సంవాదాలను నిరూపించడం, పాఠభేదవిచారణను చేయడం వంటి పలు విశేషాలను వారి వ్యాఖ్యలో గమనించవచ్చు. ఇప్పటికే పలువురు విద్వాంసులు ఈస్తుతిని వ్యాఖ్యానించినా, శ్రీమాన్ అణ్ణాస్వామివారి వ్యాఖ్యలో అపూర్వమైన కొన్ని విశేషార్థాలు కన్పిస్తాయి. ఈ అంశాన్ని దృష్టిలో పెట్టుకొని శ్రీగుణరత్నకోశానికి వారు రచించిన ద్రావిడవ్యాఖ్యానం ఇపుడు ఆంధ్రీకరింపబడిన సహృదయసన్నిధిలో సమర్పింపబడుతున్నది. 2008వ సంవత్సరం నుండి ప్రతి ఏడు అప్రతిహతంగా ఉభయవేదాంత పండితసభలను పలు చోట్ల పలువురి పెద్దల మంగళాశాసనాలతో, వారు మెచ్చి ప్రశంసించే రీతిలో నిర్వహిస్తున్న హైదరాబాద్ వాస్తవ్యులు, సహృదయులు, శ్రీరామానుజ సిద్ధాంతప్రచార బద్ధ కంకణులైన **శ్రీమతి అలమేల్‌మంగ, శ్రీమాన్ గోపాలకృష్ణమూర్తి** పుణ్యదంపతులు ఈ ఏడు ఏప్రియల్ 4,5,6 తేదీలలో మహబూబ్‌నగర్ నగరంలో నిర్వహించే అష్టమ ఉభయవేదాంత సభల స్మారకంగా ఈ శ్రీగుణరత్నకోశ వ్యాఖ్యానానువాద గ్రంథం వారు సమర్పించిన పవిత్రద్రవ్యంతో ప్రచురింపబడుతున్నది. ఈ సభలలో పూర్తిగా లక్ష్మీవైభవానికి సంబంధించిన అంశాలే ప్రవచనవిషయాలు కావడంవల్ల, లక్ష్మీవైభవ ప్రతిపాదకమైన శ్రీగుణరత్నకోశవ్యాఖ్యాన గ్రంథం ఈ సందర్భంగా ప్రకాశింపజేబడడం సందర్భోచితం. దీనితోపాటు, ఇప్పటికి సుమారు నూఱు సంవత్సరాలకు పూర్వం ప్రచురింపబడిన శ్రీసూక్తభాష్యం కూడా ఆంధ్రానువాద

సహితంగ పునర్ముద్రింప బడుతున్నది. ఈ శ్రీసూక్త భాష్యాన్ని రచించినవారి పేరు తెలియదు. బహుశః ద్రావిడ దేశీయుడైన, విశిష్టాద్వైత సంప్రదాయానికి చెందిన పండితునిచే రచింపబడినదని ఈ భాష్యశైలి సమాలోచన వల్ల తెలుస్తున్నది. ఈ భాష్యానికి ఒకే ఒక్క లిఖిత ప్రతి లభించిందని, అది తమ **"శ్రీహయవదన లీలాసదన"**మనే గ్రంథాలయంలోనిదని, ఆ ప్రతి ఇంచు మించుగా శుద్ధపాఠాన్ని కల్గినదని, దానిని అనుసరించి ఈ భాష్యం సంస్కరింపబడి ప్రచురింపబడినదని ఈ భాష్యాన్ని కాంచీపురంలోగల తమ శ్రీసుదర్శన ముద్రాక్షర శాలలో 1899వ సం॥లో దేవనాగరిలిపిలో ప్రచురించిన శ్రీకాంచీ ప్రతివాదిభయం కరమ్ అనంతాచార్యస్వామివారు తెలిపారు. **"శాస్త్రముక్తావళీ"** అనే పేరుతో వారు ప్రచురించిన పలుగ్రంథాలలో మొదటి గ్రంథంగా ఈ భాష్యం వెలువడింది. కొన్నిచోట్ల ఈ భాష్యానుసారమైన సూక్తపాఠాలకు, ప్రసిద్ధ సూక్తపాఠాలకు వ్యత్యాసం ఉన్నా, పాఠభేదాన్ని అంగీకరించడం ద్వారా సమాధానం లభిస్తుంది. శ్రీసూక్తంలోని మంత్రాల ఉపాసనా క్రమాలను, వాటివల్ల కలిగే ఫలభేదాలను లక్ష్మీతంత్రంలో గమనించవచ్చు.

ఇపుడు ప్రచురింపబడే శ్రీసూక్తభాష్యం, శ్రీగుణరత్నకోశ వ్యాఖ్యానం సహృదయ పాఠకులను రంజింప జేయగలవని నమ్ముతున్నాను. **శ్రీమతి అలమేల్ మంగ శ్రీమాన్ గోపాలకృష్ణమూర్తి దంపతులను** హార్దికంగా అభినందిస్తూ, వారికి ఉత్తరోత్తర శ్రేయస్సు బహుగుణంగా శ్రీనివాస ప్రభువు కటాక్షంవల్ల లభించాలని కోరుకొంటున్నాను. నా ఈ ప్రయత్నాన్ని ప్రోత్సహించి, తగిన సూచనలను ఇచ్చి, ఆశీర్వదించిన పితృపాదులు, **న్యాయవేదాంత విద్వాన్ ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి రంగాచార్యస్వామివారి** సన్నిధిలో సాష్టాంగ దండప్రణామాలను సమర్పిస్తున్నాను. ఈ గ్రంథాన్ని డి.టి.పి. చేసి సహకరించిన మిత్రులు శ్రీచంద్రశేఖర్ గారికి, ముద్రణకార్యాన్ని అందంగా నిర్వహించిన శ్రీహర్షవర్ధన్‌గారికి ధన్యవాదాలు. స్వస్తి.

తిరుపతి
19-3-14

ఇట్లు నివేదించు
భాగవతవిధేయుడు
**ఈ.ఏ. శింగరాచార్యులు**

# శ్రీ సూక్తభాష్యమ్

శ్రీ సూక్తం పదిహేను ఋక్కులను కల్గినది. "పద్మప్రియే పద్మిని పద్మహస్తే" ఇత్యాది కొన్ని మంత్రాలు శ్రీసూక్తపఠనానంతరం కొందఱిచేత అనుసంధింప బడుతున్నా, అవి శ్రీసూక్తంలో అంతర్భవించవు. "శ్రియః పంచదశర్చంతు" ఇత్యాది ప్రమాణాలవల్ల శ్రీసూక్తం పదిహేను ఋక్కులను మాత్రమే కల్గినదని తెలుస్తున్నది.

ఈ శ్రీసూక్తమహామంత్రానికి ఋషి-శ్రీ. 'ఛందస్సు-శ్రీ'. దేవత-విష్ణుపతి, లక్ష్మీ నారాయణార్చనంలో వినియోగం. అర్చన ప్రకారం శ్రీ సూక్తభాష్యంలోనే శ్లోకరూపంలో తెలుపబడింది. లక్ష్మీతంత్రంలో దీనికి సంబంధించిన ఇకా పలు చమత్కార ప్రకారాలను గమనించవచ్చు.

శ్రీసూక్తంలోని పదిహేను ఋక్కులకు ప్రత్యేక ప్రత్యేకమైన ఫలప్రదత్వం తెలుపబడింది. మొదటి ఋక్కుకు హిరణ్యతేజోభోగచంద్రసాయుజ్యప్రదత్వం చెప్పబడింది. రెండవ ఋక్కుకు హిరణ్యగోదాసీదాసప్రదత్వం, మూడవ ఋక్కుకు రాజ్య శత్రువిజయప్రదత్వం, చతుర్థ ఋక్కుకు సంపద్విద్యాప్రదత్వం, పంచమ ఋక్కుకు నిధిమూలధనగజసంమాన శత్రువిజయప్రదత్వం, షష్ఠఋక్కుకు స్థిరఘృత ప్రదత్వం, సప్తమ ఋక్కుకు కుబేరాదిదర్శనచింతామణ్యాది రత్ననవనిధి ప్రాప్తికరత్వం, ఎనిమిదవ ఋక్కుకు దౌర్భాగ్యనాశకత్వం, తొమ్మిదవ ఋక్కుకు కృషిమూల ఫలప్రదత్వ ధనధాన్య పశుసమృద్ధికరత్వం, పదవ ఋక్కుకు వాక్సిద్ధి భోగప్రదత్వం, పదకొండవ ఋక్కుకు సంతానప్రదత్వం, పన్నెండవ ఋక్కుకు కోరినవెంటనే హితమృష్టాన్నప్రదత్వం, త్రయోదశ ఋక్కుకు గజాంతైశ్వర్య ప్రదత్వం, చతుర్దశ ఋక్కుకు, సార్వభౌమత్వవశీకరణ సిద్ధిప్రదత్వం, పదిహేనవ ఋక్కుకు విద్యాధనప్రదత్వం తెలుపబడ్డాయి. శ్రీసూక్తానికి చెందిన ఆయా జపాదుల వివరం మంత్రకల్పార్ణ వాదులలో తెలియవచ్చు.

---

## శ్రీసూక్తభాష్యమ్

### అవతారికా

**ఆద్యయాఽఽవాహయేద్దేవీం శ్రీసూక్తస్య నృపేశ్వరీమ్, ద్వితీయయాఽఽసనం దద్యాదర్ఘ్యం చైవ తృతీయయా, దద్యాత్ పాద్యం చతుర్థ్యా చ పంచమ్యాఽఽచమనీయకమ్, షష్ఠ్యా స్నానం ప్రకుర్వీత సప్తమ్యా వస్త్రమేవ చ, ముక్తాసంవీత మష్టమ్యా**

భూషణాని చ పార్థివ, గంధం నవమ్యా సందద్యాద్దశమ్యా పుష్పమేవ చ, ఏకాదశ్యా తథా ధూపం ద్వాదశ్యా జ్యోతిరేవ చ, పాయసం ఘృతసంయుక్తం ఖండశర్కరయా యుతమ్, నివేదయేత్ త్రయోదశ్యా చతుర్దశ్యా ప్రదక్షిణమ్, ఉద్వాసయేత్పంచదశ్యా లక్ష్మీం తాం లోకమాతరమ్, స్నానే వస్త్రే చ నైవేద్యే దద్యాదాచమనం నృప, కృత్వా ప్రదక్షిణం దేవీం ప్రాగుద్వాసనకర్మణః, అగ్రతోఽగ్నిం సమాధాయ సమూహ్యాజ్యస్య సంస్కృతమ్, కృత్వాఽగ్నిం పరిషిచ్యాథ జుహుయాదాజ్యసంప్లుతమ్, సూక్తస్య ప్రత్యృచం దేవ్యా స్వాహాంతం ప్రణవాదికమ్, సమిధో బిల్వవృక్షస్య పాలాశాశ్చ తథాపి చ, ఆజ్యాహుతీస్తదా హుత్వా పరిషిచ్య తథైవ చ, అష్టావింశతి కృత్వాథ జపేత్ శక్తః శ్రియం స్మరన్, సర్వదా ప్రణవం దద్యాదాదౌ సూక్తస్య పార్థివ".

## అవతారిక

శ్రీసూక్తంలో లక్ష్మీదేవిని షోడశోపచారాలను చేసే విధానాన్ని తెలుపడంతో ప్రకృత భాష్యం ఆరంభమవుతున్నది.

1) శ్రీసూక్తం మొదటి ఋక్కుతో ఈశ్వరి అయిన లక్ష్మీదేవిని ఆవాహనం చేయాలి.

2) రెండవ ఋక్కుతో ఆసనాన్ని ఇవ్వాలి.

3) మూడవ ఋక్కుతో అర్ఘ్యాన్ని ఇవ్వాలి.

4) నాల్గవ ఋక్కుతో పాద్యాన్ని సమర్పించాలి.

5) అయిదవ ఋక్కుతో ఆచమనీయాన్ని సమర్పించాలి.

6) ఆఱవ ఋక్కుతో స్నానాన్ని సమర్పించాలి.

7) ఏడవ ఋక్కుతో వస్త్రాన్ని సమర్పించాలి.

8) ఎనిమిదవ ఋక్కుతో ముక్తాసంవీతాన్ని (ఉత్తరీయాన్ని), భూషణాలను అర్పించాలి.

9) తొమ్మిదవ ఋక్కుతో గంధాన్ని అర్పించాలి.

10) పదవ ఋక్కుతో పుష్పాలను అర్పించాలి.

11) పదకొండవ ఋక్కుతో ధూపాన్ని అర్పించాలి.

12) పన్నెండవ ఋక్కుతో దీపాన్ని సమర్పించాలి.

13) పదమూడవ ఋక్కుతో ఖండశర్కర, నేతితో కూడిన పాయసాన్ని నివేదన చేయాలి.

14) పద్నాల్గవ ఋక్కుతో దీపాన్ని సమర్పించాలి.

15) పదిహేనవ ఋక్కుతో దీపాన్ని సమర్పించాలి.

స్నానాన్ని, వస్త్రాన్ని, నైవేద్యాన్ని సమర్పించినపుడు ఆచమనాన్ని కూడా సమర్పించాలి. లక్ష్మీదేవిని ఉద్వాసన చేయడానికి ముందు ఆమెకు ప్రదక్షిణాన్ని చేసి, ఆమె సమక్షంలో అగ్నిని అధానం చేసి, అగ్నిసంస్కారాన్ని చేసి, అగ్నికి పరిషేచనం చేసి, ప్రతిఋక్కుతో ఆజ్యహోమం చేయాలి. ఆహుతులను ప్రణవపూర్వకంగా స్వాహాంతంగా చేయాలి. బిల్వసమిధులతోగాని, పాలాశ సమిధులతోగాని ఆజ్యాహుతులను ఇరవై ఎనిమిదిసార్లు అర్పించాలి. తరువాత ఉత్తరపరిషేచనం చేసి లక్ష్మిని స్మరిస్తూ జపించాలి. ప్రతిసారి సూక్తానికి ముందు ప్రణవాన్ని అనుసంధించాలి.

---

**1. హిరణ్యవర్ణాం హరిణీం సువర్ణరజతస్రజామ్ ।**
**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మ ఆవహ ॥**

**తత్ర ప్రథమం తావత్ శ్రియఃపతిం సర్వేశ్వరం ప్రతి శ్రీసమాగమ మర్థయతే.**

**(జాతవేదః) జాతం స్వతస్సిద్ధం, వేదో ధనం యస్య స జాతవేద-ఇతి విష్ణోః. సంబుద్ధిః "జాతవేదసే సునవామ సోమమ్" ఇతి మంత్రే పరమాత్మని ప్రయోగాత్. (హిరణ్యవర్ణామ్) - హిత రమణీయవర్ణామ్, హితత్వ మభీప్సితసర్వార్థసాధకత్వమ్, రమణీయత్వం తదనురూపత్వమ్, సర్వలక్షణసంపన్నా మిత్యర్థః. (హరిణీమ్) సర్వలక్షణపాపహరణ శీలామ్, తాచ్ఛీల్యే ణినిః, వృద్ధ్యభావ శ్ఛాందసః. యద్వా, హరిణీ కృష్ణమృగీ, తద్వన్ముగ్ధా మిత్యర్థః. (సువర్ణరజతస్రజామ్) స్వసౌందర్య లావణ్యానుగుణ స్వర్ణరజత మయాభరణయుక్తామ్, (చంద్రామ్)- సర్వాహ్లాదకారిణీమ్, "చది-ఆహ్లాదనే" ఇది ధాన్నమ్, ఔణాదికో రప్రత్యయః. "ఇందిరా మిందుశీతలామ్" ఇతి ప్రయోగాత్. (హిరణ్మయీమ్) హిరణ్యాదిసర్వధనప్రచురామ్, (లక్ష్మీమ్) సర్వలక్షణీయామ్, దివ్యలక్షణ సంపన్నాం వా, (మమ) ఆశ్రయణోన్ముఖస్య మే, (ఆవహ) సన్నిధాపయ.**

వేదపురుషుడు మొదటి ఋక్కుద్వారా శ్రియఃపతి అయిన సర్వేశ్వరుని ఉద్దేశించి పల్కుతూ లక్ష్మీసమాగమాన్ని ప్రార్థిస్తున్నాడు.

**(జాతవేదః)** స్వతసిద్ధమైన ధనాన్ని కల్గిన ఓ శ్రియఃపతీ! **"జాతవేదసే సునవామ సోమమ్"** అనే శ్రుతిలో భగవానుడు జాతవేదశబ్దంతో నిర్దేశింపబడ్డాడు.

**(హిరణ్యవర్ణామ్)** హితమైన,రమణీయమైన వర్ణాన్ని కల్గిన - అని అర్థం. హితత్వ మంటే - అభీష్సితాలను అన్నిటినీ సాధించగల్గడం. రమణీయత్వమంటే - దానికి అనుగుణమై ఉండడం. సర్వలక్షణసంపన్నురాలని తాత్పర్యం.

**(హరిణీమ్)** - అన్ని విధాలైన పాపాలను హరించే స్వభావాన్ని కల్గినది - అని అర్థం. లేక, "హరిణీ" అంటే-నల్లజింక, దానివలె ముగ్ధస్వభావాన్ని కల్గినదని భావం.

**(సువర్ణరజతస్రజామ్)** - తన సౌందర్యలావణ్యాలకు తగిన స్వర్ణ - రజత మయాలైన ఆభరణాలతో కూడినది,

**(చంద్రామ్)** - అందఱిని ఆహ్లాదపరచేది. **"ఇందిరా మిందుశీతలామ్"** అనే ప్రయోగంద్వారా ఈ అర్థం స్ఫురిస్తున్నది.

**(హిరణ్మయీమ్)** - హిరణ్యం మొదలైన సమస్తధనాన్ని సమృద్ధిగా కల్గినది,

**(లక్ష్మీమ్)** ఉత్తమ లక్షణాలకు లక్ష్యభూతురాలు, దివ్యలక్షణసంపన్న అయిన లక్ష్మీదేవిని, **(మమ)** - ఆమెను పురుషకారం చేయడంకోసం ఆశ్రయించడానికి ఉన్ముఖుడనై ఉండే నాకు (నాగృహానికి)

**(ఆవహ)** - వేంచేటట్లు అనుగ్రహించు (ఈవిధంగా మొదటి ఋక్కులో లక్ష్మీదేవి ఆవాహన చేయబడింది.)

**2. తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్ ।**
**యస్యాం హిరణ్యం విందేయం గామశ్వం పురుషానహమ్॥**

**ఏవ మావాహితాం లక్ష్మీం ప్రార్థయానో నియచ్ఛతి.**

**(జాతవేదః) లక్ష్మీపతే, (తామ్) పూర్వోక్త సమస్తగుణాం లక్ష్మీమ్, (అనపగామినీమ్) మత్సమీపాదనపగామినీమ్, (మే), (ఆవహ) యథా మత్సమీపాదన్యత్ర కదాచిత్ క్వచిదపి గంతుం నేచ్ఛతి తథా కురు - ఇత్యర్థః. యస్యాం లక్ష్మ్యామాగతాయాం, (హిరణ్యమ్) స్వర్ణరూప్యాది, (గామ్) గోమహిషాది, (అశ్వమ్) గజతురగాది, (పురుషాన్) దాసశిష్యాదిపరిచారికాంశ్చ, (అహం విందేయమ్) లభేయమ్, (తామ్ ఆవహ).**

ఆవాహన చేయబడిన లక్ష్మీదేవిని రెండవ ఋక్కుతో స్థిరంగా నిలచి ఉండేటట్లుచేయమని ప్రార్థిస్తున్నాడు.

**(జాతవేదః)** ఓ లక్ష్మీపతీ!, **(తామ్)** గడచిన ఋక్కులో తెలుపబడినట్లుగా సమస్త కల్యాణగుణాలను కల్గిన లక్ష్మీదేవిని, **(అనపగామినీమ్)** - నా సమీపం నుండి తొలగిపోనిదానినిగా, **(మే ఆవహ)** - ఏవిధంగా ఆమె నా సమీపంనుండి వేఱొక చోటికి ఏనాడూ వెళ్ళడానికి ఇష్టపడదో, ఆ విధంగా చేయాలి - అని అర్థం **(యస్యామ్)** - ఏ లక్ష్మీ వేంచేసి ఉన్నట్లయితే, **(హిరణ్యమ్)** - బంగారు, వెండి మొదలైన సంపదలను, **(గామ్)** - గోవులు, మహిషాలు మొదలైన పశుసంపదను, **(అశ్వమ్)** - ఏనుగు, గుఱ్ఱాలు మొదలైన వానిని.

**(పురుషాన్)** దాసశిష్యపరిచారికాదిజనులను,

**(అహం విందేయమ్)** నేను పొందుతున్నానో, (అటువంటి లక్ష్మీదేవి నా ఇంటిలో సదా నిలచి ఉండేటట్లు అనుగ్రహించు - అని భావం.)

**3. అశ్వపూర్వాం రథమధ్యాం హస్తినాదప్రబోధినీమ్ ।**
**శ్రియం దేవీముపహ్వయే శ్రీర్మా దేవీ జుషతామ్ ॥**

మయి ప్రీత్యా **అవతరతామిత్యాహ**

**అశ్వో వ్యాపకశీలో భగవాన్, అశ్నుతే రౌణాదికక్వనంతః, స పూర్వః ప్రావేశికో యస్యా స్తామ్. 'యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ్' ఇత్యుక్తేః. రథానాం రహణశీలానామ్ జీవానామ్, మధ్యే హృదయగుహాయామ్, యా తిష్ఠతి సా రథ మధ్యా, యద్వా, రథః శరీరం, "శరీరం రథమేవ చే" తి శ్రుతేః, విష్ణుశరీరమధ్యే తద్వక్షసి స్థితామ్ - ఇత్యర్థః. (హస్తినాదప్రబోధినీమ్) - హస్తినో గజబృందస్య, ఆర్తనాదే సతీశ్వరాదపి ప్రథమప్రబోధశీలామ్, ఆర్తసంరక్షణే నాథాదపి త్వరమాణామ్, యద్వా, యస్యాః ప్రయాణకాలే సేనాగ్రే అసంఖ్యేయాని అశ్వబృందాని గచ్ఛంతి, తామశ్వపూర్వామ్, యస్యా స్సేనామధ్యే రథకదంబకాని గచ్ఛంతి, తామ్. (రథ మధ్యామ్) పద్మవననాసిత్వాత్ పద్మప్రియాణాం గజానాం నాదైః ప్రబుద్ధ్యమానామ్, అథవా, "కోణపత్రగజై ర్హేమకలశై రమృతోదకైః, సదాఽభిషిచ్యమానాం తాం బోధ్యమానాం చ తైర్గజైః" ఇతి స్వాయం భువోక్త ద్వాదశాసన పద్మదళస్థగజనాదైః, అహరహః ప్రబుద్ధ్యమానామిత్యర్థః. (శ్రియమ్) భగవద్వక్షఃస్థలస్థితామ్, (దేవీమ్) స్వప్రియం విష్ణుం క్రీడయంతీమ్, (ఉపహ్వయే)-అనేన మంత్రేణ స్వామినం ప్రాపయామి, సా శ్రీః దేవీ, (మా)తదేకశరణం మాం ప్రతి, (జుషతామ్)ప్రీతాఽస్తు.**

"నాపట్ల ప్రీతితో లక్ష్మీదేవి అవతరించాలి"-అని ఈ ఋక్కులో పల్కు తున్నాడు.

**(అశ్వపూర్వామ్)** - అశ్వశబ్దం వ్యాపకశీలుడైన - అంతటా వ్యాపించి ఉండే స్వభావాన్ని కల్గిన - భగవానుని తెల్పుతున్నది. **"అశ్వపూర్వామ్"** అంటే - ఆ భగవానునితో కలిసి సర్వత్ర వ్యాపించి ఉండేది - అని అర్థం. అశ్వశబ్దం **"అశూ-వ్యాప్తౌ"** అనే ధాతువునుండి పుట్టింది. **"యథా సర్వగతో విష్ణుః తథైవేయం ద్విజోత్తమ"** (ద్విజోత్తమా! ఏ విధంగా విష్ణువు అంతటా వ్యాపించి ఉన్నాడో, ఆ విధంగానే ఈమెకూడా అంతటా వ్యాపించి ఉన్నది) అని శ్రీవిష్ణుపురాణంలో తెలుప బడింది. **(రథమధ్యామ్)** - రహణశీలులైనందున, అంటే - ప్రాకృతశరీరాలను విడచి పెట్టే స్వభావాన్ని కల్గినవారైనందున, రథశబ్దంతో నిర్దేశింపబడే జీవులయొక్క హృదయగృహలో నిలచి ఉన్నది - అని అర్థం. లేక. రథమంటే శరీరం. **"శరీరం రథ మేవ చ"** అని శ్రుతి ఈవిషయాన్ని తెల్పు తున్నది. ఇక్కడ రథశబ్దం విష్ణుదేహాన్ని లక్షిస్తున్నది. అటువంటి, రథమనబడే విష్ణువు దివ్యదేహం మధ్య -అంటే - వక్షస్సులో ఉన్నది - అని భావం. **(హస్తినాదప్రబోధినీమ్)** - గజసమూహాల ఆర్తనాదం విని, భగవానునికంటే ముందుగా ఆర్తుల రక్షణలో ప్రబోధాన్ని పొందేది - ఆర్తత్రాణంలో త్వరను కల్గినది - అని అర్థం.

లేక, **"అశ్వపూర్వామ్"** ఇత్యాది మూడు విశేషణాలకు ఇంకొక రీతిలో అర్థాన్ని చెప్పవచ్చు.

**(అశ్వపూర్వామ్)** - ఏ లక్ష్మీదేవి ప్రయాణకాలంలోని సేనాగ్రంలో పలు అశ్వబృందాలు ముందుగా పెడుతున్నాయో, ఆమె అశ్వపూర్వ.

**(రథమధ్యామ్)** ఎవరి సేనామధ్యంలో రథసమూహాలు పయనిస్తున్నాయో, ఆమె రథమధ్య.

**(హస్తినాదప్రబోధినీమ్)** - లక్ష్మీదేవి పద్మవనంలో నివసిస్తున్నది కనుక, పద్మాలంటే మిక్కిలి ఇష్టపడే ఏనుగుల ఘీంకారాలతో ప్రబోధాన్ని పొందేది - అని అర్థం లేక, **"కోణపత్రగజై ర్హేమకలశైః అమృతోదకైః, సదాఽభిషిచ్యమానాం తాం బోధ్యమానాం చ తైర్గజైః"** (ఆసనపద్మంలోని ఎనిమిది కోణాలలో ఉండే దిగ్గజాలచే బంగారు కల శాలలోని అమృత జలంతో అభిషేకింపబడేది, ఆ ఏనుగుల నాదాలతో మేల్కొనేది) అని స్వాయంభువమనువు పల్కిన రీతిలో ద్వాదశాసన పద్మంలోని దళాలలో గల గజాల నాదాలతో ప్రతిదినం ప్రబోధింపబడుతున్నదని అర్థం. ఇటు వంటి,

(శ్రియమ్) - భగవద్వక్షస్సులో నిత్యవాసం చేసే, (దేవీమ్) - తన వల్లభుడైన స్వామిని క్రీడింపజేసేది అయిన లక్ష్మిని, (ఉపహ్వయే) ఈ మంత్రంతో స్వామి సమీపానికి పొందిస్తున్నాను. అటువంటి,

(శ్రీః) - శ్రీదేవి, (మా జుషతామ్) - ఆమెనే శరణంగా కల్గిన నాపట్ల ప్రీతిని కల్గినది అగుగాక!

4. కాం సోస్మితాం హిరణ్యప్రాకారామార్ద్రాం జ్వలంతీం తృప్తాం తర్పయంతీమ్ ।
పద్మే స్థితాం పద్మవర్ణాం త్వామిహోపహ్వయే శ్రియమ్ ॥

**అథ తామభిముఖీకరోతి.**

(కామ్) సుఖస్వరూపామ్, (సోస్మితామ్) - **అ - ఈషత్, ఉత్ - ఉద్గతమ్, యత్ స్మితం-హాసః, తేన సహితామ్. తకారలోపః ఛాందసః. భగవత్సంశ్లేషజనిత మహానంద నిమగ్నతయా సర్వదా స్మయమానామ్, (హిరణ్యప్రాకారామ్) హిరణ్మయ ప్రాకార పరివృతానందమయ మండపరత్నాంతర్వాసినీమ్, (ఆర్ద్రామ్) దయార్ద్ర హృదయామ్, దిగ్గజైః అమృతకలశైః స్నాప్యమానతయా ఆర్ద్రదేహాం వా, (జ్వలంతీమ్) లావణ్యమయతేజసా భాసమానామ్, (తృప్తాం) భగవత్సంశ్లేషజనిత మహానందేన తృప్తామ్, (తర్పయంతీమ్) మధురశీతలవిలోకనామృతతరంగపరంపరయా తాపత్రయ తప్తప్రాణిజాత మాహ్లాదయంతీమ్, (పద్మే స్థితామ్) స్వసౌందర్యసౌకుమార్యాను గుణసుగంధ సుశీతలసుఖస్పర్శ పద్మాసనాసీనామ్, (పద్మవర్ణామ్) పద్మసమాన వర్ణామ్, (తామ్ శ్రియమ్) - (ఇహ) త్వచ్ఛేషభూతే మయి, (ఉపహ్వయే) తదనుకూలాంజలి ముద్రాదిభిః అభిముఖీకరోమి.**

ఈ ఋక్కుతో తనపట్ల అభిముఖం అయేటట్లు - తనపట్ల ప్రపన్నురాలు అయేటట్లు లక్ష్మీదేవిని ప్రార్థిస్తున్నాడు.

(కామ్) - సుఖస్వరూపమైనది, (సోస్మితామ్) ఆ = కొంచెం, ఉత్ = బయట వెడలిన, స్మితాం = మందహాసాన్ని కల్గినది - చిరుమందహాసాన్ని కల్గినదని అర్థం. "ఉత్" అనే పదంలోని 'త' కారానికి వచ్చిన లోపం వైదికం. భగవత్ సంశ్లేషంవల్ల కల్గిన మహానందంలో నిమగ్నురాలైనందున ఎల్లప్పుడు ఆ ఆనందాన్ని వ్యక్తం చేసే చిఱునవ్వును కల్గినదని అర్థం.

(హిరణ్యప్రాకారామ్) - బంగారు ప్రాకారాలతో పరివేష్టితమైన ఆనందమయ మండపమనే గొప్ప మణిమండపంలోపల వేంచేసి ఉండేది,

**(ఆర్ద్రామ్)** - దయార్ద్రహృదయాన్ని కల్గినది, అని, లేక, దిగ్గజాలచేత అమృత కలశాలతో అభిషేకింపబడినందున ఆర్ద్రమైన దేహాన్ని కల్గినది - అని అర్థం.

**(జ్వలంతీమ్)** - లావణ్యపూర్ణమైన తేజస్సుతో ఉజ్జ్వలంగా ప్రకాశిస్తున్నది.

**(తృప్తామ్)** - భగవత్సంశ్లేషంవల్ల కల్గిన గొప్ప ఆనందంతో తృప్తిని కల్గినది.

**(తర్పయంతీమ్)** - మధురమైన, చల్లని కటాక్షాలనే అమృతతరంగాల పరంపరతో తాపత్రయాలవల్ల తాపాన్ని పొందిన ప్రాణిసమూహాన్ని ఆనందింప జేసేది,

**(పద్మే స్థితామ్)** - తన సౌందర్యానికి, సౌకుమార్యానికి తగినది, సుగంధాన్ని చల్లదనాన్ని, సుఖస్పర్శను కల ఆసనపద్మంలో ఆసీనురాలై ఉన్నది,

**(పద్మవర్ణామ్)** - పద్మవర్ణంవంటి వర్ణాన్ని కల్గినది అయిన,

**(తామ్ శ్రియమ్)** - ఆ లక్ష్మీదేవిని,

**(ఇహ)** - ఆమెకు శేషభూతుడనైన నా విషయంలో,

**(ఉపహ్వయే)** - ఆమెకు అనుకూలమైన - ఆమె ప్రపన్నురాలు కావడంలో అనుకూలమైన - అంజలిముద్రతో అభిముఖం చేసికొంటున్నాను. నాపట్ల ఆమె అభిముఖ్యాన్ని కలిగి ఉండేటట్లు చేసికొంటున్నాను.

**5.** **చన్ద్రాం ప్రభాసాం యశసాం జ్వలన్తీం**
**శ్రియం లోకే దేవజుష్టా ముదారామ్ ।**
**తాం పద్మనేమీం శరణమహం ప్రపద్యే**
**అలక్ష్మీర్మే నశ్యతాం త్వాం వృణే ॥**

**ఇత్థ మాగతాం లక్ష్మీం ప్రపద్యతే.**

**(చంద్రామ్) ఆశ్రితానా మహ్లాదకారిణీమ్, (ప్రభాసామ్) ప్రకృష్టకాంతిమ్, భాసృ-దీప్తౌ ఇత్యస్మాత్ పచాద్యచ్. (లోకే) సర్వలోకేషు, జాత్యేకవచనమ్. (యశసా) ఆశ్రితసంరక్షణకీర్త్యా, (జ్వలంతీమ్) ప్రకాశమానామ్, దేవైః బ్రహ్మాదిభిః, స్వాభీష్ట సిద్ధయే, జుష్టాం సేవితామ్, (ఉదారామ్) దేవాయాత్మాభీష్టప్రదామ్, పద్మమేవ నేమిః నయనసాధనమ్, యస్యా స్తామ్. నేమి రిత్యౌణాదికో మిప్రత్యయః. స్వకరస్థక మలేన ఆశ్రితానా మనిష్ట మపనీయ సర్వమిష్ట ముపనీయ, స్వచరణాంభోజం ప్రాపయంతీమిత్యర్థః (తామ్) సర్వవేదేషు ప్రసిద్ధామ్, (శ్రియం ప్రపద్యే) సర్వానిష్ట నివృత్తయే భజామి. తేన,**

**(అలక్ష్మీ ర్మే నశ్యతామ్) నష్టా భవతు. పునరిష్టప్రాప్తయే, (వృణే చ త్వామ్) త్వచ్చరణారవింద ముపాయత్వేనాధ్య వస్యామీత్యర్థ.**

ఈవిధంగా తనవద్దకు వచ్చిన లక్ష్మీదేవిని ప్రపత్తి చేస్తున్నాడు.

**(చంద్రామ్)** - ఆశ్రితులకు ఆహ్లాదాన్ని కల్గించేది, **(ప్రభాసామ్)** గొప్ప కాంతిని కల్గినది, **(లోకే)** - అన్ని లోకాలలోను - అని అర్థం. ఇది ఏకవచనాంతపదమైనా, జాత్యేకవచనంగా గ్రహించాలి, **(యశసా)** ఆశ్రితసంరక్షణంవల్ల కల్గిన కీర్తితో, **(జ్వలంతమ్)** - గొప్పగా ప్రకాశిస్తున్నది,

**(దేవజుష్టామ్)** బ్రహ్మాదులచే తమ అభీష్టసిద్ధికోసం సేవింపబడేది.

**(ఉదారామ్)** - దేవతలకు వారి వారి అభీష్టాలను అనుగ్రహిస్తున్నది.

**(పద్మనేమీమ్)** పద్మాన్ని నేమిగా - నయనసాధనంగా - కల్గినది. తన చేతిలోని లీలాకమలంతో ఆశ్రితుల, అనిష్టాన్ని తొలగించి, సర్వాభీష్టాలను కల్గించి, తన శ్రీచరణకమలాలాలను చేర్చేది - అని అర్థం.

**(తామ్)** వేదాలలో ప్రసిద్ధిని కల్గినది అయిన ఆ లక్ష్మీదేవిని,

**(అహం ప్రపద్యే)** - సమస్తానిష్టాలు తీరడంకోసం (లక్ష్మీదేవి అయిన నిన్ను) ప్రపత్తి చేస్తున్నాను. ఆ కారణంగా,

**(అలక్ష్మీః మే నశ్యతామ్)** - నా దారిద్ర్యం తొలగాలి. మళ్ళీ ఇష్టప్రాప్తికోసం, నేను,

**(వృణే చ త్వామ్)** నీ చరణారవిందాలను ఉపాయంగా వరిస్తున్నాను.

**6. ఆదిత్యవర్ణే తపసోఽధిజాతో**
**వనస్పతిస్తవ వృక్షోఽథ బిల్వః ।**
**తస్య ఫలాని తపసా నుదంతు**
**మాయాంతరాయాశ్చ బాహ్యా అలక్ష్మీః ॥**

**అథైతద్వ్యాఖ్యామాయాదినాశ మర్థయతే.**

**(హే ఆదిత్యవర్ణే) సూర్యతుల్యకాంతే, వనానామ్ సర్వవృక్షాణామ్, పతిః వనస్పతిః, అథశబ్దో మంగళార్థకః, (అథ) మంగళస్వరూపో బిల్వవృక్షః, (తపసోధి జాతః) తస్య**

**బిల్వవృక్షస్య, (ఫలాని), (తపసా) వీక్షణనామకీర్తనస్మృతిరూపేణ, (మాయామ్) అజ్ఞానమ్, (అంతరాయం వా) త్వద్భజనసేవాదివిఘ్నభూతాన్, (బాహ్యా అలక్ష్మీః) లక్ష్మీసంబంధరహితా అలక్ష్మీః, (నుదంతు) - నివారయతు.**

ఇందులో, దారిద్ర్యనాశానికి విఘ్నమైన మాయాదులు నశించాలని ప్రార్థిస్తున్నాడు.

**(ఆదిత్యవర్ణే)** - సూర్యుని కాంతివంటి కాంతిని కలదానా!,

**(వనస్పతిః)** - వనాలంటే వృక్షాలు. వృక్షాలలో శ్రేష్ఠమైనది వనస్పతి. సూక్తంలోని "**అథ**" శబ్దం మంగళార్థకం.

**(అథ)** - మంగళస్వరూపమైన,

**(బిల్వఃవృక్షః)** - బిల్వవృక్షం (మారేడుచెట్టు),

**(తపసోఽధిజాతః)** - తపస్సువల్ల (సంకల్పం వల్ల) పుట్టింది.

**(తస్య ఫలాని)** - ఆ బిల్వవృక్షంయొక్క ఫలాలు,

**(తపసా)** - వీక్షణ (దర్శన), నామసంకీర్తన, స్మృతిరూపమైన తపస్సుతో,

**(మాయామ్)** - అజ్ఞానాన్ని (అంతరాయాన్ని) - నిన్ను భజించడం, సేవించడం మొదలనవానిలో కలిగే ఆటంకాలను,

**(బాహ్యాః అలక్ష్మీః)** - బాహ్యమైన దారిద్ర్యాన్ని,

**(నుదంతు)** నివారించుగాక.

**7. ఉపైతు మాం దేవసఖః కీర్తిశ్చ మణినా సహ ।**
**ప్రాదుర్భూతోఽస్మి రాష్ట్రేఽస్మిన్ కీర్తిమృద్ధిం దదాతు మే ॥**

**విద్యైశ్వర్యాదిప్రాప్తినిదానకీర్త్యాదిక మర్థయతే.**

**(హే దేవి) (మామ్) త్వదాశ్రయమ్, (కీర్తిః) విద్యైశ్వర్యాదికృతా ప్రథా, (మణినా) రత్నాదిభిః, (సహ) యుగపత్, (ఉపైతు) ప్రాప్నోతు, (అహ మస్మిన్ లోకే ప్రాదుర్భూతోఽస్మి) త్వత్ప్రసాదాత్ ప్రబుద్ధోఽస్మి, (కీర్తిమృద్ధిమ్) ధనాదిసమృద్ధిం చ, (మే) మహ్యమ్ (దదాతు) దిశతు. సా లక్ష్మీ రితి శేషః.**

విద్య, ఐశ్వర్యం ఇత్యాదులకు మూలకారణంగా కల కీర్తి మొదలైనవానిని ఇందులో ప్రార్థిస్తున్నాడు.

(దేవి) - లక్ష్మీదేవీ!, (మామ్) - నిన్ను ఆశ్రయంగా కల్గిన నన్ను, (కీర్తిః) - విద్య, ఐశ్వర్యం మొదలైనవానివల్ల కలిగే కీర్తి, **(మణినా సహ)** రత్నాదులతో పాటు,

**(ఉపైతు)** - పొందుగాక,

**(అహమస్మిన్ లోకే ప్రాదుర్భూతోఽస్మి)** - నేను ఈ లోకంలో నీ అనుగ్రహం వల్ల ప్రబోధాన్ని కల్గినవాడనయ్యాను.

**(కీర్తిమృద్ధిమ్)** - ధనాదిసమృద్ధినికూడ, **(మే)** నాకు, **(దదాతు)** ఆ లక్ష్మీదేవి అనుగ్రహించాలి.

**8. క్షుత్పిపాసాం మలాం జ్యేష్ఠామలక్ష్మీం నాశయామ్యహమ్ ।**
**అభూతిమసమృద్ధిఞ్చ సర్వాం నిర్ణుద మే గృహాత్ ॥**

**అలక్ష్మీనివృత్తి మర్థయతే.**

**(క్షుత్) అశనేచ్ఛా, (పిపాసా) పానేచ్ఛా, తదుభయహేతుభూతామ్. కార్యే కారణోప చారః (మలామ్) మాలిన్యకరణీమ్, (జ్యేష్ఠామ్ అలక్ష్మీమ్) (అశ్రియమ్) (అహం నాశయామి) త్వత్సమాశ్రయబలేన ధ్వంసయామి, (హే దేవి) (అభూతిమ్) గృహక్షేత్రా రామదాసీదాసాదిః విభూతిః, తద్విరోధినీమ్, అకారో విరోధార్థకః. (అసమృద్ధిమ్) ధాన్యమణిసువర్ణరూప్యాదిసమృద్ధిః తద్విఘాతినీమ్, (సర్వామ్ అలక్ష్మీమ్), (మే గృహాన్నిర్ణుద) నివారయ.**

ఇందులో దారిద్ర్యనివృత్తిని అర్థిస్తున్నాడు.

**(క్షుత్)** - అన్నాన్ని తినాలనే కోరిక, **(పిపాసా)** - జలాదులను పానం చేయాలనే కోరిక. ఇక్కడ ఈ రెండు పదాలు ఈ క్షుత్పిపాసలకు కారణమైనవానిని లక్షిస్తాయి. (అంటే - కార్యాన్ని నిర్దేశించడంద్వారా వాని కారణం లక్షింపబడింది), **(మలామ్)**- మాలిన్యాన్ని కల్గించే, **(జ్యేష్ఠామ్ అలక్ష్మీమ్)** దారిద్ర్యాన్ని, **(అహం నాశయామి)** - నేను నిన్ను ఆశ్రయించిన బలంవల్ల నశింపజేసికొంటున్నాను.

**(దేవి!)** ఓ లక్ష్మీదేవీ, **(అభూతిమ్)** - గృహక్షేత్రాలు, ఆరామాలు, దాసదాసీజనాలు మొదలైన సంపదకు విరోధి,

**(అసమృద్ధిమ్)** ధనధాన్యమణిసువర్ణరౌప్యాది సమృద్ధికి విఘాతాన్ని కల్గించేది అయిన, **(సర్వామ్ అలక్ష్మీమ్)** - సమస్తమైన దారిద్ర్యాన్ని, **(మే గృహాత్ నిర్ణుద)** నా గృహంనుండి పోగొట్టు.

9. గంధాద్వారాం ధురాధర్షాం నిత్యపుష్టాం కరీషిణీమ్ ।
ఈశ్వరీం సర్వభూతానాం తామిహోపహ్వయే శ్రియమ్ ॥

ఏవమలక్ష్మీం స్వగృహాత్ పరాణుద్య పున ర్లక్ష్మీమాహ్వయతి.

గంధః చందన పుష్పాద్యామోదః, స, ద్వారమ్ ఆగమనసాధనం యస్యా స్సా గంధద్వారా, ఆరాధనోపకరణగంధ పుష్పధూప దీపాదియుక్తే గృహే కృతసన్నిధానా మిత్యర్థః. (ఈశ్వరీం సర్వభూతానామ్) సర్వభూతానాం సమస్తజంతూనామ్, బ్రహ్మాది స్తంబపర్యంతానామ్, (ఈశ్వరీమ్) నియంత్రీమ్, (తామ్) పూర్వోక్తాం శ్రియమ్, (ఇహ) పూర్వోక్తే త్యక్తలక్ష్మీకే గృహే, (ఉపహ్వయే) సర్వసమృద్ధ్యర్థ మావాహయామి.

ఈవిధంగా అలక్ష్మిని తన గృహంనుండి పూర్తిగా లేకుండా చేసికొని, మళ్ళీ లక్ష్మీ దేవిని ఇందులో ఆహ్వానిస్తున్నాడు.

(గంధద్వారామ్) - చందనం పుష్పం మొదలైనవాని సుగంధాన్ని ఆగమన సాధనం కల్గినది - అని అర్థం. ఆరాధనకు ఉపకరణాలైన గంధపుష్ప ధూపదీపాదు లతో కూడిన గృహంలోకి వచ్చి, వేంచేసి ఉండేదని భావం.

(దురాధర్షామ్) - ఆ విధంగా గంధపుష్పాది ఆరాధనోపకరణాలు లేకపోతే పొందడానికి అశక్యమైనది,

(నిత్యపుష్టామ్) - ఎల్లప్పుడు సంతుష్టురాలై ఉండేది,

(కరీషిణీమ్) - ఇచట కరీష పుష్పంతో సర్వసమృద్ధి లక్షింపబడుతున్నది. "కరి" అనే పదాన్ని, "ఇషు-ఇచ్ఛాయామ్" అనే ధాతువు, "ఇణ్-గతౌ" అనే ధాతువు కలువగా ఏర్పడిన రూపంగా దానిని గ్రహించవచ్చు. అపుడు త్రికరణశుద్ధిని కల్గినదని, వర్ణాశ్రమ ధర్మానుష్ఠానం మొదలైన ప్రవృత్తిక్రియలను, భగవత్ప్రవృత్తి విరోధిస్వప్రవృత్తిని వృత్తిరూపమైన ప్రపత్తిని నిర్వహింపజేసేదనే అర్థాన్ని ఇస్తుంది. లేక, "కరి" అనే పదం సృష్ట్యాది కార్యాలను నిర్వహింపజేసేది-అని, దానితో చేరిన రెండు ధాతువుల వల్ల ఈమె అన్నిటిని పొందినదని, అన్నీ ఈమెను పొందుతున్నాయనే అర్థం స్ఫురిస్తుంది.

(ఈశ్వరీం సర్వభూతానామ్) - బ్రహ్మాది తృణపర్యంతమైన సమస్తప్రాణులకు ఈశ్వరి, (తామ్) అటువంటి లక్ష్మీదేవిని,

(ఇహ) పూర్వం తెలుపబడిన అలక్ష్మి లేకుండా చేయబడిన నా గృహంలోకి, (ఉపహ్వయే) - సర్వసమృద్ధిని అనుగ్రహించడంకోసం ఆవాహన చేస్తున్నాను.

**10. మనసః కామమాకూతిం వాచః సత్యమశీమహి ।**
**పశూనాం రూపమన్నస్య మయి శ్రీః శ్రయతాం యశః ॥**

**అథ లక్ష్మ్యాగమనోత్తరకాలభావినః కామాదీనర్థయతే.**

**(మనసః కామమ్) మనసా కామ్యమానమ్ అభీష్టపుత్రాదికమ్, (ఆకూతిమ్) అభిప్రాయగతమ్, మనోరథ పరికల్పిత మిత్యర్థః. (వాచస్సత్యమ్) వాచా యాచ్య మాన మభిలషితమ్, (పశూనామ్) ధేనూనామ్, (రూపమ్) స్వరూపమ్, (అన్నస్య) అదనీయద్రవ్యస్య సంబంధి. (యశః) ప్రథామ్, పూర్తి మితి యావత్. (అశీమహి) "అశూ-వ్యాప్తౌ" ఇత్యస్మా లిజుత్తమబహువచనమ్, (మమ) మత్సంబంధినాం చ ఏతదస్తీతి జ్ఞాపనార్థం బహువచనమ్. ఏతదర్థం శ్రీర్మయి శ్రయతామ్.**

ఇందులో లక్ష్మీదేవి రాగానే తరువాత సిద్ధించే అభీష్టాలను అర్థిస్తున్నాడు.

**(మనసః కామమ్)** - మనస్సుతో అభిలషించేది (అభీష్టాలైన పుత్రాదులను), **(ఆకూతిమ్)** - అభిప్రాయాగతమైనది - మనోగతమైనది - అని అర్థం, **(వాచస్సత్యమ్)** వాక్కుతో యాచింపబడేవి అయిన అభీష్టాలను, **(పశూనామ్ రూపమ్)** ధేనువుల స్వరూపాన్ని, **(అన్నస్య)** - భుజించే వస్తువునకు చెందిన, **(యశః)** - కీర్తిని - అంటే - పూర్తిని, **(అశీమహి)** విస్తృతంగా పొందెదముగాక! నాకే కాక, నాకు సంబంధించిన వారికి కూడా ఈ సమృద్ధి ఉన్నదని తెలుపడంకోసం బహువచనం ప్రయోగింప బడింది. ఇందుకోసంగా, ఇవి సిద్ధించడం కోసంగా, **(శ్రీః మయి శ్రీయతామ్)** లక్ష్మీదేవి నన్ను ఆశ్రయించుగాక - నావద్దకు వేంచేయాలని భావం.

**11. కర్దమేన ప్రజాభూతా మయి సంభవ కర్దమ ।**
**శ్రియం వాసయ మే కులే మాతరం పద్మమాలినీమ్ ॥**

**"క్షీరోదార్ణవసంభూతాం శ్రియం జగ్రాహ కర్దమః, ప్రజాత్వేన తదా విప్ర! స్తదా ప్రభృతి కర్దమః, పితా" ఇతి వచనాత్ శ్రీపితృభూతం కర్దమం ప్రతిబోధ్య, తన్ముఖే నాపి శ్రీసాన్నిధ్య మర్థయతే.**

(హే కర్దమ), (కర్దమేన) కర్దమనామ్నా త్వయా, (ప్రజాభూతా) ప్రజాత్వేన ప్రాప్తా, **(అభూత)** తద్భావే చ్వి:. ఈత్వాభావ శ్ఛాందసః. **అత** స్తాం శ్రియమ్. (మయి సంభవ) సంభావయ. సముద్భావయేత్యర్థః కిం చ, (మాతరమ్) మాతృత్వ ప్రయుక్త వాత్సల్యవతీమ్, (పద్మమాలినీమ్) పద్మరచితమాలావతీమ్, (శ్రియమ్) త్వత్పుత్రీమ్, (మే కులే) సంతానే, పుత్రపౌత్రాదిషు, గృహే, (వాసయ)

**"క్షీరోదార్ణవసంభూతాం శ్రియం జగ్రాహ కర్దమః, ప్రజాత్వేన తదా విప్ర! తదా ప్రభృతి కర్దమః పితా"** (పాలసముద్రంనుండి ఆవిర్భవించిన లక్ష్మీదేవిని కర్దమ ప్రజాపతి తన కుమార్తెగా పరిగ్రహించాడు. అప్పటినుండి కర్దముడు ఆమెకు తండ్రి అయ్యాడు) అనే పౌరాణికవచనంవల్ల లక్ష్మీదేవికి కర్దముడు తండ్రి అని తెలుస్తున్నది. అటువంటి కర్దముని సంబోధిస్తూ, అతనిద్వారాకూడా శ్రీసాన్నిధ్యాన్ని ప్రార్థిస్తున్నాడు.

(కర్దమ) - ఓ కర్దమప్రజాపతీ!, (కర్దమేన) - కర్దముడనే పేరును గల నీచే, **(ప్రజాభూతా)** లక్ష్మీదేవి పుత్రికగా పొందినదిగా, **(అభూత)** అయినదో, అటువంటి లక్ష్మిని, **(మయి సంభవ)** నా విషయంలో నీవు సంభావన చేయాలి. ఆమె నా వద్దకు వేంచేసేటట్లు చేయాలి. అంతేకాక,

**(మాతరమ్)** మాతృత్వరూప సంబంధంవల్ల వాత్సల్యగుణాన్ని కల్గినది, **(పద్మ మాలినీమ్)** పద్మాలతో కూర్చిన మాలికలను ధరించినది అయిన, (శ్రియమ్) నీ పుత్రిక లక్ష్మీదేవిని, **(మే కులే)** - నా సంతానంలో పుత్రపౌత్రాది పర్యంతంగా, (గృహే) వారి ఇళ్ళలో, (వాసయ) నివసింపజేయాలి.

**12.** **ఆపః సృజంతు స్నిగ్ధాని చిక్లీత వస మే గృహే ।**
**ని చ దేవీం మాతరం శ్రియం వాసయ మే కులే ॥**

**అథ శ్రియో దౌవారిక మర్థయతే.**

**చిక్లీతో నామ భగవదంతఃపురద్వారపాలః. తథా చ పౌరాణికాః-"పద్మో భోగనిధిః శంఖః చతుర్దంతో గజ స్తథా, కల్యాణసర్పః పంచాస్యః చిక్లీతో గృహరక్షకాః" ఇతి. (హే చిక్లీత), (అపః) భగవదాయతనభూతాః, (స్నిగ్ధాని) ఆజ్యదధిప్రభృతీని, (సృజంతు) ఉత్పాదయంతు, త్వత్ప్రేరితా ఆపః మే గాః సంపాదయంత్విత్యర్థః. మమ, (గృహే) శ్రీమతి భగవద్భవనద్వార ఇవ, (వస) తిష్ఠ, స్థిత్వా చ, (తాం దేవీమ్) ద్యోతనశీలామ్,**

(మాతరమ్) అస్మాకం జననీమ్, సర్వసమాశ్రయణీయామ్, (మే కులే) గృహే, (నివాసయ) నిశ్చలం ప్రతిష్ఠాపయ. పునర్నిర్గమన మస్యాః ప్రతిషేధయే త్యర్థః. "వ్యవహితాశ్చే" త్యుపసర్గస్య వ్యవధానం ఛాందసమ్.

ఇందులో లక్ష్మీదేవి ద్వారపాలకులు ప్రార్థింపబడుతున్నారు. ఈ ఋక్కులో ప్రస్తావింపబడిన చిక్లీతుడు భగవానుని అంతఃపుర ద్వారపాలకుడు. "పద్మో భోగనిధిః శంఖః చతుర్దంతో గజ స్తథా, కల్యాణసర్పః పంచాస్యః చిక్లీతో గృహరక్షకాః" (పద్ముడు, భోగనిధి, శంఖుడు, చతుర్దంతుడు, గదుడు, కల్యాణసర్పుడు, పంచాస్యుడు, చిక్లీతుడు - అనేవారు భగవానుని గృహరక్షకులు). అని పౌరాణిక సూక్తి.

**(చిక్లీత)** - ఓ చిక్లీతుడా!, **(ఆపః)** భగవానుని నివాసస్థానమైన జలాలు **(స్నిగ్ధాని)**- ఆజ్యం, దధి మొదలైన స్నేహగుణాన్ని కల్గిన ద్రవ్యాలను, **(సృజంతు)** - ఉత్పాదన చేయుగాక - నీచే ప్రేరేపింపబడినవై సృష్టించుగాక - అని అర్థం. **(మే గృహే)** నా గృహంలో భగవానుని భవనద్వారంలోవలె, **(వస)** వేంచేసి ఉండు, అవిధంగా ఉండి, **(తాం దేవీమ్)** ఆ గొప్పగా ప్రకాశించేది. **(మాతరమ్)** మనకు తల్లి, అందువల్ల అందఱిని ఆశ్రయింపదగినది అయిన లక్ష్మీదేవిని, **(మే కులే వాసయ)** నా గృహంలోనే నిశ్చలంగా ప్రతిష్ఠింపజేయి. తిరిగి ఆమె వెళ్ళిపోకుండా ఉండేటట్లు చేయాలి.

**13. ఆర్ద్రాం పుష్కరిణీం యష్టిం పింగళాం పద్మమాలినీమ్ ।**
**చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥**

**అథ లక్ష్మీపతి మర్థయతే.**

**(ఆర్ద్రామ్)** దయార్ద్రామ్, **(పుష్కరిణీమ్)** పద్మసమానాకారామ్, యద్వా, పద్మవర్తినీ మిత్యర్థః. (యష్టిమ్) యజనక్రియాస్వరూపామ్, సకలయజ్ఞ నిర్వాహకా మిత్యర్థః. పరిప్రసారణాభావ ఆర్షః. (యష్టిమ్) యష్టివత్తన్వీ వా, (పింగళామ్) పింగళ వర్ణా మిత్యర్థః, (పద్మమాలినీమ్) దివ్యవిగ్రహోచిత పద్మమాలాలంకృతామ్, (చంద్రామ్) ఆహ్లాదకారిణీమ్, (హిరణ్మయీం లక్ష్మీమ్) (జాతవేదో మమావహ) భగవన్! మహ్య మావహ - ఆవాహయ. మాం ప్రాపయేత్యర్థః.

ఇందులో శ్రియఃపతిని ప్రార్థిస్తున్నాడు.

**(ఆర్ద్రామ్)** - దయాగుణంతో ఆర్ద్రమైనది, **(పుష్కరిణీమ్)** - పద్మసమానాకార- అని గాని, లేక, పద్మంలో నివసించేది - అనిగాని అర్థం.

**(యష్టిమ్)** యజనక్రియాస్వరూపిణి - అన్ని యజ్ఞాలను నిర్వహింపజేసేది - అని అర్థం. లేక, యష్టివలె సుకుమారమైన దేహాన్ని కల్గినదని అర్థం. **(పింగళామ్)**- పింగళవర్ణాన్ని కల్గినది, **(పద్మమాలినీమ్)** - తన దివ్యమంగళవిగ్రహానికి తగిన పద్మ మాలికలచే అలంకరింపబడినది,

**(చంద్రామ్)** - ఆహ్లాదాన్ని కల్గించేది, **(హిరణ్మయీం లక్ష్మీమ్)** - బంగారు వర్ణాన్ని కల్గిన లక్ష్మీదేవిని, **(జాతవేదః)** - ఓ శ్రియఃపతీ,

**(మమ ఆవహ)** - నన్ను చేరేటట్లు, నావద్దకు వేంచేసేటట్లు చేయాలి.

**14. ఆర్ద్రాం పుష్కరిణీం పుష్టిం సువర్ణాం హేమమాలినీమ్ ।**
**సూర్యాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ ॥**

**అతిశయాత్ పూర్వోక్తం పునరాహ.**

ఆర్ద్రాం పుష్కరిణీమితి గతార్థః. (పుష్టిమ్) పుష్టిస్వరూపామ్, (సువర్ణామ్) సమీచీన వర్ణామ్, (సూర్యామ్) సుష్ఠు జగదీరయంతీమ్, "రాజసూయే" త్యాదినా నిపాతితోఽయమ్. అన్యత్ సర్వం గతార్థమ్.

గడచిన ఋక్కులలో తెలుపబడ్డ అర్థమే ఆదరాతిశయంవల్ల ఇందులో మళ్ళీ తెలుపబడుతున్నది. "**ఆర్ద్రామ్, పుష్కరిణీమ్**" అనే పదాలకు ముందు తెలుపబడిన అర్థాన్ని గ్రహించాలి.

**(పుష్టిమ్)** పుష్టిస్వరూపిణి, **(సువర్ణామ్)** చక్కని వర్ణాన్ని కల్గినది, **(సూర్యామ్)** చక్కగా జగత్తును అంతటిని ప్రేరేపించేది, **(హిరణ్మయీం లక్ష్మీమ్)** బంగారు వర్ణాన్ని కల్గినదైన లక్ష్మీదేవిని, **(జాతవేదః)** ఓ శ్రియఃపతీ! **(మమ ఆవహ)** - నావద్దకు వేంచేటట్లు అనుగ్రహించు.

**15. తాం మ ఆవహ జాతవేదో లక్ష్మీమనపగామినీమ్ ।**
**యస్యాం హిరణ్యం ప్రభూతం గావో దాస్యోఽశ్వాన్**
**విందేయం పురుషానహమ్ ॥**

**(హే జాతవేదః) భగవన్, యస్యామ్ లక్ష్మ్యా మాగతాయామ్, (ప్రభూతమ్) పుష్కలమ్, (హిరణ్యమ్) ధనమ్, (గావః) గోమహిషాదీన్, (దాస్యః) దాసీజనాన్,**

**(పురుషాన్) పుత్రపౌత్రమిత్రాదీన్, (విందేయమ్) లభేయమ్, (అనపగామినీమ్) నివృత్తిరహితామ్, (తాదృశీం లక్ష్మీమ్) (మే) మదర్థం, (ఆవహ).**

**ఏవమర్థానుసంధానపురస్సరం శ్రీదేవ్యాః పంచదశర్చస్య సూక్తస్య జపం, హోమం, తర్పం, బ్రహ్మణారాధనం చ కుర్వన్ పుమాన్ ఇహ సకలసౌభాగ్యనిధానమ్, పరత్ర పరమసుఖభాజనం చ భవతీతి సర్వత్ర సర్వమంగళమ్.**

**వ్యాఖ్యా మేతాం తు యో భక్త్యా వదేద్వా శ్రుణుయాద్బుధః ।**
**నారాయణవధూః సాక్షాదిష్టం తస్మై ప్రయచ్ఛతి ॥**

**స్నాయాత్ పిబేత్ జపేదర్చేదశ్నీయాదభిమంత్రితమ్ ।**
**ఏవం తరతి దారిద్ర్యం హువేదాజ్యైః పుమాన్ ధ్రువమ్ ॥**

**శ్రీసూక్తభాష్యమ్ సంపూర్ణమ్**

**(జాతవేదః)** - ఓ శ్రియఃపతీ!, ఏ లక్ష్మీదేవి వేంచేస్తే, **(ప్రభూతమ్)** - పుష్కలమైన, **(హిరణ్యమ్)** ధనాన్ని, **(గావః)** గోమహిషాది పశుసంపదను, **(దాస్యః)** దాసీజనాన్ని, **(అశ్వాన్)** అశ్వాలను, **(పురుషాన్)** పుత్రపౌత్రమిత్రాదులను, **(విందేయమ్)** - పొందగలనో, **(అనపగామినీమ్)** - నివృత్తి లేనిది - తిరిగి వెడలిపోనిది అయిన ఆ లక్ష్మిని, **(మే ఆవహ)** - నాకోసం వేంచేసేటట్లు చేయాలి.

ఈ విధంగా అర్థానుసంధాన పూర్వకంగా శ్రీదేవి వైభవాన్ని కీర్తించే పదిహేను ఋక్కులు కల శ్రీసూక్తంయొక్క జపాన్ని, హోమాన్ని, తర్పణాన్ని, ఆ తరువాత భాగవతారాధనాన్ని చేసేవాడు ఈ లోకంలో సకలసౌభాగ్యాలను కలవాడై, పరలోకంలో పరమసుఖమనబడే భగవత్ప్రాప్తిని పొందగలడు. అందువల్ల ఈ సూక్తం ఈ లోక పరలోకాలలో ప్రియ షితాలను సాధించగల్గినది.



శ్రీపరాశర భట్టర్ అనుగ్రహించిన

# శ్రీగుణరత్నకోశమ్

## శ్రీపరాశర భట్టర్ తనియన్

శ్రీపరాశరభట్టార్యః శ్రీరఙ్గేశపురోహితః ।
శ్రీవత్సాఙ్కసుతః శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే ॥

1) శ్రియై సమస్తచిదచిద్విధానవ్యసనం హరేః ।
అఙ్గీకారిభి రాలోకైః సార్థయన్త్యై కృతోఽఞ్జలిః ॥

2) ఉల్లాసపల్లవిత పాలితసప్తలోకీ
నిర్వాహకోరకిత నేమకటాక్షలీలామ్ ।
శ్రీరఙ్గహర్మ్యతల మఙ్గళదీపరేఖాం
శ్రీరఙ్గరాజమహిషీం శ్రియ మాశ్రయామః ॥

3) అనుకల తనుకాణ్డాలిఙ్గనారమ్భశుమ్భత్
ప్రతిదిశభుజశాఖ శ్రీసఖానోకహార్ధిః ।
స్తననయనగుళుచ్ఛ స్ఫారపుష్పద్విరేఫా
రచయతు మయి లక్ష్మీకల్పవల్లీ కటాక్షాన్ ॥

4) యద్భ్రూభఙ్గాః ప్రమాణం స్థిరచరరచనా తారతమ్యే మురారేః
వేదాన్తా స్తత్త్వచిన్తాం మురభిదురసి యత్పాదచిహ్నై స్తరన్తి ।
భోగోపోద్ఘాతకేళీ చుళుకితభగవద్వైశ్వరూప్యానుభావా
సా వ శ్రీ రాస్తృణీతా మమృతలహరిధీలఙ్ఘనీయై రపాఙ్గైః ॥

5) యద్యావత్తవ వైభవం తదుచితస్తోత్రాయ దూరే స్పృహా
స్తోతుం కే వయమిత్యదశ్చ జగృహుః ప్రాఞ్చో విరిఞ్చ్యాదయః ।
అప్యేవం తవ దేవి! వాఙ్మనసయో ర్భాషానభిజ్ఞం పదం
కావాచః ప్రయతామహే కవయితుం స్వస్తి ప్రశస్త్యై గిరామ్ ॥

6) స్తోతారం తముశన్తి దేవి! కవయో యో విస్తృణీతే గుణాన్
స్తోతవ్యస్య తతశ్చ తే స్తుతిధురా మయ్యేవ విశ్రామ్యతి ।
యస్మాదస్మదమర్షణీయఫణితి స్వీకారత స్తే గుణాః
క్షాన్త్యౌదార్యదయాదయో భగవతి! స్వాం ప్రస్తువీరన్ ప్రథామ్ ॥

7) సూక్తిం సమగ్రయతు నః స్వయమేవ లక్ష్మీః
శ్రీరఙ్గరాజమహిషీ మధురైః కటాక్షైః ।
వైదగ్ధ్యవర్ణ గుణగుమ్భన గౌరవై ర్యాం
కణ్డూలకర్ణకుహరాః కవయో ధయన్తి ॥

8) అనాఘ్రాతావద్యం బహుగుణపరీణాహి మనసో
దుహానం సౌహార్దం పరిచితమివాథాఽపి గహనమ్ ।
పదానాం సౌభ్రాత్రాత్ అనిమిషనిషేవ్యం శ్రవణయోః
త్వమేవ శ్రీర్మహ్యం బహుముఖయ వాణీవిలసితమ్ ॥

9) శ్రియశ్శ్రీః! శ్రీరఙ్గేశయ! తవ చ హృద్యాం భగవతీం
శ్రియం త్వత్తోఽప్యుచ్చైః వయ మిహ ఫణామః శృణుతరామ్ ।
దృశౌ తే భూయాస్తాం సుఖతరళతారే శ్రవణతః
పునః హర్షోత్కర్షాత్ స్ఫుటతు భుజయోః కఞ్చుకశతమ్ ॥

10) దేవి! శ్రుతిం భగవతీం ప్రథమే పుమాంసః
త్వత్సద్గుణౌఘ మణికోశగృహాం గృణన్తి ।
తద్ద్వారపాటనపటూని చ సేతిహాస -
సన్తర్కణస్మృతిపురాణ పురస్సరాణి ॥

11) ఆహుర్వేదా నమానం కతిచన కతిచారాజకం విశ్వమేతత్
రాజన్వత్ కేచిదీశం గుణినమపి గుణై స్తం దరిద్రాణమన్యే ।
భిక్షావన్యే సురాజమ్భవమితి చ జడాస్తే తలాతల్యకార్షుః
యే తే శ్రీరఙ్గహర్మ్యాఙ్గణ కనకలతే! న క్షణం లక్ష్యమాసన్ ॥

12) మనసి విలసితాక్షా భక్తిసిద్ధాఞ్జనేన
శ్రుతిశిరసి నిగూఢం లక్ష్మి! తే వీక్షమాణాః ।
నిధిమివ మహిమానం భుఞ్జతే యేఽపి ధన్యాః
నను భగవతి! దైవీం సంపదం తేఽభిజాతాః ॥

13) అస్యేశానా జగత ఇతి తేఽధీమహే యాం సమృద్ధిం
శ్రీః! శ్రీసూక్తం బహుముఖయతే తాం చ శాఖానుశాఖమ్ ।
ఈష్టే కశ్చిజ్జగత ఇతి యః పౌరుషే సూక్త ఉక్తః
తం చ త్వత్కం పతిమధిజగా వుత్తర శ్చానువాకః ॥

14) ఉద్బాహుస్త్వా ముపనిషదసా వాహ నైకా నియన్త్రీం
శ్రీమద్రామాయణమపి పరం ప్రాణితి త్వచ్చరిత్రే ।
స్మర్తారోఽస్మజ్జనని! యతమే సేతిహాసైః పురాణైః
నిన్యుర్వేదా నపి చ తతమే త్వన్మహిమ్ని ప్రమాణమ్ ॥

15) ఆకుగ్రామనియామకాదపి విభోరాసర్వనిర్వాహకాత్
ఐశ్వర్యం యదిహోత్తరోత్తరగుణం శ్రీరఙ్గభర్తుః ప్రియే! ।
తుఙ్గం మఙ్గళ ముజ్జ్వలం గరిమవత్పుణ్యం పునః పావనం
ధన్యం యత్తదదశ్చ వీక్షణభువ స్తే పఞ్చషా విప్రుషః ॥

16) ఏకో ముక్తాతపత్ర ప్రచలమణిఘృణాత్కారిమౌళి ర్మనుష్యః
దృప్యద్దన్తావళస్థో న గణయతి నతాన్ యత్ క్షణం క్షోణిపాలాన్ ।
యత్తస్మై తిష్ఠతేఽన్యః కృపణ మశరణో దర్శయన్ దన్తపఙ్క్తీః
తత్తే శ్రీరఙ్గరాజప్రణయిని! నయనోదఞ్చితన్యఞ్చితాభ్యామ్॥

17) రతిర్మతి సరస్వతీ ధృతిసమృద్ధిసిద్ధిశ్రియః
సుధాసఖి! యతోముఖం చిచలిషేత్ తవ భ్రూలతా ।
తతోముఖ మథేన్దిరే! బహుముఖీ మహంపూర్వికాం
విగాహ్య చ వశంవదాః పరివహన్తి కూలఙ్కషాః ॥

18) సహస్థిరపరిత్రస వ్రజవిరిఞ్చనాకిఞ్చనైః
అనోకహబృహస్పతి ప్రబలవిక్లబప్రక్రియమ్ ।

ఇదం సదసదాత్మనా నిఖిలమేవ నిమ్నోన్నతం
కటాక్షతదుపేక్షయో స్తవ హి లక్ష్మి! తత్తాణ్డవమ్ ॥

19) కాలే శంసతి యోగ్యతాం చిదచితో రన్యోన్యమాలిఙ్గతోః
భూతాహఙ్కృతిబుద్ధి పఞ్చకరణీః స్వాన్తప్రవృత్తీన్ద్రియైః ।
అణ్డానావరణైః సహస్రమకరోత్ తాన్ భూర్భువ స్స్వర్వతః
శ్రీరఙ్గేశ్వరదేవి! తే విహృతయే సఙ్కల్పమానః ప్రియః ॥

20) శబ్దాదీన్ విషయాన్ ప్రదర్శ్య విభవం విస్మార్య దాస్యాత్మకం
వైష్ణవ్యా గుణమాయయాఽఽత్మనివహాన్ విప్లావ్య పూర్వః పుమాన్ ।
పుంసా పణ్యవధూవిడమ్బివపుషా ధూర్తానివాయాసయన్
శ్రీరఙ్గేశ్వరి! కల్పతే తవ పరీహాసాత్మనే కేళయే ॥

21) యద్దూరే మనసో యదేవ తమసః పారే యదత్యద్భుతమ్
యత్కాలాదపచేళిమం సురపురీ యద్గచ్ఛతో దుర్గతిః ।
సాయుజ్యస్య యదేవ సూతి రథవా యద్దుర్గ్రహం మద్గిరామ్
తద్విష్ణోః పరమం పదం తవ కృతే మాత స్సమామ్నాసిషుః ॥

22) హేలాయా మఖిలం చరాచరమిదం భోగే విభూతిః పరా
ధన్యా స్తే పరిచారకర్మణి సదా పశ్యన్తి యే సూరయః ।
శ్రీరఙ్గేశ్వరదేవి! కేవలకృపానిర్వాహ్యవర్గే వయం
శేషిత్వే పరమః పుమాన్ పరికరా హ్యేతే తవ స్ఫారణే ॥

23) ఆజ్ఞానుగ్రహభీమ కోమలపురీపాలా ఫలం భేజుషాం
యాఽఽయోధ్యేత్యపరాజితేతి విదితా నాకం పరేణ స్థితా ।
భావై రద్భుతభోగభూమగహనై స్సాన్ద్రా సుధాస్యన్దిభిః
శ్రీరఙ్గేశ్వరగేహలక్ష్మి! యువయో స్తాం రాజధానీం విదుః ॥

24) తస్యాఞ్చ త్వత్కృపావన్నిరవధిజనతావిశ్రమార్హావకాశం
సఙ్కీర్ణం దాస్యతృష్ణా కలితపరికరైః పుమ్భి రానన్దనిఘ్నైః ।
స్నేహాదస్థానరక్షావ్యసనిభి రభయం శార్ఙ్గచక్రాసిముఖ్యైః
అనన్తైకార్ణవం శ్రీర్భగవతి! యువయో రాహు రాస్థానరత్నమ్॥

25) తత్ర స్రక్స్పర్శగన్ధం స్ఫురదుపరి ఫణారత్నరోచిర్వితానం
విస్తీర్యానన్తభోగం తదుపరి నయతా విశ్వమేకాతపత్రమ్ ।
తైస్తైః కాన్తేన శాన్తోదితగుణవిభవై రర్హతా త్వామసహ్యైః
అన్యోఽన్యాద్వైతనిష్ఠాఘనరసగహనాన్ దేవి! బధ్నాసి భోగాన్ ॥

26) భోగ్యా వామపి నాన్తరీయకతయా పుష్పాఙ్గరాగై స్సమం
నిర్వృత్తప్రణయాతివాహనవిధౌ నీతాః పరీవాహతామ్ ।
దేవి! త్వామను నీళయా సహ మహీదేవ్య స్సహస్రం తథా
యాభి స్త్వం స్తనబాహుదృష్టిభిరివ స్వాభిః ప్రియం శ్లాఘసే॥

27) తే సాధ్యా స్సన్తి దేవా జనని! గుణవపుర్వేషవృత్తస్వరూపైః
భోగైర్వా నిర్విశేషా స్సవయస ఇవ యే నిత్యనిర్దోషగన్ధాః ।
హే శ్రీః! శ్రీరఙ్గభర్తు స్తవ చ పదపరీచారవృత్త్యై సదాపి
ప్రేమప్రద్రాణభావావిలహృదయ హఠాత్కారకైఙ్కర్యభోగాః ॥

28) స్వరూపం స్వాతన్త్ర్యం భగవత ఇదం చన్ద్రవదనే!
త్వదాశ్లేషోత్కర్షా ద్భవతి ఖలు నిష్కర్షసమయే ।
త్వమాసీః మాత శ్శ్రీః! కమితు రిదమిత్థంత్వవిభవః
తదన్తర్భావాత్ త్వాం న పృథగభిధత్తే శ్రుతిరపి ॥

29) తవ స్పర్శాదీశం స్పృశతి కమలే! మఙ్గళపదం
తవేదం నోపాధే రుపనిపతితం శ్రీరసి యతః ।
ప్రసూనం పుష్యన్తీమపి పరిమళర్ధిం జిగదిషుః
న చైవన్త్వా దేవం స్వదత ఇతి కశ్చిత్కవయతే ॥

30) అపాఙ్గా భూయాంసో యదుపరి పరం బ్రహ్మ తదభూత్
అమీ యత్ర ద్విత్రా స్స చ శతమఖాది స్తదధరాత్ ।
అతశ్శ్రీ! రామ్నాయ స్తదుభయ ముశంస్త్వాం ప్రణిజగౌ
ప్రశస్తి స్సా రాజ్ఞో యదపి చ పురీకోశకథనమ్ ॥

31) స్వత శ్రీ! స్త్వం విష్ణోః స్వమసి తత ఏవైష భగవాన్
త్వదాయత్తర్ధిత్వేఽప్యభవ దపరాధీనవిభవః ।
స్వయా దీప్త్యా రత్నం భవదపి మహార్ఘం న విగుణం
న కుణ్ఠస్వాతన్త్ర్యం భవతి చ న చాన్యాహితగుణమ్ ॥

32) ప్రశకనబలజ్యోతిః జ్ఞానైశ్వరీవిజయప్రథా
ప్రణతవరణప్రేమ క్షేమఙ్కరత్వపురస్సరాః ।
అపి పరిమళః కాన్తిర్లావణ్య మర్చిరితీన్దిరే!
తవ భగవత శ్చైతే సాధారణా గుణరాశయః ॥

33) అన్యేఽపి యౌవనముఖా యువయో స్సమానాః
శ్రీరఙ్గమఙ్గళవిజృమ్భణ వైజయన్తి! ।
తస్మిం స్తవ త్వయి చ తస్య పరస్పరేణ
సంస్తీర్య దర్పణ ఇవ ప్రచురం స్వదన్తే ॥

34) యువత్వాదౌ తుల్యేఽప్యపరవశతా శత్రుశమన -
స్థిరత్వాదీన్ కృత్వా భగవతి! గుణాన్ పుంస్త్వ సులభాన్ ।
త్వయి స్త్రీత్వైకాన్తాన్ మ్రదిమపతిపారార్థ్యకరుణా -
క్షమాదీన్వా భోక్తుం భవతి యువయో రాత్మని భిదా

35) ఘనకనకద్యుతీ యువదశామపి ముగ్ధదశాం
యువతరుణత్వయో రుచిరమాభరణాది పరమ్ ।
ధ్రువ మసమానదేశ వినివేశి విభజ్య హరౌ
త్వయి చ కుశేశయోదరవిహారిణి! నిర్విశసి ॥

36) అఙ్గన్తే మృదుశీతముగ్ధ మధురోదారై ర్గుణైర్గుమ్ఫితః
క్షీరాబ్ధేః కిమృజీషతా ముపగతా మన్యే మహార్ఘా స్తతః ।
ఇన్దుః కల్పలతా సుధా మధుముఖా ఇత్యావిలాం వర్ణనాం
శ్రీరఙ్గేశ్వరి! శాస్తకృత్రిమకథం దివ్యం వపుర్నార్హతి ॥

37) ప్రణమదనువిధిత్సావాసనానక్రమమగ్రే
ప్రణయిపరిచిచీషా కుఞ్చితం పార్శ్వకేన ।
కనకనికష చఞ్చచ్చంపక స్రక్సమాన
ప్రవర మిద ముదారం వర్ష్మ వాచామభూమిః ॥

38) ఏకం న్యఞ్చ్య నతిక్షమం మమ పరం చాకుఞ్చ్య పాదామ్బుజం
మధ్యేవిష్టరపుణ్డరీక మభయం విన్యస్య హస్తామ్బుజమ్ ।
త్వాం పశ్యేమ నిషేదుషీం ప్రతికలం కారుణ్యకూలఙ్కష -
స్ఫారాపాఙ్గతరఙ్గ మమ్బ! మధురం ముగ్ధం ముఖం బిభ్రతీమ్॥

39) సురభితనిగమాన్తం వన్దిషీయేన్దిరాయాః
తవ కమలపలాశప్రక్రియం పాదయుగ్మమ్ ।
వహతి యదుపమర్దైః వైజయన్తీ హిమామ్భః
ప్లుతిభిరివ నవత్వం కాన్తబాహోన్తరాళే ॥

40) త్వత్ స్వీకారకలావలేపకలుషా రాజ్ఞాం దృశో దుర్వచాః
నిత్యం త్వన్మధుపానమత్తమధుపశ్రీనిర్భరాభ్యాం పతిమ్ ।
దృగ్భ్యామేవ హి పుణ్డరీకనయనం వేదో విదామాస తే
సాక్షాలక్ష్మి! తవావలోకవిభవః కాక్వా కయా వర్ణ్యతే?॥

41) ఆనన్దాత్మభి రీశమజ్జనమదక్షీబాలసై రాగల -
ప్రేమార్ద్రైరపి కూలముద్వహకృపా సంప్లావితాస్మాదృశైః ।
పద్మే! తే ప్రతిబిన్దుబద్ధకలిక బ్రహ్మాదివిష్కమ్భకైః
ఐశ్వర్యోద్గమగద్గదై రశరణం మాం పాలయాలోకితైః ॥

42) పాదారున్తుదమేవ పఙ్కజరజశ్చేటీభృశాలోకితైః
అఙ్గమ్లాని రథామ్బ! సాహసవిధౌ లీలారవిన్దగ్రహః ।
డోలా తే వనమాలయా హరిభుజే హా కష్టశబ్దాస్పదం
కేన శ్రీరతికోమలా తనురియం వాచాం విమర్దక్షమా! ॥

43) ఆమర్యాద మకణ్టకం స్తనయుగం నాద్యాపి నాలోకితః
భ్రూభేదస్మితవిభ్రమా జహతి వా నైసర్గికత్వాయశః ।
సూతే శైశవయౌవనవ్యతికరో గాత్రేషు తే సౌరభం
భోగస్రోతసి కాన్తదేశికకరగ్రాహేణ గాహక్షమః ॥

44) ఆమోదాద్భుతశాలి యౌవనదశావ్యాకోచ మమ్లానిమత్
సౌన్దర్యామృతసేకశీతల మిదం లావణ్యసూత్రార్పితమ్ ।
శ్రీరఙ్గేశ్వరి! కోమలాఙ్గసుమనస్సన్దర్భణం దేవి! తే
కాన్తోరఃప్రతియత్న మర్హతి కవిం ధిఙ్ మామకాణ్డాకులమ్॥

45) మర్మస్పృశో రససిరావ్యతివిధ్య వృత్తైః
కాన్తోపభోగలలితై ర్లులితాఙ్గయష్టిః ।
పుష్పావలీవ రసికభ్రమరోపభుక్తా
. త్వం దేవి! నిత్య మభినన్దయసే ముకున్దమ్ ॥

46) కనకరశనా ముక్తాతాటఙ్కహారలలాటికా
మణిసరతులాకోటిప్రాయైః జనార్దనజీవికే! ।
ప్రకృతిమధురం గాత్రం జాగర్తి ముగ్ధవిభూషణైః
వలయశకలైః దుగ్ధం పుష్పైశ్చ కల్పలతా యథా ॥

47) సామాన్యభోగ్యమపి కౌస్తుభవైజయన్తీ
పఞ్చాయుధాది రమణ స్స్వయమేవ బిభ్రత్ ।
తద్భారఖేదమివ తే పరిహర్తుకామః
శ్రీరఙ్గధామమణిమఞ్జరి! గాహతే త్వామ్ ॥

48) యది మనుజతిరశ్చాం లీలయా తుల్యవృత్తేః
అనుజను రనురూపా దేవి! నావాతరిష్యః ।
అసరస మభవిష్య న్నర్మ నాథస్య మాతః!
దరదళదరవిన్దోదన్త కాన్తాయతాక్షి ॥

49) స్ఖలితకటకమాల్యై ర్దోర్భి రబ్ధిం మురారేః
భగవతి! దధిమాథం మథ్నత శ్శ్రాన్తిశాన్త్యై ।
భ్రమదమృతతరఙ్గావర్తతః ప్రాదురాసీః
స్మితనయనసుధాభి స్సిఞ్చతీ చన్ద్రికేవ ॥

50) మాతర్మైథిలి! రాక్షసీ స్త్వయి తదైవార్ద్రాపరాధా స్త్వయా
రక్షన్త్యా పవనాత్మజా ల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా ।
కాకం తఞ్చ విభీషణం శరణ మిత్యుక్తిక్షమౌ రక్షతః
స న స్సాన్ద్రమహాగస స్సుఖయతు క్షాన్తి స్తవాకస్మికీ ॥

51) మాతర్లక్ష్మి! యథైవ మైథిలజన స్తేనాధ్వనా తే వయం
త్వద్దాస్యైకరసాభిమాన సుభగై ర్భావై రిహాముత్ర చ ।
జామాతా దయిత స్తవేతి భవతీసంబన్ధదృష్ట్యా హరిం
పశ్యేమ ప్రతియామ యామ చ పరీచారాన్ ప్రహృష్యేమ చ ॥

52) పితేవ త్వత్ప్రేయాన్ జనని! పరిపూర్ణాగసి జనే
హితస్రోతోవృత్త్యా భవతి చ కదాచిత్ కలుషధీః ।
కిమేత న్నిర్దోషః క ఇహ జగతీతి త్వముచితైః
ఉపాయైః విస్మార్య స్వజనయసి మాతా తదసి నః ॥

53) నేతుర్నిత్యసహాయినీ జనని! న స్త్రాతుం త్వమత్రాగతా
లోకే త్వన్మహిమావబోధబధిరే ప్రాప్తా విమర్దం బహు ।
క్లిష్టం గ్రావసు మాలతీమృదుపదం విశ్లిష్య వాసో వనే
జాతో ధిక్కరుణాం ధిగస్తు యువయోః స్వాతన్త్ర్య మత్యఙ్కుశమ్॥

54) అధిశయితవానబ్ధిం నాథో మమన్థ బబన్ధ తం
హరధనురసౌ వల్లీభఙ్గం బభఞ్జ చ మైథిలి! ।
అపి దశముఖీం లూత్వా రక్షఃకబన్ధ మనర్తయత్
కిమివ న పతిః కర్తా త్వచ్చాటుచుఞ్చుమనోరథః ॥

55) దశశతపాణిపాదవదనాక్షిముఖై రఖిలైః
అపి నిజవైశ్వరూప్యవిభవై రనురూపగుణైః ।

అవతరణై రతైశ్చ రసయన్ కమితా కమలే!
క్వచన హి విభ్రమభ్రమిముఖే వినిమజ్జతి తే ॥

56) జననభవనప్రీత్యా దుగ్ధార్ణవం బహుమన్యసే
జనని! దయితప్రేమ్ణా పుష్ణాసి తత్పరమం పదమ్ ।
ఉదధిపరమవ్యోమ్నో: విస్మృత్య మాదృశరక్షణ
క్షమమితి ధియా భూయ శ్రీరఙ్గధామని మోదసే ॥

57) ఔదార్యకారుణిక తాశ్రితవత్సలత్వ-
పూర్వేషు సర్వ మతిశాయిత మత్ర మాతః ।
శ్రీరఙ్గధామ్ని యదుతాన్యదుదాహరన్తి
సీతావతారముఖమేత దముష్య యోగ్యా ॥

58) ఐశ్వర్య మక్షరగతిం పరమం పదం వా
కస్మైచిదఞ్జలిభరం వహతే వితీర్య ।
అస్మై న కిఞ్చిదుచితం కృతమిత్యథాంబ!
త్వం లజ్జసే కథయ కోఽయ ముదారభావః ॥

59) జ్ఞాన క్రియాభజనసంపదకిఞ్చనోఽహమ్
ఇచ్ఛాధికారశకనానుశయానభిజ్ఞః ।
ఆగాంసి దేవి! యువయోరపి దుస్సహాని
బధ్నామి మూర్ఖచరిత స్తవ దుర్భరోఽస్మి ॥

60) ఇత్యుక్తి కైతవశతేన విడమ్బయామి
తానంబ! సత్యవచసః పురుషాన్ పురాణాన్ ।
యద్వా న మే భుజబలం తవ పాదపద్మ -
లాభే త్వమేవ శరణం విధితః కృతాసి ॥

61) శ్రీరఙ్గే శరదశ్శతం సహ సుహృద్వర్గేణ నిష్కణ్టకం
నిర్దుఃఖం సుసుఖం చ దాస్యరసికాం భుక్త్వా సమృద్ధిం పరామ్।
యుష్మత్పాదసరోరుహాన్తరరజ స్స్యామ త్వమంబా పితా
సర్వం ధర్మమపి త్వమేవ భవ న స్స్వీకుర్వకస్మాత్కృపామ్ ॥



శ్రీమతే రామానుజాయ నమః



ఉ.వే. మహావిద్వాన్ కాంచీ ప్రతివాది భయంకరమ్
అణ్ణంగరాచార్యస్వామివారు అనుగ్రహించిన "విద్వత్ప్రహర్షిణీ" అనే

# శ్రీగుణరత్నకోశ వ్యాఖ్యానం - ఆంధ్రానువాదం

## అవతారిక

మనం ముక్తిని పొందడానికి తగిన ఉపాయాలలో దివ్యదంపతులైన భగవానుని, లక్ష్మీదేవిని స్తుతించడం చాలా గొప్పదైన ఉపాయమని పలువురు మహర్షులు, మహాచార్యులు సెలవిచ్చారు. అజ్ఞానులమైన మనం మన "ఇళైయ పున్ కవిత్తై" (పరిణతి చెందని నీచకవితలను) కూర్చి స్తుతించడంకంటే, మహాజ్ఞానులైన పూర్వాచార్యులు అనుగ్రహించిన శ్రీసూక్తులతో స్తుతిస్తే, భగవానుని మనస్సు త్వరగా కఱగుతుంది కనుక, ఇటువంటి హితాన్ని మనం పొంది ఉజ్జీవించడంకోసమే ఆళవందార్ మొదలైన మన పూర్వాచార్యులు పరమకరుణతో అమృతంకంటే మధురాలైన పలు పలు స్తుతులను అనుగ్రహించారు.

అటువంటి ఆచార్యులలో శ్రీపరాశరభట్టర్ మిక్కిలి విశిష్టస్థానాన్ని అలంకరిస్తున్నారు. వీరు, శ్రీరంగనాథుని విషయంలో శ్రీరంగరాజస్తవాన్ని, శ్రీరంగనాయకి విషయంగా శ్రీగుణరత్నకోశాన్ని అనుగ్రహించి, భక్తులపట్ల గొప్ప అనుగ్రహాన్ని ప్రదర్శించారు. వీరి తండ్రిగారైన కూరేశులవంటివారు అనుగ్రహించిన పంచస్తవి మొదలైన స్తుతిగ్రంథాలున్నా, శ్రీభట్టర్ రచించిన ఈరెండు స్తుతులకు సాటి వచ్చే కృతులు ఈ లోకంలో ఇంతవరకు అవతరించలేదు- అని అంటే ఆ సూక్తి అతిశయోక్తి కాబోదు. ఈ రెండిటిలో, శ్రీగుణరత్నకోశంయొక్క గాంభీర్యం వాచామగోచరం. ఇందులో శబ్దమాధుర్యం, అర్థగాంభీర్యం నిండి ఉండే సొబగు పరమాద్భుతం- అని చెప్పగలం; అంతే. ఈ స్తుతిలోనే "అనాఘ్రాతా వద్యమ్" అనే ఎనిమిదవ శ్లోకంలో లక్ష్మీదేవిని ఉద్దేశించి "పరమవిలక్షణమైన వాగ్విన్యాస శైలిని నాకు అనుగ్రహించు" - అని తామే అర్థించినందున, ఆ రీతిలోనే

శ్రీరంగనాయకియొక్క అనుగ్రహమూలంగా కల్గిన అనన్యాదృశగాంభీర్యయుక్తమైన రచనావైఖరి ఈ ఒక్క స్తోత్రానికి మాత్రమే. అసాధారణమై విలసిల్లుతున్నది. **"పరిచితమివ అథాపి గహనమ్ ... వాణీవిలసితమ్ మహ్యాం బహుముఖయ"** (పరిచితమైనదివలె ఉన్నా, అర్థంలో గంభీరంగా ఉండే వాగ్విలాసాన్ని నాకు విస్తరింపజేయాలి) అని ప్రార్థించిన రీతిలోనే ఇందులో ఉండే పల్కులన్నీ మనకు తెలిసినట్లే అనిపించినా, వాటి అర్థజ్ఞానం చాలా దుర్లభంగా తోస్తుంది. ఈ వైఖరి ఈస్తుతిలోవలె ఇంకొక స్తుతిలో కానరాదు.

ఈ స్తుతికి వ్యాఖ్యానం రచించాలని ఆరంభించిన నేను, "దీనిలోని గంభీరార్థాలను ఋజువుగా గ్రహించానా ?" అనే విషయంలో నా అంతరంగం సందేహిస్తూనే ఉన్నది. **"అజ్ఞానామహ మగ్రణీః"** (అజ్ఞులలో నేను ముందు వాడను) అనే రీతిలో ఉండే దాసుడు (నేను) ఈ ప్రయత్నం చేయడం సాహసమే అయినా, పలువురు మహనీయుల నియమనాన్ని అనివార్యంగా భావించి, శ్రీరంగనాయకియొక్క, భట్టర్‌యొక్క కృపను శరణంగా చేసికొని యథాశక్తి ప్రయత్నిస్తాను.

శ్రీరంగనాయకియొక్క కల్యాణగుణాలనే రత్నాలకు ఈ గ్రంథం ఒక బొక్కసంవంటిది అయినందున, దీనికి **"శ్రీగుణరత్నకోశ"**మనే పేరును భట్టర్ పెట్టారు. ఇందులో వర్ణింపబడని లక్ష్మీదేవి గుణాలు వేఱు ఏమీ లభించవు– అనేది ఈ నామతాత్పర్యం. ఈ స్తోత్రంలోనే **"దేవి ! శ్రుతిం భగవతీం ప్రథమే పుమాంసః తత్సద్గుణౌఘమణికోశగృహం గృణంతి"** (దేవీ ! పూర్వపురుషులు పూజ్యురాలైన శ్రుతిని నీ కల్యాణగుణాలనే మణులు భద్రపరచిన కోశాగారమని అంటున్నారు) అనే శ్లోకంలో వేదాలకు శ్రీగుణరత్నకోశమనే తిరునామాన్ని పెట్టాలి – అని తమ అభిప్రాయమని తెలిపారు. ఈ పేరునే తమ ఈ గ్రంథానికి పెట్టినందున ఇది వేదంవలె మిక్కిలి అభ్యర్హితమైనది– అనే అర్థంకూడా స్ఫురిస్తున్నది.

ఈ స్తోత్రం, శ్రీరంగనాథునకు పరమభోగ్యమైనది – అనే విషయం ఈ స్తుతిలోనే **"శ్రియః శ్రీః ! శ్రీరంగేశయ !"** అనే తొమ్మిదవ శ్లోకంలోని ఉత్తరార్థంలో సుస్పష్టంగా ప్రకాశిస్తున్నది. **"పణ్ణార్ పాడల్ ఇన్‌కవికళ్ యానాయ్ తన్నై త్తాన్**

**పాడి, తెన్నా ఎన్నుమ్ ఎన్ అమ్మాన్ తిరుమాలిరుఞ్జోలైయానే"** (సంగీతాత్మకాలైన తీయని పాశురాలను తానే నా ద్వారా పాడించి, **"తెన్నాతెన్నా"** అని సుందరబాహు స్వామి ఆనందిస్తున్నాడు.) (తిరువాయ్‌మొళ్ఱి-10-7-5) అనే రీతిలో భగవానుడే తన గుణానుభవరూపమైన తిరువాయ్‌మొళ్ఱి దివ్యప్రబంధాన్ని ఆళ్వార్లు పాడేటట్లుగా చేసి, తాను ఆనందించినట్లుగా, శ్రీరంగనాథుడు కూడా తన దివ్యపత్ని వైభవాలను తానే భట్టర్ శ్రీసూక్తిద్వారా పాడించు, చెవులారా విని ఆనందిస్తున్నాడు- అని ఆ శ్లోకంలో ధ్వనిస్తున్నది.

శ్రీపరాశరభట్టర్ శ్రీరంగనాథుని విషయంగా పల్కిన శ్లోకరాశిలో నాల్గవ భాగంగా (శ్రీరంగరాజస్తవ శ్లోక సంఖ్యతో పోలిస్తే ఇది నాల్గవ భాగంగా) ఈగుణరత్నకోశం ప్రకాశిస్తున్నా, **"వైదగ్ధ్యవర్ణగుణగుంభన గౌరవై ర్యాం కండూలకర్ణకుహరాః కవయో ధయంతి"** (శబ్దాల కూర్పులోని చాతుర్యం, అర్థవైలక్షణ్యం ఈ స్తుతిని తమ చెవులార కవులు పానం చేస్తారు.) అని ఇందులోనే తామే అనుగ్రహించే రీతిలోని అతిశయం దీనికే స్వంతం. శ్రీరంగనాయకిని ముందుగా శరణాగతి చేసి, తరువాత శ్రీరంగనాథుని శరణు వేడాలి- అనే శాస్త్రార్థం ఆశ్రయణకాలానికి చెందినదే తప్ప స్తోత్రప్రక్రియకు చెందినది కాదు. కనుక, శ్రీరంగరాజస్తవం రచించిన పిమ్మటనే, ఈ శ్రీగుణరత్నకోశస్తుతిని భట్టర్ రచించారు. శ్రీయామునులు స్తోత్రరత్నానికి తరువాత చతుఃశ్లోకిని రచించినట్లే, శ్రీకూరేశులు, శ్రీవైకుంఠస్తవాదులకు తరువాత శ్రీస్తవాన్ని రచించినట్లే, దీనిని కూడా భావించాలి.

**అవతారిక సంపూర్ణం**



### ఉ.వే. మహావిద్వాన్ కాంచీ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్యస్వామివారు అనుగ్రహించిన "విద్వత్ప్రహర్షిణీ" అనే

# శ్రీగుణరత్నకోశ వ్యాఖ్యానమ్ - ఆంధ్రానువాదం

## శ్రీపరాశర భట్టర్ తనియన్

**శ్రీపరాశరభట్టార్యః శ్రీరఙ్గేశపురోహితః ।**
**శ్రీవత్సాఙ్కసుతః శ్రీమాన్ శ్రేయసే మేఽస్తు భూయసే ॥**

---

1) **శ్రియై సమస్తచిదచిద్విధానవ్యసనం హరేః ।**
**అఙ్గీకారిభి రాలోకైః సార్థయన్త్యై కృతోఽఞ్జలిః ॥**

హరేః = హరి అనబడే భగవానునకు, సమస్త = సకల, చిత్ = చేతనాలను, అచిత్ = అచేతనాలను, విధాన = సృష్టించడంవల్ల కలిగే, వ్యసనం = ప్రయాసను (శ్రమను), అంగీకారిభిః = తన అంగీకారాల రూపంలోని, ఆలోకైః = చూపులతో, సార్థయంత్యై = సఫలం చేసే, శ్రియై = లక్ష్మీదేవికి, అంజలిః కృతః = అంజలి (నమస్కారం) చేయబడింది .

వ్యాఖ్యానమ్ :- భట్టర్, ఈ స్తుతిని ఆరంభించేటపుడు, ఒక శాస్త్రార్థాన్ని వ్యక్తం చేస్తూ, ప్రారంభిస్తున్నారు. జగద్వ్యాపారంలో భగవానునకే అన్వయం ఉన్నది- అని, తత్సాక్షిత్వమాత్రమే లక్ష్మికి ఉన్నదని సత్సంప్రదాయసిద్ధాంతం కనుక, దానిని భట్టర్ ఈ శ్లోకంద్వారా వ్యక్తం చేస్తున్నారు. జగద్వ్యాపారశ్రమ అంతా భగవానునకే ఉన్నదని- అనేది శ్లోకం పూర్వార్ధంలో తెలుపబడింది. లక్ష్మీదేవి స్వామి వెంటనే ఉండి అనుగ్రహిస్తుంది (అనుమతిస్తుంది)- అనే విషయం ఉత్తరార్ధంలో తెలుపబడింది.

శ్రీరంగరాజస్తవం- ఉత్తరశతకంలో- "**ప్రళయసమసుప్తం స్వం శరీరైక దేశం వరద! చిదచిదాఖ్యం స్వేచ్ఛయా విస్తృణానః, ఖచితమివ కలాపం చిత్రమాతత్య ధూన్వన్ అనుశిఖిని శిఖీవ క్రీడసి శ్రీసమక్షమ్**" (వరాలను ఇచ్చే శ్రీరంగనాథా! ప్రళయకాలంలో నిద్రించిన దశలో ఉన్నవి, నీ శరీరంలో ఒక భాగమైనవి అయిన చిదచిత్తత్త్వాలను నీ ఇచ్ఛతో విస్తరింపజేసేవాడవై, మగనెమలి

తన చిత్రమైన పింఛాన్ని విస్తరింపజేసి ఆడ నెమలి ముందు ఆడే రీతిలో, లక్ష్మీదేవి సమక్షంలో క్రీడిస్తున్నావు) అనే శ్లోకంలో విస్తృతంగా పల్కిన అర్థాన్ని ఇక్కడ సంగ్రహంగా పల్కుతున్నారు. ఆ శ్లోకంలోని భావం ఏమంటే- ప్రళయకాలంలో నిద్రను పొందినట్లుగా అసత్కల్పమై, నీ తిరుమేనిలో ఒక భాగంగా ఒదిగి పడి ఉండే చేతనాచేతనవస్తువులను నీ సంకల్పంతోనే వివిధమైన, విచిత్రమైన జగత్తు రూపంలో పరిణమింపజేస్తున్న నీవు లక్ష్మీదేవి సమక్షంలో క్రీడిస్తున్నావు. ఈక్రీడ ఏవిధంగా ఉన్నది?- అంటే- మగ నెమలి తన దేహంలో ఒదిగి ఉండే పింఛాన్ని చక్కగా విస్తరించి, ఆడు నెమలి సమక్షంలో ఆడినట్లుగా ఉన్నది- అని. ఇక్కడ ఈ మయూరదృష్టాంతంద్వారా వ్యక్తమవుతున్న తత్త్వం ఒకటి ఉన్నది. **"కలాపమ్"** (పింఛం) మగనెమలికి ఉంటుందే తప్ప, ఆడు నెమలికి ఉండదు. అదే రీతిలో, జగద్వ్యాపారం (సృష్ట్యాదులు) భగవానునకే ఉన్నది. (అనేది ఆ తత్త్వం)

కూరేశులు కూడా శ్రీస్తవంలోని మొదటి శ్లోకంలో **"యస్యా వీక్ష్య ముఖం తదింగితపరాధీనో విధత్తేఽఖిలమ్"** (ఏ లక్ష్మీదేవి ముఖాన్ని చూచి, ఆమె ఇంగితాలకు పరాధీనుడై సమస్తాన్ని చేస్తున్నాడో) అని అన్నారు. శ్రీదేశికులు కూడా శ్రీస్తుతిలో - **"యత్ సంకల్పాత్ భవతి కమలే!"** అనే శ్లోకంలో ఈ సిద్ధాంతాన్నే స్పృశిస్తూ పలికారు.

ఈ శ్రీగుణరత్నకోశం విశేషించి శ్రీరంగనాయకిని ఉద్దేశించియే అవతరించినది అయినందున, ఇందులో **"సార్థయంత్యై"** అనే వర్తమాన కాలిక ప్రయోగం చేసినందున, వీటికి తగినట్లుగా ఈ శ్లోకార్థాన్ని నిర్వహించే శైలి ఒకటి ఉన్నది. అది ఏమంటే- భగవానుడు జగత్ సృష్టిని చేసేటపుడు లక్ష్మీదేవి సాక్షిణిగా (ప్రత్యక్షద్రష్టగా) ఉంటుంది- అనేది కాదు ఇక్కడ వివక్షితం. ఈ విషయం తరువాత **"యద్భ్రూభంగాః ప్రమాణమ్"** అనే శ్లోకంలోని మొదటి పాదంలో చెప్పబడబోతున్నది. ఇక్కడ వివక్షితార్థం ఏమంటే- శ్రీరంగనాయకి అనే ఈ సన్నివేశంలోని అతిశయమే (తెలుపబడుతున్నది.) ఈమె సన్నిధికి వచ్చి ఆశ్రయించినవారిని ఈమె కరుణాదృష్టితోనే కటాక్షించి అంగీకరిస్తున్నందున, భగవానుడు తన జగత్సృష్టిక్రమం సఫలమైనట్లుగా మనస్సులో భావిస్తాడట. ఈ అర్థం- **"సార్థయంత్యై"** అనే వర్తమాననిర్దేశానికి చక్కగా పొసగుతుంది.

శ్రీరంగనాయకియొక్క అంగీకార సూచకకటాక్షామృతధారలకు లక్ష్యంగా కావడమే చేతనాచేతన జన్మసాఫల్యం - అనే అర్థం ఇక్కడ చెప్పబడింది.

**2) ఉల్లాసపల్లవిత పాలితసప్తలోకీ**
**నిర్వాహకోరకిత నేమకటాక్షలీలామ్ ।**
**శ్రీరఙ్గహర్మ్యతల మఙ్గళదీపరేఖాం**
**శ్రీరఙ్గరాజమహిషీం శ్రియ మాశ్రయామః ॥**

ఉల్లాస = తన పాదుర్భావంచేత, పల్లవిత = చిగురించిన, పాలిత = పాలిత= పాలింపబడిన, సప్తలోకీ = ఏడు లోకాలను, నిర్వాహ = ధరించడంచేత, కోరకిత= మొగ్గ తొడిగినది, నేమ = స్వల్పమైన, కటాక్ష = క్రీగంటిచూపుల, లీలాం = క్రీడను కల్గినది, శ్రీరంగ = శ్రీరంగంలోని, హర్మ్యతల = దివ్యాలయ విమానంలో, మంగళ దీపరేఖాం = మంగళదీపజ్వాలవంటిది, శ్రీరంగరాజమహీషీం = శ్రీరంగనాథుని పట్టపురాణి అయిన, శ్రియం = శ్రీరంగనాయకిని, ఆశ్రయామః = ఆశ్రయిస్తున్నాము.

**వ్యాఖ్యానమ్ :-** శ్రీరంగనాయకియొక్క క్రీగంటి చూపుయొక్క విలాసంతో సప్తలోకాల ఉత్పత్తి, రక్ష, లయం జరుగుతున్నవి. ముందుగా, ఉత్పత్తి జరిగే కాలంలో కటాక్షలీల పల్లవావస్థలో ఉంటుంది. రక్షణ, లయం జరిగే కాలంలో కోరకదశ (మొగ్గ తొడిగే దశ)లో ఉంటుంది. "నేమి"- అనే పదానికి కొంచెం- స్వల్పం- అని అర్థం. స్త్రీకి సహజమైన రీతిలో, నేత్రాలను పూర్తిగా తెఱచి కటాక్షించకుండా, క్రీగంటి చూపులతో అరమోడ్పు కన్నులతో వీక్షించే అతిశయాన్ని ఇక్కడ వర్ణిస్తున్నందున, తరువాత పుష్పావస్థను పొందకుండా, కోరకావస్థతోనే నిలుపబడింది. అందువల్ల సప్తలోకిని సృష్టించి, రక్షించి, ఒకానొక సమయ విశేషంలో లయింపజేసేవాడైన భగవానునకు ఉపచ్ఛందనమైన కటాక్షమహిమను కల్గినది, శ్రీరంగనాయకి - అని తెలుపబడింది.

**(శ్రీరంగహర్మ్యతలమంగళదీపరేఖామ్)**- శ్రీరంగవిమానం దగ్గరలో దీపం వెల్గించినట్లుగా ఉన్నది- అని భావం. ఇక్కడ చీకటిని పోగొట్టవలసివచ్చి, దీపాన్ని వెలిగించే ప్రసక్తి లేనందున "**మంగళదీప**"మని ప్రయోగింపబడింది.

**(శ్రీరంగరాజమహిషీమ్)**- శ్రీరంగనాథునితో సామ్రాజ్యాభిషిక్తయై, రక్షించేది- అని భావం. ఇటువంటి లక్ష్మిని ఆశ్రయిస్తున్నాను. - అని తెలుపబడింది.

3) అనుకల తనుకాణ్డాలిఙ్గనారమ్భశుమ్భత్
ప్రతిదిశభుజశాఖ శ్రీసఖానోకహర్ధిః ।
స్తననయనగుళుచ్ఛ స్ఫారపుష్పద్విరేఫా
రచయతు మయి లక్ష్మీకల్పవల్లీ కటాక్షాన్ ॥

అనుకల = ప్రతిక్షణం, తనుకాండ = ఆలంబనం (పట్టకొమ్మవంటి) తనువును, ఆలింగన + ఆరంభ = కౌగిలించడం ఆరంభంలోనే, శుంభత్ = గొప్పగా ప్రకాశించే, ప్రతిదిశ = అన్ని దిక్కులలోని, భుజశాఖ = కొమ్మలవంటి భుజాలను కల, శ్రీసఖ+ అనోకహా = కల్పవృక్షంవంటి శ్రియఃపతియొక్క, ఋద్ధిః = వృద్ధిని కల్గినది, స్తన నయనగుళుచ్ఛ స్ఫారపుష్ప ద్విరేఫా = పూలగుత్తులవంటి స్తనాలను, వికసించిన పూవులలోని తుమ్మెదలవంటి కనీనికలను (నల్లకనుగుడ్డును) కల్గినది అయిన, లక్ష్మీ కల్పవల్లీ = కల్పలతవంటి లక్ష్మీదేవి, మయి = నా విషయంలో, కటాక్షాన్ = కటాక్షాలను, రచయతు = ప్రసరింపజేయాలి.

**వ్యాఖ్యానమ్ :-** ఈ శ్లోకంలో, శ్రీరంగనాయకిని కల్పలతగా రూపణం చేస్తున్నారు, లోకంలో లత-ఒక వృక్షంపై అల్లుకుంటుంది. అదే రీతిలో ఈ కల్పలతకూడా శ్రీరంగనాథుడనే కల్పవృక్షం పైన అల్లుకుంటున్నది. లోకంలో వృక్షంపై లత అల్లుకున్నందున లతకు అభివృద్ధి కల్గుతుంది తప్ప, వృక్షానికి అభివృద్ధి ఏమీ కలుగదు. ఇక, ప్రకృతంలో అయితే- లక్ష్మీదేవి- అనే లత తనపై అల్లుకోగానే శ్రీరంగనాథుడనే వృక్షం శతశాఖంగా విస్తరిస్తున్నది. **"తోళ్‌కళ్ ఆయిరత్తాయ్ ముడికళ్ ఆయిరత్తాయ్ తుణైమలర్ కణ్‌కళ్ ఆయిరత్తాయ్"** (బాహువులు వేయిగా, శిరస్సులు వేయిగా, పద్మాలవంటి కన్నులు వేయిగా) అని భగవానునకు చెప్పబడే విశేషం సహజమైనది కాక, అభిమతజనసంశ్లేష నిబంధనమై ఉంటుంది.

**"అనుకలమ్"** అనే పదానికి - అనుక్షణం - అని అర్థం. ఇది, పైన గల **"శుంభత్"** అనే శోభన క్రియలో అన్వయిస్తుంది. శ్రీరంగనాథుడనే కల్పవృక్షం. తనుకాండాలింగనం ఆరంభంలో అనుక్షణం వృద్ధి చెందే భుజశాఖలను కల్గినది అనిభావం. **"తనుకాండ"** అని అంటూ శ్రీరంగనాథుని దివ్యమంగళ విగ్రహం నిర్దేశింపబడింది. దానిని అల్లుకోవాలని శ్రీరంగనాయకి ప్రయత్నించగానే ఆ

దివ్యమంగళ విగ్రహమనే కల్పవృక్షంలో భుజాలనే కొమ్మలు అన్ని దిక్కులలోను పుట్టి వ్యాపించాయి. శ్రీరంగనాయకి- అనే కల్పలత ఈ విధంగా వ్యాపింప జేయగల్గిన అతిశయాన్ని కల్గినది, **"దిశాసు దిశాసు-ప్రతిదిశమ్"** - అన్ని దిక్కులలోను - అని అర్థం. చతుర్భుజాలనే భగవానుని నాల్గు భుజాలు నాల్గు దిక్కులలోను వ్యాపించడం ఆరంభించి శతసహస్రంగా విస్తరించాయి. **"వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేకః"** (పరమపదంలో అద్వితీయుడైన భగవానుడు స్థిరంగా వృక్షంవలె ఉన్నాడు), **"వాసుదేవతరుచ్ఛాయా"** (వాసుదేవుడనే వృక్షంయొక్క నీడ) అనే ప్రమాణాలను స్పృశించి భగవానుని **"అనోకహ"** మని నిర్దేశించారు. **"అనోకహ"** మంటే వృక్షం. ఈ కల్పలత ఇంకా ఎటువంటిది? అంటే,

**(స్తననయన గుళుచ్ఛస్ఫారపుష్పద్విరేఫా)**- లోకంలోని లతలో పూలగుత్తులు, పూలలో వాలిన తుమ్మెదలు ఉంటాయి. ఇక్కడ కూడా ఆ విధంగానే ఉన్నవి- అని అంటున్నారు. శ్రీరంగనాయకియొక్క స్తనాలు పూలగుత్తులుగాను, నేత్రాలు పుష్పాలుగాను, ఆ నేత్రాలలోని కనీనికలు (నల్ల కనుపాపలు) పూలలో వాలిన తుమ్మెదలుగాను గ్రహింపబడ్డాయి. **"గుళుచ్ఛ"**మంటే -పూలగుత్తి- అని అర్థం. స్తనాలనే గుచ్ఛాన్ని, నయనాలనే స్ఫారపుష్పద్విరేఫాలను కల్గినది- అని యథాక్రమంగా అన్వయించాలి. **"స్ఫారపుష్ప"** మంటే -వికసించిన పూవు. (భ్రమర) మనే పదంలో రెండు రేఫలు (రకారాలు) ఉన్నందున **"ద్విరేఫ"** మని తుమ్మెదకు పేరు కల్గినదని అంటారు. ఈ విధంగా ఇటువంటి-

**(లక్ష్మీకల్పవల్లీ మయి కటాక్షాన్ రచయితు)** - శ్రీరంగనాయకి అనే కల్పలత నన్ను కటాక్షించాలి- అని భావం. కటాక్షవీక్షణాన్ని చేసే సామర్థ్యం శ్రీరంగనాయకికి ఉన్నదే తప్ప, కల్పలతకు సంభవించదు కదా. అందువల్ల **"కల్పవల్లీ కటాక్షాన్ రచయతు"** అని ఏ విధంగా పలుకవచ్చు? అనే శంక కల్గుతుంది. ఇక్కడ పరిణామాలంకారాన్ని గ్రహిస్తే సందేహం తీరిపోతుంది.

**4) యద్భ్రూభఙ్గాః ప్రమాణం స్థిరచరరచనా తారతమ్యే మురారేః**
**వేదాన్తా స్తత్త్వచిన్తాం మురభిదురసి యత్పాదచిహ్నై స్తరన్తి ।**
**భోగోపోద్ఘాతకేళీ చులుకితభగవద్వైశ్వరూప్యానుభావా**
**సా వ శ్రీ రాస్తృణీతా మమృతలహరిధీలఙ్ఘనీయై రపాఙ్గైః ॥**

యత్ + భ్రూభంగా = ఏ లక్ష్మీదేవియొక్క కనుబొమల కదలికలు, మురారేః= భగవానునియొక్క స్థిరరచనాతారతమ్యే = స్థావరాలను, జంగమాలను సృష్టించడంలోని హెచ్చు తగ్గులలో, ప్రమాణం=ప్రమాణమవుతున్నదో, వేదాంతాః= వేదాంతవాక్యాలు, మురభిదురసి = మురారి అనబడే భగవానునియొక్క వక్షస్సులోని, యత్పాదచిహ్నైః= ఎవరి పాదాల గుర్తులతో, తత్త్వచింతాం= పరతత్త్వ విషయంలోని విచారణను, తరంతి = దాటుతున్నవో (నిశ్చయిస్తున్నవో), భోగ+ఉపోద్ఘాతకేళీ = అనుభవప్రారంభలీలతోనే, చుళుకిత = పుడిసిట పట్టిన, భగవద్వైశ్వరూప్య+అనుభావా = భగవానుని విశ్వరూపత్వం యొక్క గొప్ప తనాన్ని కల్గినదిగా (ఏ శ్రీరంగనాయకి) ఉన్నదో, సా = ఆ, శ్రీః = లక్ష్మీ స్వరూపిణి అయిన శ్రీరంగనాయకి, అమృతలహరిధీలంఘనీయైః = అమృతపు కెరటాలు అనే భావనతో తెలిసికొనదగిన (అమృతలహరులవంటి), అపాంగైః = కటాక్షలతో, నః ఆస్తృణీతామ్= మనలను కప్పివేయాలి. (పరిపూర్ణంగా కటాక్షించాలి).

**వ్యాఖ్యానమ్:**-శ్రీరంగనాయకి అమృత కెరటాలవంటి తన కటాక్షవీక్షణా లతో మనలను అభివీక్షించాలి-అని ఇందులో ప్రార్థిస్తున్నారు. ఆమెకు ప్రయోగించిన మూడు విశేషణాలను శ్లోకంలోని మూడు పాదాలతో ప్రయోగిస్తున్నాను.

**(మురారేః స్థిరరచనాతారతమ్యే యద్భ్రూభంగాః ప్రమాణమ్)** భగవానుడు చేసే స్థావరపదార్థసృష్టిలోను, జంగమపదార్థసృష్టిలోను పలు విధాలైన తారతమ్యాలు కన్పిస్తాయి. దీనికి శ్రీరంగనాయకియొక్క భ్రూభంగమే కారణమని ఇందులో తెలుపబడుతున్నది. తారతమ్యమంటే - నీచోచ్ఛభావం. స్థావరపదార్థా లలో నీచోచ్ఛభావమంటే - జిల్లేడు చెట్టు, వేపచెట్టు, ఉల్లిపాయమొక్క - అని ఈవిధమైన వృక్షాలు క్షుద్రాలుగాను, పొగడచెట్టు, పారిజాతవృక్షం, తీయమామిడి చెట్టు, చందనవృక్షం - మొదలైనవి ఉన్నతవృక్షాలుగాను పరిగణింపబడుతున్నాయి. స్థావరపదార్థాలలో ఇటువంటి వేలాది ప్రకారాలలో పలు రీతులలోని తారతమ్యాలను గమనించవచ్చు. ఇక, జంగమపదార్థాలలో తారతమ్యమంటే- దేవ, మనుష్య, తిర్యగాదుల రూపంలోని భేదాలు; వీటిలోని బ్రహ్మాది పిపీలికా పర్యంతంగా కన్పించే వస్తువులలో ఉండే పలు రీతులలోని నీచోచ్ఛభావాలు. ఈవిధంగా ఇటువంటి తారతమ్యాలకు నిదానం- శ్రీరంగనాయకియొక్క భ్రూభంగవిన్యాసభేదాలే- అని తెలుపబడుతున్నది. కూరేశులు కూడా శ్రీస్తవంలోని మొదటి శ్లోకంలో **"యస్యా వీక్ష్య ముఖం తదింగితపరాధీనో విధత్తేఽఖిలమ్"**

(భగవానుడు, ఏ లక్ష్మీదేవి ముఖాన్ని గమనించి, ఆమె ఇంగితాలకు పరాధీనుడై సమస్త సృష్టిని చేస్తున్నాడో) అని పలికారు. ఈ ఆచార్యులు (భట్టర్) కూడా తమ శ్రీరంగరాజస్తవంలో **"నమః శ్రీరంగనాయక్యై యద్భ్రూవిభ్రమభేదతః, ఈశేశితవ్య వైషమ్యనిమ్నోన్నత మిదం జగత్"** (ఎవరి కనుబొమల కదలికలలోని తారతమ్యాల వల్ల శాసించేవాడు, శాసింపబడేవారనే రీతిలో హెచ్చుతగ్గులుగా ఈ లోకం ఉన్నదో, అటువంటి శ్రీరంగనాయకికి నమస్కారం) అని పల్కిన సూక్తి ప్రకృతంలో అనుసంధేయం. ఇక్కడ వక్తవ్యవిశేషాలు అన్నీ ఆ శ్లోకవ్యాఖ్యలో తెలుపబడ్డాయి.

**(వేదాంతాః మురభిదురసి యత్పాదచిహ్నైః తత్త్వచింతాం తరంతి)**- తత్త్వనిర్ణయం చేయగోరిన ఉపనిషత్తులకు **"ఏది పరతత్త్వం"** అనే విచికిత్స కల్గిందట. ఆ ఉపనిషత్తులు శ్రీమన్నారాయణుని వక్షఃస్థలంలో లక్ష్మీపాదలక్షారస చిహ్నాలను చూచి, ఇతడే పరతత్త్వమని నిశ్చయించుకొన్నాయట, ఒకవైపు శివుని, ఇంకొక వైపు ఇంద్రుని పరతత్త్వమని పల్కి గహనంగా తోచే వేదాంతాలు- **"హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ"** అని అంటూ లక్ష్మీపతిత్వాన్ని పురస్కరించుకొని నారాయణునకే పారమ్యాన్ని నిష్కర్షించాయి.- అని భావం. **"పొల్లాద తేవరై తేవరల్లారై త్తిరువిల్లా త్తేవరై త్తేఱేల్మిన్ తేవు"** (పర దైవాలు కాని అవర దైవాలను, లక్ష్మీవిశిష్టులు కాని దైవాలను పరదైవంగా తలచి సేవించవద్దు) (నాన్ముకన్ తిరువన్దాది) అని తిరుమళిశైప్పిరాన్‌యొక్క నిష్కర్షమే ఉపనిషత్తులకు కూడా నిష్కర్షమైనది. ఈవిధంగా తన సంబంధంతో భగవానునకు పారమ్యాన్ని కల్గించే రీతిలోని అతిశయాన్ని శ్రీరంగనాయకి కల్గినది - అని తెలిపినట్లయినది. ఇక్కడ **"యత్ సంబంధేన తత్త్వచింతాం తరంతి"** అని అనకుండా, **"యత్పాదచిహ్నైస్తరంతి"** అని అనడం - దివ్యదంపతులకు గల ప్రణయకేళీ పరిచర్యలను అనుసంధించి పల్కడమే. **"లక్ష్మీచరణలాక్షాంకసాక్షిశ్రీవత్సవక్షసే"** (లక్ష్మీదేవి పాదాల లత్తుక గుర్తులను సాక్షిగా కల్గిన శ్రీవత్సాంకమనే పుట్టుమచ్చను కల వక్షఃస్థలాన్ని కలవానికి) అని కదా మన పూర్వాచార్యులు పలికే శ్రీసూక్తి.

**(భోగోపోద్ఘాతకేళీచులుకితభగవద్వైశ్వర్యరూప్యానుభావా)**- ఆళవందార్ స్తోత్రరత్నంలో **"స్వవైశ్వరూప్యేణ సదా అనుభూతయాఽపి అపూర్వవత్ విస్మయ మాదధానయా"** (భగవానుడు తన విశ్వరూపంతో సదా అనుభవించినా, ఎల్లప్పుడూ

నిత్యనూతనంగా ఆశ్చర్యాన్ని కల్గించేది) అని పల్కిన సూక్తిని భట్టర్ చమత్కార పూర్వకంగా వివరించిన రీతి ఇది. శ్రీరంగనాయకిని అనుభవించాలనే ఆశను కల శ్రీరంగనాథుడు, తన కొన్ని దివ్యాంగాలతో అనుభవిస్తే చాలదని తలచి, తన అవయవాలను వేలాది వేలుగా విస్తరింపజేసి (విశ్వరూపాన్ని ధరించి) అనుభవించడం ఆరంభించాడట. ఆ అవయవవిస్తృతికూడా అనుభవ ప్రారంభం లోనే అసత్కల్పమై పోయినదట. ఇందువల్ల శ్రీరంగనాయకియొక్క వైదగ్ధ్యాతిశయం తెలుపబడింది. **"అల్లిమలర్ పోకమయక్కుక్కళ్ ఆకియుమ్ నిఱ్కుమమ్మాన్"** (పద్మనివాసినియొక్క భోగాలలో వ్యామోహాన్ని పొందినవాడైనా, జగత్సృష్ట్యాది వ్యాపారాలను చేసే స్వామి) అని ఆళ్వార్లు పల్కిన సూక్తికి ఇది ఒక విధమైన వ్యాఖ్యానం. ఈ స్తోత్రం చివరలో కూడా **"దశశతపాణివదన"** అని అంటూ ఆరంభమవుతున్న శ్లోకం పూర్ణంగా ఈ విషయాన్నే వివరించడం గమనించాలి.

మిథిలానగరంలో సీతాదేవియొక్క వివాహకాలంలో అక్కడ గుమిగూడిన జనం పల్కిన మాటలను కంబమహాకవి తమ రామాయణంలో ఒక అద్భుతమైన పాశురంగా మలిచి పలికారు. **"నమ్బియై క్కాణ నఙ్గైక్కు ఆయిరనయనమ్ వేణ్డుమ్"** అని శ్రీరాముని పక్షంలోనివారు అన్నారట. అంటే - శ్రీరాముని సౌందర్యాన్ని దర్శించడానికి సీతాదేవికి రెండు కన్నులు చాలవు. వేయి కన్నులు కావాలి- అని భావం. దీనిని విని సీతాదేవి పక్షానికి చెందినవారు **"కొమ్బినై క్కాణున్దోఱుమ్ కురిశిఱ్కుమున్నదేయామ్"** అని అన్నారట. అంటే - శ్రీరాముని అందాన్ని పూర్తిగా చూడడానికి సీతాదేవికి సీతాదేవికి వేయి కన్నులు ఆవశ్యకం కావడం నిజం అయితే కావచ్చు. కాని పిరాట్టియొక్క ప్రత్యంగ శోభను దర్శించాలంటే శ్రీరాముడు వేయి కన్నులను కల్గి ఉండాలి - అని భావం. ఈ అర్థం **"కాణున్దోఱుమ్"** అని పదప్రయోగ సామర్థ్యంవల్ల లభిస్తున్నది. ఈ విషయం ప్రకృతసందర్భానికి అనుగుణంగా అనుసంధేయం.

విశ్వరూపమని పల్కినా, వైశ్వరూప్యమని పల్కినా ఒకటే. స్వార్థే ష్యఙ్ ప్రత్యయం - అని తెలియాలి. ఈవిధంగా, మూడు పాదాలతోను చెప్పబడిన అతిశయాన్నికూర్చి **"సా"** అని (సర్వనామనిర్దేశపూర్వకంగా) అంటున్నారు. ఇటువంటి శ్రీరంగనాయకి-

**(అమృతలహరిధీలంఘనీయై రపాంగైః నః ఆస్తృణీతామ్)**- అమృత ప్రవాహమనే బుద్ధితో (అమృతం ప్రవాహంవంటి) ప్రాప్యాలైన కటాక్షవీక్షణాలతో మనలను ఆచ్ఛాదించాలి - అంటే - పరిపూర్ణంగా కటాక్షించాలి- అని భావం.

**5) యద్యావత్తవ వైభవం తదుచితస్తోత్రాయ దూరే స్పృహా**
**స్తోతుం కే వయమిత్యదశ్చ జగృహుః ప్రాఞ్చో విరిఞ్చ్యాదయః ।**
**అప్యేవం తవ దేవి! వాఙ్మనసయో ర్భాషానభిజ్ఞం పదం**
**కావాచః ప్రయతామహే కవయితుం స్వస్తి ప్రశస్త్యై గిరామ్ ॥**

దేవి = ఓ శ్రీదేవీ!, తవ = నీయొక్క వైభవం = మహిమ, యత్ = ఏ స్వరూపాన్ని కల్గినదో, యావత్ = ఎంతటి పరిమితిని కల్గినదో, తత్ + ఉచిత = వానికి తగిన రీతిలో, స్తోత్రాయ = స్తుతించడానికి, స్పృహా = ఆశ, దూరే = (ఎవరికైనా) అందనిది, ప్రాంచః = ప్రాచీనులైన, విరించి + ఆదయః = బ్రహ్మాదులు కూడా, అదః = ఈ వైభవాన్ని, స్తోతుం = స్తుతించడానికి, వయం కే = మేము ఎవరం?, ఇతి = అని, జగృహుః = పలికారు, ఏవమపి = ఈవిధంగా అయినా, వాక్+ మనసయోః = వాక్కుకు, మనస్సుకు, భాషా+అనభిజ్ఞం = భాషకు తెలియనిది (అందనిది) అయిన, తవ పదం = నీ వైభవాన్ని, కావాచః = చాలా క్షుద్ర వాక్కులను కల మేము (నేను), కవయితుం = వర్ణించడానికి, ప్రయతామహే = బాగా యత్నిస్తున్నాము, గిరాం ప్రశస్త్యై= వాక్కుల వైభవానికి, స్వస్తి = మంచి కలగాలి. (నేను స్తుతించక పోవడంవల్లనే వాక్కుల గొప్పతనం నిలచి ఉంటుంది)

**వ్యాఖ్యానమ్ :- "పిఱైయేఱు శడైయానుమ్ పిరమను మిన్దిరనుమ్"** (చంద్రుని జటలలో కల శివుడు, బ్రహ్మ, ఇంద్రుడు) అని నిర్దేశింపబడే ఊర్ధ్వలోకంలోని దేవతలకు కూడ సాధ్యం కాని శ్రీరంగనాయకియొక్క వైభవాన్ని **"నీశనేన్ నిఱై ఒన్ఱుమిలేన్"** (నీచుడను, ఏ మంచి గుణాన్ని లేనివాడను) అయిన నేను పలుకాలని ప్రయత్నించడం చాలా సాహసం - అనే నైచ్యానుసంధానం చేస్తున్నారు.

**(దేవి! తవ వైభవం యత్ యావత్)** - ఓ శ్రీరంగనాయకీ ! నీ వైభవం ఎటువంటిదో, ఎంత పరిమితిని కల్గినదో, ఆ విషయాన్ని కొంచెం కూడా నేను తెలియలేను. స్తుతించడం అంటే వైభవాన్ని తెలిసి పల్కడమేకదా. నీ వైభవం ఇటు వంటిది - అనే విషయాన్నే తెలియలేనివాడను, నేను.

**(తదుచితస్తోత్రాయ స్పృహా దూరే)**- నీ ఆ వైభవానికి తగినట్లు స్తోత్రాన్ని చేయాలని ఆశపడడానికి కూడా నేను యోగ్యతను కలవాడను కాను- అని భావం. స్తోత్రం చేయడం- అనేది ఒక వైపు ఉండనీ. అందులో ఆశను కల్గి ఉండడానికి కూడా నేను అధికారినా ? అధికారాన్ని (యోగ్యతను) కల్గినవాడనా?- అని గమనించి చూస్తే, ఆ యోగ్యతకూడా నాకు లేదు- అని పల్కడం ద్వారా శ్రీరంగనాయకివైభవంయొక్క నిస్సమాభ్యధికమైన గొప్పతనం తెలుపబడింది.

"బ్రహ్మ మొదలైన దేవతలు నా గొప్పతనాన్ని స్తుతించలేదా? ఆ రీతిలోనే మీరు కూడా స్తుతించడంలో ఏమి అడ్డు?" - అని శ్రీరంగనాయకి అభిప్రాయంగా తలచి, దానికి సమాధానాన్ని ద్వితీయ పాదంలో అనుగ్రహిస్తున్నారు.

**(ప్రాంచో విరించ్యాదయశ్చ స్తోతుం కే వయ మితి అతః జగృహుః)** - బ్రహ్మ మొదలైన దేవతలు నిన్ను స్తుతించడానికి యత్నించలేదు - అని అనను. వారు కూడా స్తుతించడానికి ప్రయత్నించినవారే. అయితే ఏమని పల్కి యత్నించారు? అని గమనిస్తే,

**(స్తోతుం కే వయమ్)**- నిన్ను స్తుతించడానికి మేము ఎంతటివారం ? అని తమ అధికారరాహిత్యాన్ని నోరార పల్కుతూ, స్తుతించడానికి ప్రయత్నిస్తున్నారు. వారి పలికే సూక్తియే అటువంటిది అయినపుడు, నావంటి అజ్ఞులు సమీపించడానికి కూడా ప్రసక్తి లేదు కదా - అని (అర్థం యొక్క) శేషపూరణాన్ని చేయాలి. ఇది కైముతిక న్యాయసిద్ధం - అని భావం.

**(అదః)** - ఈ స్తుతిని చేయడమనే కార్యాన్ని,

**(జగృహుః)**- పరిగ్రహించారు. ఆరంభించారు- అని భావం.

**(అప్యేవమ్)**- ఏవమపి - అని అర్థం. ఈ విషయాన్ని మేము బాగా గ్రహించినవారం అయినా.

**(కావాచః వయమ్)** - ఇచటి **"వయమ్"** అనే బహువచనం ఆత్మని బహువచనం. తాత్పర్యంలో ఏకవచనంలో పర్యవసిస్తుంది. చాలా నీచమైన వచనాన్ని కల్గిన నేను - అని భావం. అర్థమాధుర్యం, శబ్దగాంభీర్యం లేకుండా, నోటికి వచ్చినట్లుగా ప్రలపించే నేను- అని భావం. కుత్సితమనే అర్థంలో **"కు"**

శబ్దం ప్రయోగింపబడి, దాని స్థానంలో "కా" అనేది ఆదేశంగా వచ్చింది. "ఈషదర్థే చ" అని అనుశాసనం.

**(వాఙ్మనసయోః భాషానభిజ్ఞం తవ పదం కవయితుం ప్రయతామహే)** - వాక్కుకు, మనస్సుకు అందనిదైన నీ స్వరూపాన్నిగూర్చి కవిత్వం చెప్పడానికి ప్రయత్నిస్తున్నానే! అయ్యో! అని భావం. ఇక్కడ **"పద"** మంటే స్వరూపమని అర్థం. మనశ్శబ్దం సకారాంతమైనా, అది వాక్శబ్దంతో చేరి సమాసాన్ని పొందినపుడు **"వాఙ్మనస"**అని అకారాంతంగా మారుతుంది. **"అచతురవిచతుర"** ఇత్యాది వ్యాకరణ సూత్రం స్మరణీయం.

**(భాషానభిజ్ఞమ్)** - "గిరామ్ ప్రశస్త్యై స్వస్తి" - మంచి మాటలు నా నోటిలో ప్రవేశించి చెడిపోకుండా, వాటి గొప్పతనం వర్ధిల్లాలి. అనధికారి అయిన (నావంటివాడు) ఒకడు వేదాన్ని పల్కడం ఆరంభిస్తే, ఆ వేదవాక్యాలు చెవితో ఆలకించడానికి కూడా వీలు కాని రీతిలో వాటి అతిశయం నశించి పోతుంది కదా! ఆ రీతిలో నా నోటిలో ప్రవేశించి మంచి వాక్కులు తమ గొప్పతనాన్ని కోల్పోకుండా చక్కగా నిలచి వర్ధిల్లాలి - అని వాటికి మంగళాశాసనం చేస్తున్నారు. ఇది ఒక విలక్షణమైన నైచ్యానుసంధానప్రకారాతిశయం.

**6) స్తోతారం తముశన్తి దేవి! కవయో యో విస్తృణీతే గుణాన్**
**స్తోతవ్యస్య తతశ్చ తే స్తుతిధురా మయ్యేవ విశ్రామ్యతి ।**
**యస్మాదస్మదమర్షణీయఫణితి స్వీకారత స్తే గుణాః**
**క్షాన్త్యౌదార్యదయాదయో భగవతి! స్వాం ప్రస్తువీరన్ ప్రథామ్॥**

భగవతి = పూజ్యురాలవైన, దేవి = దేవీ! (శ్రీరంగనాయకీ! కవయః = ప్రాజ్ఞులు, యః = ఎవడు, స్తోతవ్యస్య = స్తుతింపదగినవానియొక్క, గుణాన్ = గుణాలను, విస్తృణీతే = విస్తరింపజేస్తున్నాడో (వర్ణిస్తున్నాడో), తం = అతనిని, స్తోతారం = స్తుతించేవానినిగా, ఉశంతి = పల్కుతున్నారు (భావిస్తున్నారు), తతః+చ = అందువల్ల, తే = నీయొక్క, స్తుతిభరా = స్తుతి అనే భారం, మయి + ఏవ = నాపైనవే, విశ్రామ్యతి = విశ్రాంతిని పొందుతున్నది (పరమావధిని పొందుతున్నది), యస్మాత్ = ఎందువల్ల అయితే, తే = నీయొక్క క్షాంతి + ఔదార్యదయా + ఆదయః = సహనం, ఔదార్యం, కరుణ మొదలైన, గుణాః = కల్యాణగుణాలు, అస్మత్+అమర్షణీయ= మాయొక్క సహించరాని, ఫణితి = మాటల ప్రకారాన్ని, స్వీకారతః = పరిగ్రహించడంవల్ల, స్వాం ప్రథాం = తమ కీర్తిని

(అతిశయాన్ని), ప్రస్తువీరన్ = ప్రకటిస్తున్నాయో, (అందువల్ల నీ దయాది గుణాల ప్రకాశం నా స్తుతివల్లనే పరమావధిని పొందుతున్నది).

**వ్యాఖ్యానమ్ :**– గడచిన శ్లోకంలో శ్రీరంగనాయకిని స్తుతించడానికి తాము అధికారం లేనివారమని అన్నారు – ఆ విధంగా అయితే, ఇక నోరు మూసికొని ఉండవలసినదే తప్ప, నోరు తెఱచి ఒక్కమాట అయినా పలికే ప్రసక్తి లేదే!– అని అనగా, శ్రీరంగనాయకిని స్తుతించడంలో తమకు మాత్రమే అధికారపూర్తి ఉన్నది– అని అంటూ ఒక చమత్కారాతిశయం స్ఫురించేటట్లుగా పల్కుతున్నారు.

**(దేవి ! తే స్తుతిధురా మయ్యేవ విశ్రామ్యతి)**– ఓ దేవీ ! శ్రీరంగనాయకీ! నిన్ను స్తుతించడమనే పనిలో దాసునైన నేను ఒక్కడను మాత్రమే ధురంధరుడనై ఉండడం తగినది. నేను తప్ప ఇక వేఱెవరు నిన్ను స్తుతించడంలో అధికారాన్ని వహించలేరు – అని భావం. "నిన్ను స్తుతించడంలో నేనే అనధికారిని – అని, నిన్ను స్తుతించడంలో నేను అధికారిని కాను – అని ఈరెండు పరస్పర వ్యాహతంగా ఉన్నవే! పూర్వశ్లోకాన్ని పలికేటపుడు అవిద్వాంసులై ఉండి, ఇపుడు విద్వాంసు లయ్యారా! ఏమి?" అని ప్రశ్నించగా అటువంటి విషయం ఏమీ లేదు. నేను ఆలోచించకుడా "నేను అధికారిని" అని అన్నాను. ఆలోచించగానే, "నేనే అధికారిని" అని తోచింది. దానిని విస్తృతంగా విన్నపిస్తున్నాను. వినండి– అని అంటున్నారు.

**(యః స్తోతవ్యస్య గుణాన్ విస్తృణీతే, తం కవయః స్తోతారముశంతి)**– లోకంలో ఒక వ్యక్తిని స్తోత (స్తుతికర్త) – అని అనడం ఎందువల్ల? ఏకారణాన్ని బట్టి? అనే విషయాన్ని ఆలోచిద్దాం. **స్తోత**–అని అనడానికి స్తోత్రం చేసేవాడు– అని భావం. ఈ పేరు ఎవరి విషయంలో వ్యవహరింపబడుతున్నది? – అని అంటే, ఎవనినిగూర్చి స్తోత్రాన్ని రచించాలి – అని ప్రయత్నిస్తున్నాడో, అతనివద్ద ఉండే సద్గుణాలను చక్కగా ప్రకాశింపజేసేవాని విషయంలోనే కదా స్తోత–అనే పేరు వ్యవహరింపబడుతున్నది. ఇందులో ఏవిధమైన వివాదం లేదు.

**(తతశ్చ తే స్తుతిధురా మయ్యేవ విశ్రామ్యతి)**– స్తోతయొక్క లక్షణం ఇదే కనుక, ఈ లక్షణం నా విషయంలో సంభవిస్తున్నది కనుక, నీకు స్తుతికర్తనై నేను ఉండదగినవాడను– అని భావం. పూర్వం పల్కిన స్తోతయొక్క లక్షణం తమపట్ల ఏ రీతిలో సంభావితం? అనే విషయాన్ని శ్లోకంలోని ఉత్తరార్ధంద్వారా ద్రఢీకరిస్తున్నారు.

( **భగవతి! అస్మదమర్షణీయఫణితిస్వీకారతః తే క్షాంతౌదార్యదయాదయో గుణాః యస్మాత్ స్వాం ప్రథాం ప్రస్నువీరన్, తతశ్చ తే స్తుతిధురా మయ్యేవ విశ్రామ్యతి** )– ఇపుడు నేను నోరు తెఱచి పలుకబోయే పల్కులు చెవులతో విన లేని దురుక్తులే కాగలవు. వీటిని కూడా నీవు చెవులార వినబోతున్నావు. విని ఊరికే ఉండడం కాకుండా, **"కుఴలినిదు యాఴ్ ఇనిదు ఎన్బర్ తమ్మక్కళ్ మఴలైచ్చొల్ కేళాదవర్"** (తమ బిడ్డల తీయని ముద్దు పలుకులను వినని వారు వేణునాదం మధురం, వీణానాదం మధురం– అని అంటారు.) అనే రీతిలో ఈ అల్పమైన కవితలనుకూడా మధురభాషణాలుగా గ్రహించి, చాలా ప్రీతిని పొంది, వాటిలోని దోషాలను చూచి దండించకుండా, క్షమాగుణాన్ని ప్రదర్శించడమేకాక, సర్వస్వదానం చేసి, ఔదార్యగుణాన్ని ప్రదర్శించి, అంతకుమించి, దయావాత్సల్యాది గుణాలను ప్రదర్శించబోతున్నావు. ఇందులో సందేహం లేదు. అందువల్ల నా కవితలు ఈ రీతిలో నీ కల్యాణగుణాలను విస్తరింపజేస్తున్నాయి. కనుక, **"స్తోతవ్యస్య గుణాన్ యో విస్తృణీతే సః స్తోతా"** (స్తుతించదగినవాని గుణాలను ఎవడు విస్తరింపజేస్తున్నాడో, అతడే స్తోత) అనే స్తోతయొక్క లక్షణం నా పట్ల సంభావితం కావడంలో (అన్వయించడంలో) లోటు లేదు. ఈ లక్షణానికి అన్యత్ర అతివ్యాప్తి సంభవించే (వేఱొకరిలో ఈలక్షణం అన్వయించే) ప్రసక్తి లేనేలేదు– అనే విషయాన్ని **"మయ్యేవ విశ్రామ్యతి"** అనే సూక్తిద్వారా తెలియజేస్తున్నారు. అతివ్యాప్తి ఎందువల్ల సంభవించదు? అని అంటే, తమవలె అమర్షణీయోక్తులను పల్కి, శ్రీరంగనాయకి యొక్క క్షాంతి, ఔదార్యం, దయ మొదలైన కల్యాణగుణాలను విరివిగా వ్యాపింపజేయగల్గిన వారు వేఱెవ్వరు లేరు – అని. ఉండే అవకాశం ఏమాత్రం లేదని అభిప్రాయం.

ఏతావతా ఈ శ్లోకంలోని పరమతాత్పర్యం ఏమి? అంటే – శ్రీరంగనాయకి స్తుతి – అని అంటూ ఇపుడు నేను పలుకబోయే మాటలు దోషభూయిష్ఠాలై, కర్ణారుంతుదాలుగా (చెవులతో, వినడానికి సాధ్యం కానివి, బాధను కల్గించేవిగా) ఉన్నప్పటికీ, క్షమావాత్సల్యాది గుణనిధి అయిన శ్రీరంగనాయకీదేవి వాటిని పరమభోగ్యాలుగానే స్వీకరించడంలో లోటు ఉండదు. ఇటువంటి అసహ్యోక్తులను నేను తప్ప వేఱెవ్వరు పలుకలేరు. నేను ఈ వాక్కులను పలుకకుండా నోరు

మూసికొని ఉంటే, శ్రీరంగనాయకియొక్క దయావాత్సల్యాది గుణాలు ప్రకాశించే అవకాశమే లేకుండా, వెలవెలపోతాయి, అంతే. అందువల్ల నేను స్తుతించడానికి ప్రయత్నించడం చాలా అవశ్యకం- అని. ఈ విధంగా భట్టర్ పల్కడం వారి అసాధారణ చాతుర్యానికి గీటురాయి. "గుణాః స్వాం ప్రథాం ప్రస్నువీరన్" అనే సూక్తికి గుణగణాలు ప్రకాశాన్ని పొందుతాయి- అని భావం.

**7) సూక్తిం సమగ్రయతు నః స్వయమేవ లక్ష్మీః**
**శ్రీరఙ్గరాజమహిషీ మధురైః కటాక్షైః ।**
**వైదగ్ధ్యవర్ణ గుణగుమ్భన గౌరవై ర్యాం**
**కణ్డూలకర్ణకుహరాః కవయో ధయన్తి ॥**

శ్రీరంగరాజమహిషీ = శ్రీరంగనాథుని పట్టమహిషి అయిన, లక్ష్మీః = శ్రీరంగ నాయకి, మధురైః = తీయని, కటాక్షైః = కటాక్షాలతో, నః = మాయొక్క, సూక్తిం = సూక్తిని, స్వయమేవ = స్వయంగానే, సమగ్రయతు = పరిపూర్ణతను పొందించాలి, యాం = ఏ (మా) వాక్కును, వైదగ్ధ్య = అర్థగాంభీర్యం, వర్ణగుణ = అక్షరగుణాలు - అనే వీటియొక్క, గుంభన = కూర్పులోని, గౌరవైః = గొప్పతనాల (వైలక్షణ్యాల) చేత, కవయః = ప్రాజ్ఞులు, కండూలకర్ణకుహరాః = ఇంకా ఇంకా వినాలనే ఆశను కల్గిన కర్ణరంధ్రాలను కలవారై, ధయంతి = పానం చేస్తున్నారో (చెవులారా వింటున్నారో) (అటువంటి సూక్తిని పలికేటట్లుగా మమ్ములను అనుగ్రహించాలి)

**వ్యాఖ్యానమ్ :-** గడచిన శ్లోకంలో **"అస్మదమర్షణీయఫణితి"** ఇత్యాదిగా పల్కిన సూక్తులను ఆలకించిన శ్రీరంగనాచ్చియార్, "భట్టర్ స్వామీ ! మీ వాక్సామర్థ్యం లోకం కీర్తించే అతిశయాన్ని కల్గినదై ఉండగా, మరి మీరు ఈవిధంగా అంటున్నారే ? నైచ్యానుసంధానం స్వరూపప్రాప్తమే (స్వరూపానికి తగినదే) అయినా, దానికి ఒక పరిమితి లేదా? విశేషించి, మా కటాక్షాన్ని పొందిన మీరు ఆశ్చర్యకరమైన సూక్తులను వర్షించగల్గినవారై ఉండగా, ఈ రీతిలో కూడా పల్కడం తగునా?"- అని అనగా, "దాసుడనైన నాకు సాధ్యం కాని వాక్సామర్థ్యం ఏదయినా ఉన్నదా? ఏదీ లేదు. **"శ్రీరంగరాజకమలాపదలాలితత్వమ్ యద్వా, అపరాధ్యతి మమ స్తుతిసాహసేఽస్మిన్"** (లేక, శ్రీరంగనాథుడు, శ్రీరంగనాయకి తమ శ్రీచరణాలతో లాలించి పెంచినందువల్లనే నేను ఈ స్తుతిచేయడమనే సాహసంలో ప్రవర్తిస్తున్నాను) అని ఇతఃపూర్వమే (శ్రీరంగరాజస్తవం ఆరంభంలో) విన్నపించాను.

నీ కటాక్షవీక్షణాల ఫలంగానే నాకు వాగ్బలం సిద్ధించాలి" అని ఈ శ్లోకంలో పల్కుతున్నారు.

**(శ్రీరంగరాజమహిషీ లక్ష్మీః స్వయమేవ మధురైః కటాక్షైః నః సూక్తిం సమగ్రయతు)** శ్రీరంగరాజదివ్యమహిషి అయిన శ్రీరంగనాయకి నా ప్రార్థన లేకుండానే తానే స్వయంగా తన నిర్హేతుకకరుణ మూలంగా భవ్యకటాక్షవీక్షణాలను నాపై ప్రసరింపజేసి, నా నోటిద్వారా చక్కని సూక్తులు సమృద్ధిగా వెలువడేటట్లుగా అనుగ్రహించాలి- అని భావం. నా ప్రయత్నమూలంగా సూక్తులు వెలువడితే అవి దోషభూయిష్ఠాలుగా ఉంటాయే తప్ప, చక్కగా ఉండే అవకాశం లేదు. శ్రీరంగనాయకి స్వయంగా తానే తన స్తుతిని పూర్తి చేయగోరినట్లయితే, ఆ కవితలు మాధుర్యం మూర్తీభవించినట్లుగా ఉండడంలో అడ్డు లేదు- అని భావం. శ్రీరంగనాయకి కటాక్షమూలంగా వ్యక్తమయే సూక్తుల అతిశయం ఏవిధంగా ఉంటుంది? అనే విషయాన్ని శ్లోకంలోని ఉత్తరార్ధంలో ప్రదర్శిస్తున్నారు.

**(యాం సూక్తిం వైదగ్ధ్యవర్ణగుణగుంభనగౌరవైః కవయః కందూల కర్ణకుహారా సంతః ధయంతి)** - శబ్దమాధుర్యం, అర్థగాంభీర్యం, ప్రయోగవైచిత్రి, శైలీసంవిధానం- ఇత్యాది విశేషాలను కల్గినవై, ఇంకా వినాలి, ఇంకా వినాలి- అని కవులు ఆశపడే రీతిలోని సూక్తులను శ్రీరంగనాయకి నాకు అనుగ్రహించాలి. అని భావం. **"వైదగ్ధ్యమ్"**- అర్థవైలక్షణ్యం, **"వర్ణగుణమ్"**- శబ్దవైలక్షణ్యం. ఇవి అన్నీ నిబిడంగా ఉండడం గుంభనం. అది ఉన్నట్లయితే కవులు నిద్రాహారాలు లేకుండా దానినే అమృతపానంగా చేస్తారు. **"కందూలకర్ణకుహరాః"** అనే ప్రయోగానికి తిమ్మిరిని (దురదను) కల్గిన చెవులను కల్గినవారై- అని భావం. **"శ్రుణ్వంతి"** (ఆలకిస్తారు) అని పలుకవలసిన చోట **"ధయంతి"** అని పానార్థకమైన ధాతువును ప్రయోగించడం- పండితులకు సూక్తి శ్రవణమే సుధాపానం- అనే అర్థం స్ఫురింపజేయడంకోసం.

**8) అనాఘ్రాతావద్యం బహుగుణపరీణాహి మనసో**
**దుహానం సౌహార్దం పరిచితమివాథాఽపి గహనమ్ ।**
**పదానాం సౌభ్రాత్రాత్ అనిమిషనిషేవ్యం శ్రవణయోః**
**త్వమేవ శ్రీర్మహ్యం బహుముఖయ వాణీవిలసితమ్ ॥**

శ్రీః = లక్ష్మీదేవి! (శ్రీరంగనాయకీ), అనాఘ్రాత+అవద్యం = దోషగంధాన్ని ఏ మాత్రం లేనిది, బహుగుణపరీణాహి = పలు గుణాల పరమావధిని కల్గినది, మనసః= (సహృదయుల) మనస్సులకు, సౌహార్దం = సంతోషాన్ని, దుహానం = కల్గించేది, పరిచితమ్ ఇవ = పరిచయం అయినట్లుగా ఉండేది, అథాపి = అయినా, గహనం = గంభీరమైనది, పదానాం = పదాలయొక్క, సౌభ్రాత్రాత్ = గొప్ప పోహళింపువల్ల, శ్రవణయోః = చెవులకు, అనిమిషనిషేవ్యం = రెప్పపాటు లేకుండా సేవించ (విన) దగినది. అయిన, వాణీవిలసితం = వాగ్విలాసాన్ని, మహ్యం = నాకు, త్వమేవ = నీవే, బహుముఖయ = మిక్కిలిగా వృద్ధిచేయాలి.

**వ్యాఖ్యానమ్ :–** గడచిన శ్లోకానికి వివరణరూపమే – ఈ శ్లోకం. **"లక్ష్మీః స్వయమేవ నః సూక్తిం సమగ్రయతు"** అని గడచిన శ్లోకంలో అన్నారుకదా. ఆ సూక్తి వైభవం ఎటువంటిదై ఉండాలి? అని అంటే, ఇటువంటిదై ఉండాలి– అని ఈ శ్లోకంలో తెల్పుతున్నారు. గడచిన శ్లోకంలో శ్రీరంగనాయకిని సాక్షాత్తుగా ఉద్దేశించి ప్రార్థించకుండా పరోక్షంగా పలికారు. అది యుక్తం కాదుకదా! ప్రత్యక్షంగా సంబోధిస్తూ, "నీవు ఇటువంటి వాగ్విలాసాన్ని కల్గి ఉండేటట్లు చేయాలని ఈ శ్లోకంలో ప్రార్థిస్తున్నారు. నాల్గవ పాదంలోని **"శ్రీః"** అనే పదం సంబోధన.

**(హే శ్రీః! త్వమేవ మహ్యం వాణీవిలసితం బహుముఖయ)** – ఓ శ్రీరంగ నాయకీ! నీవే, వాగ్విలాసాన్ని దాసుడనైన నాకు బహుముఖంగా అనుగ్రహించాలి – అని అర్థం. "ఈ ప్రార్థనను సరస్వతిసన్నిధిలో కదా చేయాలి! నా దగ్గర చేస్తే ప్రయోజనం ఉంటుందా? నేను ఇవ్వగల్గినది ఐశ్వర్యం; సరస్వతి ఇవ్వగల్గినది వాగ్విలాసం. ఈ విధమైన వ్యవస్థితి ఉండగా, ఆమెను విడిచి పెట్టి నన్ను కోరడం తగదు" అని శ్రీరంగనాయకి మనస్సులోని భావమని అభ్యూహించి, **"త్వమేవ"** (నీవే) అని అంటూ అవధారణశిరస్కంగా పల్కుతున్నారు. దాసుడనైన నా అనన్యదైవత్వాధ్యవసాయం ఎంత మాత్రం సడలకూడదు. నీవు ఇవ్వలేనిది అనేది ఏదీ లేదు. మా వంశంలో దేవతాంతరభజనాన్ని చేసి, ఏ ప్రయోజనాన్ని కోరేవారు లేరు. ఏది కావాలని భావించినా, దివ్యదంపతులనే మేము అర్థిస్తాము– అనే అర్థవివక్ష **"ఏవ"** కారంలో ఉన్నది. తిరువరంగత్తముదనార్ కూడా ఇరా మానుశనూఱ్ఱన్దాది చివరలో **"తెన్నరఙ్గన్ అణియాక మన్నుమ్ పఙ్గయమామలర్ ప్పావైయై ప్పోఱ్ఱుదుమ్ ఎన్ తలైమిశైయే ఇరామానుశనడి ప్పూమన్నవే"**

(దక్షిణదిక్కులోని శ్రీరంగానికి నాథుడైన శ్రీరంగనాథునకు గొప్ప అలంకారంగా భాసించే లక్ష్మీదేవిని స్తుతించడం ఎందుకంటే?) (నా శిరస్సుపై శ్రీరామానుజుల పాదపద్మాలు నిలచి ఉండడం కోసం) అని అన్నారు. ఇందువల్ల ఏ పురుషార్థసిద్ధికి అయినా లక్ష్మీదేవి (శ్రీరంగనాయకి) నే ప్రార్థించాలి – అని తెలుపబడింది. తాము ప్రార్థించే **"వాణీవిలసితమ్"** ఎటువంటిదై ఉండాలి?– అనే విషయాన్ని ఉద్దేశించి మూడు పాదాలతో విశేషించి పల్కుతున్నారు.

**(అనాఘ్రాతావద్యమ్)**– అక్షరాలను, పదాలను, వాక్యాలను ఆశ్రయించి ఉండే దోషాలు అనేకంగా లోకంలో ఉంటాయికదా. అటువంటి దోషాలలో ఏదోషానికి సంబంధించిన సంబంధలేశం అయినా ఉండకూడదు. చెవులకు వినడానికి కఠినంగా ఉండడం, అశ్లీలార్థకమై ఉండడం, ప్రక్రమభంగాది దోషయుక్తమై ఉండడం తగదని భావం.

**(బహుగుణపరీణాహి)**– దోషవర్జితమై ఉండడం– అనేది ఒక అతిశయం కదా! అలంకారపుష్టి మొదలైన గుణవిశేషాలు మిక్కిలిగా ఉండాలికదా. **"శిఱప్పుడన్ పూనై యిఱప్పిలిరున్దాల్, పుఱప్పడమాట్టాదెలి"** (పిల్లి వాకిటిలో పొందికగా ఉంటే ఎలుక బయటికి రాలేదు) అని అంటూ ఒకరు ఒక కుఱళ్‌ను పాడారట. ఇందులో గణభంగం మొదలైన దోషాలు ఏమీ లేకపోయినా, హాస్యరసానికి మాత్రమే లక్ష్యమైన ఇందులో గుణపరిపోషం ఏమీ లేదు కదా! ఆ రీతిలో కాకుండా, శబ్దాలంకారాలు, అర్థాలంకారాలు– మొదలైన గుణవిశేషాలు అన్నీ నిండి ఉండడం– అనే వైలక్షణ్యాన్ని కల్గి ఉండాలి – అని అంటున్నారు.

**(మనసః సౌహార్దం దుహానమ్)**– దోషవర్జితంగాను, గుణపరిపుష్టంగాను ఉండడం మాత్రమే కాకుండా, అంతకుమించిన గొప్పతనాలు కూడా కొన్ని ఉన్నాయి– అని దీనితో ఆరంభించి మూడు విశేషణాలతో తెలుపబడుతున్నాయి. నిర్దోషమై, గుణపుష్కలమై ఉన్నా, ఇతరుల మనస్సు గాయపడేటట్లు ఉంటే ప్రయోజనం లేదు కదా ! ఆవిధంగా కాకుండా, వినగా వినగా మనస్సు ఆనందంతో నిండేటట్లు, పండేటట్లు ఉండాలి– అని అంటున్నారు.

**(పరిచితమివ అథాపి గహమ్)** – పదాలు అన్నీ శ్రుతపూర్వాలుగానే ఉంటాయి. ఆ విధంగా ఉన్నా, వాటి తాత్పర్యం గురుముఖంగానే విని తెలిసికో

వలసినట్లుగా ఉండాలి. వాస్తవానికి ఈ విశేషణం భట్టర్ శ్రీసూక్తికే తగినది. ఇందులోను ఈ దివ్యగ్రంథానికి మాత్రమే విశేషించి తగినది.

**(పదానాం సౌభ్రాత్రాత్ శ్రవణయోః అనిమిష నిషేవ్యమ్)**– పూర్వం పల్కిన అన్నిటిలోను ఇది చాలా గొప్ప వైలక్షణ్యం. **"హఠాదాకృష్టానాం కతిపయపదానాం రచయితా"** (ఆకస్మికంగా గ్రహించిన కొన్ని పదాలను కూర్చే కవి) అనేటట్లుగా కవిత్వాన్ని (ఆశువుగా) చెప్పగల్గిన వారు పలువురున్నారు కదా ! అటువంటి వారి రచనలలో ఈ అతిశయం అరుదుగా గోచరిస్తుంది. పదాలలో ఒకదానితో ఇంకొక పదానికి మైత్రిని కల్గి ఉండి, విలక్షణమైన శ్రావ్యతను కల్గి ఉండడం– అని అంటున్నారు. **"యా పదానాం పరా మైత్రీ సా శయ్యేతి కథ్యతే"** అని నిర్వచింపబడే శయ్యావిశేషం సహృదయహృదయైకవేద్యమై ఉంటుంది. అదియే **"పదానాం సౌభ్రాత్ర"** మనబడింది. ఇది ఉంటే సాహిత్య రసికులు విశ్రాంతి లేకుండా అనుభవించి ఆనందిస్తారు. ఈ రీతిలో ఇటువంటి అతిశయాలు సమృద్ధిగా ఉండే వాగ్విలాసాన్ని నీవు అనుగ్రహించాలి– అని అంటున్నారు. **"విలసిత"** మనీ **"విలాస"**మని పర్యాయాలు.

**9) శ్రియశ్శ్రీః! శ్రీరఙ్గేశయ! తవ చ హృద్యాం భగవతీం**
**శ్రియం త్వత్తోఽప్యుచ్చైః వయ మిహ ఫణామః శృణుతరామ్ ।**
**దృశౌ తే భూయాస్తాం సుఖతరళతారే శ్రవణతః**
**పునః హర్షోత్కర్షాత్ స్ఫుటతు భుజయోః కఞ్చుకశతమ్ ॥**

శ్రియః శ్రీః = లక్ష్మీదేవికి కూడా లక్ష్మీవంటివాడా!, శ్రీరంగేశయ = శ్రీరంగంలో ఆదిశేషునిపై శయనించిన శ్రీరంగనాథా!, తవ చ=నీకుకూడా, హృద్యాం = హృదయానికి ఇష్టురాలైన, భగవతీం = పూజ్యురాలైన, శ్రియం = లక్ష్మీస్వరూపిణి అయిన శ్రీరంగ నాయకిని, త్వత్తః + అపి = నీకంటే కూడా, ఉచ్చైః = ఉన్నతంగా, వయం = మేము, ఇహ = ఇక్కడ, ఫణామః = వర్ణిస్తున్నాము, శ్రుణుతరామ్ = (నా స్తుతిని) బాగా సావధానంగా ఆలకించు, శ్రవణతః=ఆవిధంగా వినడం వల్ల, తే=నీ యొక్క, దృశౌ= రెండు నేత్రాలు, సుఖతరళతారే = అమితానందాన్ని పొందదడంవల్ల మిక్కిలిగా చలించే (మెటిసే) కనుగుడ్లు కల్గినవిగా, భూయాస్తాం = కావాలి, పునః = అంతేకాక, హర్ష + ఉత్కర్షాత్ = నీకు కల్గిన గొప్ప హర్షంవల్ల, భుజయోః = (ఉప్పొంగిన నీ) భుజాలలోని, కంచుక శతకం = వందలాది కంచుకాలు (చొక్కాలు), స్ఫుటతు = పగిలిపోవాలి.

**వ్యాఖ్యానమ్ :-** అపేక్షానిరపేక్షంగానే ఇవ్వగల్గిన శ్రీరంగనాయకి, అపేక్షించిన తరువాత కూడా అనుగ్రహించకుండా ఉండేది ఏదీ లేదుకదా! "ఆవిధంగానే కానివ్వండి" అని చల్లగా కటాక్షించి, తలను ఊగించగానే, తమ మనస్సు, దేహం ఉబ్బి తబ్బిబ్బై, స్తోత్రాన్ని చేయడానికి భట్టర్ ఉద్యుక్తులవుతున్నారు. దీనికి ముందే, శ్రీరంగనాథుని విషయంగా శ్రీరంగరాజస్తవమనే ఒక మహాగ్రంథాన్ని రచించారు. దానిని పూర్వశతకమని, ఉత్తరశతకమని రెండు శతకాలుగా విభజించి, రెండిటిలో కలిపి రెండు వందలముప్పై రెండు శ్లోకాలతో శ్రీరంగనాథుని గొప్పతనాన్ని కీర్తించారు. ఈ శ్రీగుణరత్నకోశం ఆవిధంగా విపులంగా కాకుండా, అఱువై ఒక్క శ్లోకాలను మాత్రమే కల్గినదై, సంకుచితమై ఉన్నా, శ్రీరంగనాయకియొక్క మహిమను నిస్సమాభ్యధికంగా వర్ణిస్తున్నదై, శ్రీరంగరాజస్తవం కంటే గొప్పతనాన్ని కల్గినదై ఉండాలి- అనే ఆశంసను ఒక చమత్కారమైన రీతిలో భట్టర్, ఈ శ్లోకంలో వ్యక్తం చేస్తున్నారు శ్రీరంగనాయకి సన్నిధినుండి, శ్రీరంగనాథుని సన్నిధి వాకిటికి శీఘ్రంగా పోయి నిలచి, సుప్రభాతాన్ని పాడి **"ఒన్ఱు కేట్టరుళాయ్"** (ఒక విన్నపాన్ని ఆలకించు) అని విన్నపం చేస్తున్నారు - ఈశ్లోకంలో.

**(శ్రియః శ్రీః! శ్రీరంగేశయ!) - "తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా త్తిరువరఙ్గా"** (లక్ష్మికి కూడా లక్ష్మి అయిన ఓ శ్రీరంగనాథా!) అని సంబోధిస్తున్నారు. సంబోధించ గానే "భట్టర్ కంఠధ్వనివలె ఉన్నదే" అని గ్రహించి, "నా దగ్గరకు ఎందుకు వచ్చారు? ఏమి విశేషం?" అని శ్రీరంగనాథుడు ప్రశ్నించాడు.

**(భగవతీం శ్రియం ఫణామః)-** "దేవరవారి దేవేరిని స్తుతించాలని వచ్చాను" అని భట్టర్ బదులిస్తున్నారు. దీనిని ఆలకించిన శ్రీరంగనాథుడు, "ఆమెను స్తుతించాలని అనుకొంటే, ఆమెవద్దకే పోయి స్తుతించకూడదా! నా దగ్గరకు రావడం ఎందుకు?' అని అన్నాడు.

**(తవ చ హృద్యామ్ శ్రియమ్ ఇహ ఫణామః)** - "ఆ దేవేరి (లక్ష్మీదేవి- శ్రీరంగనాయకి) నీ మనస్సుకు చాలా ప్రియమైనది అయినందున, ఆమెను గూర్చిన స్తుతిని ఇక్కడ నీ సమక్షంలో చేయడమే మంచిది - అని భావించి నీవద్దకు వచ్చాను"- అని అంటున్నారు. "సరే, ఆవిధంగా అయితే, స్తుతించండి" అని అన్నాడు, శ్రీరంగనాథుడు. "వివక్షితాన్ని ముందుగానే స్పష్టంగా వ్యక్తం చేస్తాను" అని నిశ్చయించుకొని-

**(శ్రియం త్వత్తోఽప్యుచ్చైః వయమిహ ఫణామః)** – "నీకంటే శ్రీరంగ నాయకినే మిక్కిలి ఉన్నతంగా వర్ణించబోతున్నాను. ఇది నీకు అభిమతమే కదా!"– అని అన్నారు, భట్టర్. ఇది, తన మనస్సుకు పరమసంతోషాన్ని కల్గించేది అయినా, వీరి (భట్టర్) ఉక్తి చమత్కారాన్ని ఆలకించడంకోసం అందులో అనాసక్తి స్ఫురించే టట్లుగా శ్రీరంగనాథుడు తోచాడు. **"పొఙ్గోదమ్ శూழ్న్ద పువనియుమ్ విణ్ణులకమ్ అఙ్గాదుమ్ శోరామే ఆళ్కిన్ఱ ఎమ్బెరుమాన్ శెఙ్గోలుడైయ తిరువరఙ్గచ్చెల్వనార్"** (పొంగే కెరటాలను కల సముద్రంచే పరివేష్ఠితమైన భూమిని, పరమపదాన్ని వాటిలో ఏమీ లోటు పడకుండా పాలించే స్వామి, శాసనదండాన్ని కల శ్రీరంగనాథుడు) అనే కీర్తిని పొందిన నేను పరోత్కర్షను సహిస్తానా? నా సమక్షంలో ఒక స్త్రీని చాలా గొప్పగా కీర్తించవచ్చునా?– అని మనస్సులో చివుక్కుమన్నట్లుగా శ్రీరంగనాథుడు భాసించాడు. ఆ సన్నివేశాన్ని దర్శించిన భట్టర్,

**(శృణుతరామ్)** – అని అంటున్నారు. "తన సంబంధంతో నీకు కూడా అతిశయాన్ని కల్గించే దివ్యదేవేరియొక్క అతిశయాన్ని చెవులార నీవు ఆలకించవద్దా! ఇందులో నీవు అనాసక్తిని ప్రదర్శించవచ్చునా? నీ స్తుతిని ఆలకించినపుడు కల్గి ఉండే అభినివేశం కంటే అతిశయించిన అభినివేశంతో ఆలకించు" – అని అంటున్నారు.

ఈ విధంగా భట్టర్ నిర్బంధించగానే, "సరే, ఆ విధంగానే వింటాను లెండి. ఇక స్తుతించండి" అని శ్రీరంగనాథుడు అన్నాడు. "ఊరికే వింటున్నాము– అని అంటే చాలదు. ఆలకించినపుడు నీకు కలిగే మనస్సులోని సంతోషాతిశయం నీ రూపంలో సాక్షాత్తుగా మేము దర్శించేటట్లుగా నీవు ఉండాలి"– అని శ్లోకం లోని ఉత్తరార్ధంలో అంటున్నారు.

**(శ్రవణతః తే దృశౌ సుఖతరళతారే భూయాస్తామ్)**– శ్రీరంగనాయకి యొక్క అతిశయకీర్తనాన్ని పల్కడం ఆలకించినపుడు దేవరవారి నేత్రాలు ఆనందాతిశయం చేత నల్లని కనుపాపలు (కనీనికలు) పరిభ్రమిస్తూ మెఱసిపోవాలి అని అన్నారు. "ఇంతమాత్ర మేనా! ఇంకా ఏమైనా ఉన్నదా" అని అన్నాడు శ్రీరంగనాథుడు.

**(పునః హర్షోత్కర్షాత్ భుజయోః కంచుకశతమ్ స్ఫుటతు)**– "విన్నపిస్తున్నాను ఆలకించు. విని, నీ శరీరం ఉబ్బి తబ్బిబ్బై, నీ భుజాలలో అలంకరించుకొన్న

కంచుకం పగిలి విస్తరించాలి. తిరిగి నీవు ఇంకొక కంచుకం అలంకరించుకొంటే, తిరిగి విన్నపిస్తాను. దానిని విని మళ్ళీ నీ ఒడలు పొంగి, ఆ కంచుకం కూడా పగిలిపోవాలి. ఈ విధంగా పలు కంచుకాలు పగిలిపోవాలి. నీకు కలిగే ఇటువంటి హర్షాతిశయం నాకు తెలియాలి"- అని అంటున్నారు. భగవానునకు, ఈవిధంగా వికృతిని (మార్పును) కల్గించేటట్లుగా ఈ స్తుతి ఆవిర్భవిస్తున్నది - (లేక), ఆవిర్భవించాలి - అనే ఆశంస ఇటువంటి వచనవిన్యాసంద్వారా వ్యక్తీకరింప బడింది.

ప్రారంభించేటపుడే "శ్రియః శ్రీః" అని అంటూ స్తుతిస్తూ ప్రారంభించడం ఒక చమత్కారం. శ్రీరంగనాయకిని ఎంతగా ఉన్నతంగా స్తుతించినా, **"తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా!"** (లక్ష్మీదేవికూడా లక్ష్మి అయిన సంపద్రూపా!) అని అనబడే నీ అతిశయానికి ఏవిధమైన లోటు లేదు సుమా! - అనే భావం స్ఫురించేటట్లుగా పల్కిన తీరు ఇది. **"త్వత్తోఽపి ఉచ్చైః"** అనే ప్రయోగానికి దేవరవారి ఔన్నత్యం కంటే ఉన్నతంగా - అనే అర్థమేకాక, ఇంకొక అర్థాన్ని కూడా చెప్పవచ్చు. అది ఏమంటే - "నీ మాటలతో శ్రీరంగనాయకిని స్తుతిస్తే ఎంత అతిశయంగా- ఆనందంగా - ఉంటుందో, అంతకంటే మించిన అతిశయంగా నేను స్తుతించ బోతున్నాను" - అనేదే - ఆ భావం. ఇక్కడ **"వయమ్"** అని అంటూ భట్టర్ తమను బహువచనంతో నిర్దేశించుకోవడం- దీనివల్ల తమకొక గౌరవం కల్గుతుందనే అభిప్రాయంతో.

**10) దేవి! శ్రుతిం భగవతీం ప్రథమే పుమాంసః**
**త్వత్సద్గుణౌఘ మణికోశగృహం గృణన్తి ।**
**తద్ద్వారపాటనపటూని చ సేతిహాస -**
**సన్తర్కణస్మృతిపురాణ పురస్సరాణి ॥**

దేవి = ఓ శ్రీరంగనాయకీ!, ప్రథమే పుమాంసః=పూర్వ పురుషులు, భగవతీం= దోషరహితమైన పూజ్యురాలైన, శ్రుతిం = వేదాన్ని, త్వత్ + సద్గుణ + ఓఘ = నీ కల్యాణగుణాల సమూహమనే, మణి = మణులకు, కోశగృహం = కోశాగారంగాను, స+ఇతిహాస సంతర్కణ స్మృతి పురాణపురస్సరాణి = ఇతిహాసాలు, తర్కశాస్త్రాలు, స్మృతులు, పురాణాలు - అనే వీనిని, తద్ద్వారపాటనపటూని చ = ఆ కోశాగారం తలుపులను తెరవడంలో సమర్థాలుగాను (కుంచె కోలగాను), గృణంతి = పల్కుతున్నారు.

**వ్యాఖ్యానమ్:-** శ్రీరంగనాథుని తిరుమేని కూడా ఉప్పొంగేటట్లుగా శ్రీరంగ నాయకియొక్క స్తుతి ఆవిర్భవంచబోతున్నదని గడచిన శ్లోకంలో ప్రతిజ్ఞాతమయినది కదా. తదనుగుణంగా స్తుతించడం ఆరంభిస్తున్నారు. **"మానాధీనా మేయసిద్ధిః"** అనే రీతిలో ప్రమేయం సిద్ధించడం ప్రమాణాధీనం కనుక, శ్రీరంగనాయకి యొక్క వైభవం అనే ప్రమేయానికి సాధకమైన ప్రమాణాలను ప్రస్తావించదలచి, ఇతిహాస-పురాణాద్యుపబృంహణాలతో ఉపబృంహితమైన (వివరింపబడిన) శ్రుతులు ఈ విషయానికి ప్రమాణాలు- అని ఈ శ్లోకంలో పల్కుతున్నారు. తాము రచించే స్తుతికి శ్రీగుణరత్నకోశమనే తిరునామం పెట్టబడినదనే విషయాన్ని ముద్రాలంకార శైలిలో అర్థం ద్వారా సూచింపచేస్తున్నారు.

**(దేవి ! ప్రథమే పుమాంసః భగవతీం శ్రుతిం త్వత్సద్గుణౌఘ మణికోశగృహం గృణంతి)** ఓ శ్రీరంగనాయకీ ! శ్రీవ్యాసపరాశర వాల్మీకి ప్రభృతులు, శ్రీపరాంకుశ పరకాల యతివరాదులైన పూర్వపురుషులు **"శుడర్ మికు శురుదియై"** (గొప్పగా ప్రకాశించే శ్రుతిని) నీ కల్యాణగుణగణాలనే రత్నాలను భద్రపరచడం కోసమైన భాండాగారంగా పల్కుతున్నారు. శ్రీమహాలక్ష్మియొక్క కల్యాణగుణాలు మిక్కిలిగా వేదాలలో ప్రకాశిస్తున్నాయి- అని పెద్దలు భావిస్తున్నారు- అని దీని భావం. "వేదంలోని ఒక భాగమైన శ్రీసూక్తంలో లక్ష్మీదేవి వైభవం ప్రకాశించే విషయం వాస్తవమే. ఇంతమాత్రాన్ని ఆధారంగా చేసికొని వేదాలన్నీ లక్ష్మీదేవి గొప్పతనాన్నే పల్కుతున్నాయి - అని అనడం సబబేనా?"- అని కొందఱు సందేహించవచ్చు. భగవానునకు కల గొప్పతనం అంతా లక్ష్మీదేవి సంబంధంవల్ల కల్గుతున్నది- అని అంటూ **"శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే"** (శ్రద్ధా- అనబడే లక్ష్మీదేవిచే భగవానుడు దేవత్వాన్ని పొందుతున్నాడు) ఇత్యాది వేదవాక్యాలు తెల్పుతున్నందున, వేదం అంతా లక్ష్మీదేవియొక్క వైభవాన్నే పల్కుతున్నాయి- అని గ్రహించడంలో ఏలోటు లేదుకదా! **"తిరువిల్లా త్తేవరై తేవరల్లారై త్తేతేల్ మిన్ తేవు"** (లక్ష్మీసహితులు కాని, పరదైవం కాని దేవతలను పరదైవంగా కొలువవద్దు) అని అంటూ భక్తిసారులు పల్కిన రీతిలో లక్ష్మీదేవియొక్క సంబంధం లేకుండా దేవుడు దేవత్వాన్ని పొందడం సాధ్యం కాదు కనుక, దేవుని గొప్పతనం చెప్పబడిన సందర్భాలనన్నిటినీ లక్ష్మీదేవి వైభవాన్ని తెల్పినవిగానే గ్రహించవచ్చుకదా!

నమ్మాళ్వార్ల తిరువాయ్‌మొళ్ళి ప్రబంధానికి తనియన్ పాశురాలను అనుగ్రహించిన పెద్దలు **"వాన్ తికళ్ళుమ్ శోలై మదిళ్ అరజ్గర్ వణ్పుకళ్ళ్‌మేల్ ఆన్ల తమిళ్ళ్ మతైకళ్ ఆయిరముమ్"** (ఆకాశం అంత ఎత్తుగా ఉండే తోటలతో చుట్టబడి ఉండే ప్రాకారాలను కల శ్రీరంగంలోని శ్రీరంగనాథుని కల్యాణగుణాలను గూర్చి పల్కిన వేయి ద్రావిడ పాశురాలు) అని అంటూ **"తెన్ తిరువరజ్గమ్"** అనే శ్రీరంగానికి తన నివాసంగా అనుగ్రహించిన శ్రీరంగనాథుని గొప్పతనాన్నే తిరువాయ్‌మొళ్ళిలోని వేయి పాశురాలన్నీ తెల్పుతున్నవని పలికారు. ఇది ఏవిధంగా పొసగుతుంది ? **"కబ్గులుమ్ పకలుమ్"** అనే ఏడవ శతకంలోని రెండవ దశకంలో తప్ప వేఱు ఏ పాశురంలోను శ్రీరంగనాథునిగూర్చిన ప్రస్తావమే కన్పించకుండా ఉండే తిరువాయ్‌మొళ్ళి అంతా శ్రీరంగనాథ వైభవప్రతిపాదకంగా ఏవిధంగా కాగలదు? – అని సందేహించేవారికి మన పూర్వాచార్యులు పలికే సమాధానమే ప్రస్తుతశ్లోకంలో కలిగే సందేహానికికూడా సమాధానం కాగలదు. సకలదివ్యదేశాల లోని అర్చామూర్తుల వైభవం శ్రీరంగనాథుని వైభవంలో అంతర్భవిస్తుంది– అనే పరమార్థంవలె, దేవాధిదేవుని అతిశయం అంతా దేవదేవ దివ్యమహిషియొక్క గొప్పతనంలో అంతర్భవిస్తుందనేది పరమార్థం ఇక్కడ కూడా లోటు లేదు కనుక, ఈవిధంగా పల్కడంలో కొఱత లేదు. శ్రుతికి (వేదానికి) **"భగవతీమ్"** అనే విశేషణాన్ని ప్రయోగించడం– అపౌరుషేయత్వ, నిత్యత్వ, నిర్దోషత్వాది ప్రయుక్తమైన పూజ్యతను పురస్కరించుకొని

**(ప్రథమే పుమాంసః)**– ఈ ప్రయోగం వేదార్థాలను విశదీకరించిన మహర్షులను, ఆళ్ళ్వార్లను, ఆచార్యులను తెల్పుతుంది. ఈ పూర్వులు శ్రుతిని శ్రీరంగనాయకి యొక్క కల్యాణగుణాలనే రత్నాలకు కోశాగారంగా పల్కుతున్నారు– అని అనడంద్వారా లక్ష్మీదేవియొక్క గుణాలు వేదాలలో సురక్షితంగా దర్శంచ డానికి సాధ్యమవుతున్నది – అని అంటున్నారని భావం. రత్నాలను ఏవిధంగా కోశగృహంలో దర్శించడానికి సాధ్యమో, ఆ రీతిలోనే శ్రీరంగనాయకియొక్క గుణాలను వేదాలలో దర్శించవచ్చు – అని తాత్పర్యం.

అయితే, శ్రుతులలో భగవద్గుణప్రతిపాదనం కన్పిస్తున్నదే తప్ప, లక్ష్మీగుణ ప్రతిపాదనం కన్పించడం లేదుకదా! – అని కొందరు భావించవచ్చునని తలచి, దానికి సమాధానాన్ని ఉత్తరార్ధంలో పల్కుతున్నారు.

**(తద్వారపాటనేత్యాది)** – కోశగృహంలో రత్నాలు ఉన్నాయి అంటే – వాకిటిలో పోగుపడి ఉండవుకదా! లోపల తలుపులు తెఱచిచూస్తే కదా, అవి కన్పిస్తాయి. అదే రీతిలో వేదాలనే పెట్టెను తెఱచి చూడాలి. ఇతిహాసపురాణాదులనే బీగపు చెవులను పురస్కరించుకొని తెఱచి చూచినట్లయితే, లక్ష్మీదేవియొక్క ప్రభావం వేదాలలో సులభంగా దర్శింవచ్చు– అని భావం. ఇతిహాస పురాణాలు అన్నీ లక్ష్మీదేవివల్లనే భగవానునకు అతిశయాన్ని కల్గినట్లు నిరూపణం చేస్తున్నందువల్ల, వేదాలలోను **"శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే"** (శ్రద్ధా అనబడే లక్ష్మిచే భగవానుడు దైవత్వాన్ని పొందుతున్నాడు) ఇత్యాది వాక్యాలలో అది స్పష్టంగా తెలుపబడినందువల్ల, వేదాలలో భగవానునకు అతిశయం చెప్పబడిన సందర్భాలలో అంతటా లక్ష్మీదేవియొక్క గొప్పతనం చెప్పబడినట్లు సిద్ధిస్తుంది కదా !

**(సేతిహాసేత్యాది)**– ఇతిహాసాలంటే– శ్రీరామాయణాదులు. సంతర్కణాలంటే, సమీచీనతర్కాలు. **"ఆర్షం ధర్మోపదేశం చ..... వేద నేతరః"** అని చెప్పబడినందున తర్కం కూడా తత్త్వనిర్ణాయకాలలో ఒకటి అవుతున్నది. **"తర్కాప్రతిష్ఠానాత్"** అని బ్రహ్మసూత్రకారులు తర్కాన్ని నిరసించడం – ప్రమాణానుకూలం కాని శుష్కతర్కాలనే. ఆ అర్థం స్ఫురించడంకోసమే ఇక్కడ **"సంతర్కణ"** అని అనబడింది. వేదార్థవిచార రూపమీమాంస కూడా సంతర్కణ శబ్దార్థం కావచ్చు. స్మృతులంటే– మన్వాది స్మృతులు. పురాణాలంటే – శ్రీవిష్ణుపురాణాదులు. వీటితోనే వేదార్థ నిర్ణయం చేయవలసిఉన్నందున, వీటిని **"తద్వారపాటనపటూని"** అని అనడం చాలా తగినది. లక్ష్మీతంత్రాదులను, ఆళ్వార్ల శ్రీసూక్తులను ఉద్దేశించి **"పురస్సరాణి"** (మొదలైనవి)– అని అనబడింది.

**"సేతిహాససంతర్కణ"** పదానికి **"స్మృతిపురాణ పురస్సర"** పదానికి కలిపి కర్మధారయసమాసం చేయాలి. **"స్నాతానులిప్తః"** అనే ప్రయోగంలోవలె విశేషణోభయపద కర్మధారయసమాసాన్ని చెప్పాలి. స్తుతికర్త, తమ ఈ స్తుతిగ్రంథానికి శ్రీగుణరత్నకోశమనే పేరు పెట్టారు కదా ! ఈ నామం వేదాలకు కూడా తగినది– అని శ్లోకంలోని రెండవ పాదంలో సూచింపబడింది. **"సేతిహాస పురస్సరాణి"** అని ప్రయోగించడం విశేషణమాత్రం కనుక **"ఉపబృంహణాని"** అనే విశేష్యపదం అధ్యాహరించుకోవాలి.

11) ఆహుర్వేదా నమానం కతిచన కతిచారాజకం విశ్వమేతత్
రాజన్వత్ కేచిదీశం గుణినమపి గుణై స్తం దరిద్రాణమన్యే ।
భిక్షావన్యే సురాజమ్భవమితి చ జడాస్తే తలాతల్యకార్షుః
యే తే శ్రీరఙ్గహర్మ్యాఙ్గణ కనకలతే! న క్షణం లక్ష్యమాసన్ ॥

శ్రీరంగహర్మ్య + అంగణ కనకలతే = శ్రీరంగ విమానం ముంగిటిలోని బంగారు తీగవంటిదానా!, యే=ఎవరు, తే = నీకు (కటాక్షానికి), క్షణం = క్షణకాలం అయినా, లక్ష్యం = లక్ష్యంగా, న+ఆసన్ = కాలేదో, తే జడాః = ఆ బుద్ధిహీనులైన, కతిచన = కొంతమంది, వేదాన్ = వేదాలను, అమానం = అప్రమాణాలుగా, ఆహుః = పలికారు, కతిచ = మఱి కొంతమంది, ఏతత్ = ఈ, విశ్వం = జగత్తును, అరాజకం = రాజును లేనిది - అని (అన్నారు), కేచిత్ = ఇంకొందరు, రాజన్వత్= గొప్ప రాజును కల్గినది (అని అన్నారు), అన్యే = ఇంకా మఱి కొందరు, తం = ఆ గొప్ప ప్రభువు, ఈశమ్ = నియామకుడు, గుణినమ్ అపి = కల్యాణగుణాలను కలవాడు అయినా, దరిద్రాణం = గుణదరిద్రుడని అన్నారు, అన్యే = మిగిలినవారు, భిక్షౌ = చిప్పమెత్తేవానిలో (శివునిలో), సురాజంభవం= గొప్ప ఈశ్వరత్వాన్ని పలికారు, ఇతి చ = ఈ విధంగా, తలాతలి = చేతులతో భూమిపై చరుస్తూ చేసే వాద యుద్ధాన్ని, అకార్షుః = చేశారు.

వ్యాఖ్యానమ్ :- గడచిన శ్లోకంలో ప్రమాణ ప్రస్తావం చేయబడినందున, ఆ ప్రమాణాలనబడే దీపంలో శలభాలు పడే పాట్లవంటి పాట్లను పొంది అనర్థాన్ని పొందేవారినిగూర్చి ప్రస్తావించి, వీరు శ్రీరంగనాయకియొక్క దివ్య కటాక్షానికి క్షణకాలం అయినా లక్ష్యభూతులు కానందువల్లనే ఈ విధమైన అపార్థాలను పల్కి అనర్థాన్ని పొందుతున్నారు- అని అంటున్నారు. బాహ్యమత వాదులు వేదబాహ్యులని, కుదృష్టులని రెండు విధాలు. వేదాలను ప్రమాణంగా అంగీకరించ కుండా తిరస్కరించినవారు - బాహ్యులు. వేదాలను ప్రమాణమని అంగీకరించినా, వాటిలో అపార్థాలను పలికేవారు - కుదృష్టులు. **"ఆహుర్వేదాన్ అమానమ్ కతిచన"** (కొందఱు వేదాలు ప్రమాణం కావని అంటారు) అని అన్నందువల్లనే వేదబాహ్యులను తెల్పినట్లయినది. కొందఱు వేదాలను అప్రమాణమని అన్నారు- అని భావం. సుగత - చార్వాకాదులు ఇక్కడ వివక్షితులు. వీరు. తరువాత చెప్పబడబోయేవారు అవ్యపదేశ్యులు కనుక (పేరుతో నిర్దేశించదగనివారు కనుక) కొందఱు, కొందఱు **(కతిచన)** అనే నిర్దేశింపబడుతున్నారు.

**(కతిచన అరాజకమ్ విశ్వమేతత్)**– దీనితో కపిలుర వాదాన్ని అనువదిస్తున్నారు. ఈ జగత్తు అనాథమని వారంటారు. ప్రకృతి పురుషులకంటే వేఱయిన ఈశ్వరుని సద్భావాన్ని వారు అంగీకరించరు. తత్త్వత్రయగ్రంథంలో ఈశ్వర ప్రకరణంలో **"కాపిలర్– ప్రధానమ్ కారణమెన్నార్కళ్. ప్రధానమ్ అనేక మాకైయాలుమ్, ఈశ్వరన్ అధిష్ఠియాదపోదు పరిణమిక్క మాట్టామైయాలుమ్ సృష్టిసంహారవ్యవస్థై కూడామైయాలుమ్ అదువుమ్ శేరాదు"** (సాంఖ్యులు–ప్రకృతి జగత్కారణమని అన్నారు. ప్రకృతి అనేక రూపాలు కల్గినది కనుక, ఈశ్వరుడు దానిని అధిష్ఠించకపోతే పరిణమించదు కనుక, అపుడు సృష్టిసంహారవ్యవస్థ కుదరదు కనుక, అది కూడా పొసగదు.) అని పల్కడం, అక్కడ శ్రీవరవరమునుల వ్యాఖ్యానం ప్రకృతంలో అనుసంధేయం.

**(రాజన్వత్ కేచిదీశమ్)– "విశ్వమ్, ఆహుః"** అనే రెండు పదాలను ఇక్కడ అనుషంగం చేసికోవాలి. (తెచ్చి అన్వయించుకోవాలి) కాణాదమతాన్ని ప్రస్తావించిన రీతి ఇది. వారు శాస్త్రరూపప్రమాణంతో ఈశ్వరుని అంగీకరించకుండా అనుమాన బలంతో అంగీకరిస్తున్నారు, అంతే. ఆనుమానికేశ్వరునకు నిమిత్తకారణత్వమాత్రాన్నే అంగీకరిస్తున్నారు కనుక, వీరు కూడా యథార్థమైన జ్ఞానాన్ని కలవారు కారు.

**(అన్యే ఈశమ్ తం గుణినమ్ అపి గుణైః దరిద్రాణమ్ ఆహు)**– ఇది మాయావాదిమతం. సమస్తకల్యాణ గుణాత్మకుడైన సర్వేశ్వరుని గుణదరిద్రుడని వీరు అంటారు. **"పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే"** (ఈ భగవానుని శక్తి అనేక విధాలైనది, గొప్పది అని వినబడుతున్నది.), **"య స్సర్వజ్ఞ స్సర్వవిత్"** (అన్నిటిని తెలిసినవాడు, అన్నిటినీ పొందేవాడు), **"సత్యకామ స్సత్యసంకల్పః"** (సత్యకాముడు, సత్యసంకల్పుడు), ఇత్యాది బహుప్రమాణసిద్ధానంతకల్యాణగుణైకతానత్వాన్ని కల్గినవాడైన సర్వేశ్వరుని గుణశూన్యుడని అంటున్నారే ! అయ్యో ! నిర్గుణత్వాన్ని తెలిపే శ్రుతులు హేయగుణాభావాన్ని తెల్పుతున్నాయి– అని నిష్కరించలేనందువల్ల ఈవిధంగా పల్కుతున్నారు.

**(అన్యే భిక్షా సురాజంభవమ్)– "ఆహుః"** అనే క్రియను ఇక్కడకూడా అనుషంగం చేసికోవాలి. శైవులు ఈశ్వరసద్భావాన్ని అంగీకరించినా, ఆ ఈశ్వరత్వాన్ని **"వెన్దారెన్బుమ్ శుడు నీఱుమ్ మెయ్యిల్ పూశి క్కైయకత్తు ఓర్ శన్దార్**

**తలైకొణ్డు ఉలకేల్లామ్ తిరియుమ్ పెరియోన్"** (ఒంటికి భస్మాన్ని పూసికొని, చేతిలో కపాలాన్ని ధరించి తిరిగే మహనీయుడైన శివుని) విషయంలో ఈశ్వరత్వాన్ని ఆరోపించి పల్కుతున్నారు. స్వరక్షణలో స్వయంగా అశక్తుడైన వానిని ఈశ్వరుడని పల్కడం చాలా పరిహాస్యమని తెలుపడం కోసం **"భిక్షా"** అని ప్రయోగింపబడింది.

**(ఇతి చ జడా స్తే తలాతలి అకార్షుః)** - ఈ విధంగా అవ్యపదేశ్యుల మతాలు ఇంకా చాలా ఉన్నందున **"ఇతి"** అని అంటూ దిక్ప్రదర్శనం చేశారు. వీరు అందఱు **"కరువిలే తిరువిలాద"** (గర్భదరిద్రులు), మూర్ఖులు కనుక **"జడాః"** అని అంటున్నారు.

**(తలాతలి అకార్షుః)**- భూమిని చేతితో కొడుతూ వాదయుద్ధాన్ని చేయడం **"తలాతలి"** అనబడుతుంది. **"కేశాకేశి, దండాదండి"** ఇత్యాది ప్రయోగాలనువలె **"తలాతలి"** అనే ప్రయోగాన్ని కూడా గ్రహించాలి. యుద్ధాన్ని చేసే రీతిలోనే, వాదయుద్ధాన్ని చేసేవారు చేతిని భూమిపై తడుతూ వాదించడం సహజం. ఈ విధంగా వాదించేవారి వాదాలు అన్నీ లక్ష్మీకటాక్షలక్ష్యత్వాభావనిబంధనాలు- లక్ష్మీకటాక్షానికి లక్ష్యం కాకపోవడం- అనేదానిని కారణంగా కల్గినవి- అనే విషయాన్ని నాల్గవ పాదం తెల్పుతున్నది.

**"హే శ్రీరంగహర్మ్యాంగణకనకలతే ! యే తే క్షణం లక్ష్యమ్ నాసన్, తే ఏవమ్ అకార్షుః"** - అని సమన్వయించాలి. శ్రీరంగవిమానం ముంగిటిలో అల్లుకొన్న కనకలతయా ఇది! అని భావించేటట్లుగా ప్రకాశించే ఓ శ్రీరంగనాయకీ! నీకు క్షణకాలం అయినా లక్ష్యభూతులు కాలేనివారెవరో, వారే ఇటువంటి దుర్వాదాలను చేసేవారు అయ్యారు- అని పల్కినట్లయినది. మూడవ పాదంలో ఉండే **"తే"** అనే పదం తచ్ఛబ్దంయొక్క (పుంలింగ) బహువచనం. నాల్గవ పాదంలోని **"తే"** అనే పదం యుష్మచ్ఛబ్దంయొక్క షష్ఠీవిభక్తి ఏకవచనాంతరూపం.

**12)** **మనసి విలసితాక్షా భక్తిసిద్ధాఞ్జనేన**
**శ్రుతిశిరసి నిగూఢం లక్ష్మి! తే వీక్షమాణాః ।**
**నిధిమివ మహిమానం భుఞ్జతే యేఽపి ధన్యాః**
**నను భగవతి! దైవీం సంపదం తేఽభిజాతాః ॥**

భగవతి = పూజ్యులారా!, (షాడ్గుణ్యపూర్ణురాలా!), లక్ష్మి = లక్ష్మీస్వరూపిణివి అయిన శ్రీరంగనాయకీ!, యే అపి = ఎవరు అయితే, భక్తిసిద్ధాంజనేన = సిద్ధాంజనం వంటి భక్తితో కూడినది, మనసి = (అందువల్లనే) మనస్సులో, విలసతా= ప్రకాశించే, అక్ష్ణా= జ్ఞాననేత్రంతో, శ్రుతిశిరసి = వేదాంతాలలో, నిగూఢం = బాగా గుప్తంగా ఉంచబడిన, తే = నీయొక్క, మహిమానం = మహిమను, నిధిమ్ ఇవ= (భూమిలో గుప్తంగా దాచబడిన) నిధినివలె, వీక్షమాణాః = దర్శించేవారై, భుంజతే = అనుభవిస్తున్నారో, తే = వారు, దైవీం = దివ్యమైన, సంపదమ్ అభి= సంపదను అనుభవించడం కోసం, జాతాః నను = పెట్టి పుట్టారు కదా!

**వ్యాఖ్యానమ్ :-** లక్ష్మీకటాక్షానికి లక్ష్యభూతులు కానివారు దుర్వాదాలను చేసేవారై, నశించిపోతున్నారు- అని గడచిన శ్లోకంలో అనుగ్రహించి, అటువంటివారు కాని భాగ్యశాలురు నిధిని పొంది ఉజ్జీవిస్తున్నారు- అని ఈ శ్లోకంతో పల్కుతున్నారు.

**(భగవతి! నను లక్ష్మి!)**- సకలకల్యాణగుణ సంపదను కల శ్రీరంగనాయకీ!,

**(యేఽపి ధన్యాః)** - ఏ కొందఱు భాగ్యవంతులు,

**(భక్తిసిద్ధాంజనేన)**- భక్తి అనే సిద్ధాంజనాన్ని కల్గినవారై,

**(మనసి విలసతా అక్ష్ణా)**- మనస్సు లోపల ప్రకాశించే జ్ఞాననేత్రంతో,

**(శ్రుతిశిరసి)**- నిధి ఏవిధంగా భూమిలోపల అక్కడక్కడ మఱుగుపడి ఉంటుందో, ఆ రీతిలోనే శ్రీరంగనాయకి యొక్క వైభవం కూడా వేదాంతాలలో అక్కడక్కడ మఱుగుపడి ఉన్నది. **"నిధి"** అనేది అందఱికీ సులభంగా లభించదు. **"ఉపర్యుపరి సంచరతామ్ అదృశ్యమ్"** (పైపైన సంచరించేవారికి గోచరించనిది) (వరదరాజపంచాశత్) అని శ్రీదేశికులు పల్కినట్లుగా, పైపైన సంచరించేవారికి నిధిని దర్శించడం సాధ్యంగా ఉండదు, అటువంటి నిధిని కూడా చూడడానికి ఒక ఉపాయం ఉన్నది. నిధిని దర్శింపజేసే సిద్ధాంజనం అనేది ఒకటి ఉన్నది. దానిని కంటిలో అలంకరించుకొని చూచేవారికి మూలమూలలో దాగి ఉండే నిధిని దర్శించడం సులభం అవుతుంది. అటువంటి, వేదాంతాలలో మఱుగుపడి ఉండే శ్రీమహాలక్ష్మి వైభవం అనే నిధి కూడా భక్తి అనే సిద్ధాంజనంతో విభూషితమైన జ్ఞాననేత్రాన్ని కలవారికి దర్శించడానికి సులభమవుతుంది. ఆ రీతిలోనే

వేదాంతాలలో మఱుగుపడి ఉండే శ్రీమహాలక్ష్మి వైభవం - అనేదికూడా భక్తి అనే సిద్ధాంజనంతో విభూషితమైన ఆంతరనేత్రాన్ని కలవారికి దర్శించడం సులభమవుతుంది - అని తెలుపబడినట్లయినది. ఇందువల్ల వేదాంతాలలో భగవానుని వైభవం ఏవిధంగా స్పష్టంగా తెలుపబడు తున్నదో, ఆ విధంగానే శ్రీరంగనాయకి యొక్క వైభవంకూడా స్పష్టంగా తెలుపబడకపోయినా, భాగ్యాధిక్యాన్ని కల్గినవారు మాత్రమే అనుభవించదగిన నిధివలె నిగూఢంగా ఉంటుంది. ఆసురసంపదను జన్మతః కల్గినవారు కాకుండా, దైవీసంపత్తును పెట్టిపుట్టినవారు భక్తివశంవల్ల దానిని గ్రహించి తెలిసికొని, అనుభవించడానికి యోగ్యులు అవుతున్నారు- అని భావం.

**"భక్తిసిద్ధాంజనేన"** అనే ప్రయోగానికి **"భక్తిః సిద్ధాంజనమివ యస్య తత్, తేన"** అని బహువ్రీహి సమాసాన్ని చేసి, సిద్ధాంజనంవంటి భక్తిని కల్గినదైన- అనే అర్థాన్ని గ్రహించడం సరసం. బహువ్రీహిని గ్రహించకుండా "భక్తి అనే సిద్ధాంజనంతో" అనే అర్థాన్ని గ్రహించి (అంటే - స్వయం విశేష్యంగా గ్రహించి) దానిని **"విలసతా"** అనే దానితో అన్వయించేవారుకూడా ఉన్నారు. మనస్సులోపల భక్తిసిద్ధాంజనంతో వెలిగే జ్ఞాననేత్రంతో దర్శించేవారు - అని దీని భావం.

**(దైవీం సంపదం తే అభిజాతాః)- "దైవీ సంపద్విమోక్షాయ నిబంధాయ ఆసురీమతా"** (దైవీసంపదవల్ల మోక్షం లభిస్తుంది, ఆసురసంపదవల్ల సంసారం కల్గుతుంది) అని, **"మా శుచః సంపదం దైవీ మభిజాతోఽసి"** (అర్జునా! చింతించకు, నీవు దైవీసంపదను కలవాడవై జన్మించావు) అని ఉండే గీతాశ్లోకాలు ప్రకృతంలో అనుసంధేయాలు.

**13) అస్యేశానా జగత ఇతి తేఽధీమహే యాం సమృద్ధిం**
**శ్రీః! శ్రీసూక్తం బహుముఖయతే తాం చ శాఖానుశాఖమ్ ।**
**ఈష్టే కశ్చిజ్జగత ఇతి యః పౌరుషే సూక్త ఉక్తః**
**తం చ త్వత్కం పతిమధిజగా వుత్తర శ్చానువాకః ॥**

శ్రీః=శ్రీరంగనాయకీ, అస్య=ఈ, జగతః = జగత్తునకు, ఈశానా ఇతి=ఈశ్వరివి అని, యాం = ఏ, సమృద్ధిం = ఐశ్వర్యాన్ని, అధీమహే = అధ్యయనం చేస్తున్నామో, తాం చ = ఆ ఐశ్వర్యాన్ని, శ్రీసూక్తం = శ్రీసూక్తం, శాఖానుశాఖం = ప్రతి శాఖలోను,

బహుముఖయతే = అనేకవిధాలుగా వివరిస్తున్నది, పౌరుషే సూక్తే= పురుష సూక్తంలో, జగతః = లోకానికి, కశ్చిత్ = ఒకానొకడు, ఈష్టే = ఈశ్వరుడై ఉన్నాడు, ఇతి = అని, యః = ఎవడు (ఏ నారాయణుడు), ఉక్తః = చెప్పబడ్డాడో, తం చ = అతనిని కూడా, ఉత్తరః అనువాకః చ = అనంతరం ఉండే అనువాకం కూడా, త్వత్కం= నీకు (నారాయణుని) చెందిన, పతిం = భర్తనుగా, అధిజగౌ = పఠించింది.

**వ్యాఖ్యానమ్ :-** శ్రీరంగనాయకియొక్క వైభవప్రతిపాదనంలో శ్రీసూక్తం ఇదంపరంగా ప్రవృత్తమైనది- అని, పురుషసూక్తాదులు కూడా తద్వైభవప్రతి పాదనంలో విశ్రాంత మవుతున్నవి- అని ఇందులో పల్కుతున్నారు. **"అస్యేశానా జగతః"** అనే ప్రయోగం శ్రుతియొక్క అనువాదరూపమే.

**(హే శ్రీః! తే యాం సమృద్ధిమ్ అస్యేశానా జగత ఇతి అధీమహే)**- ఓ శ్రీరంగనాయకీ! **"అస్యేశానా జగతో విష్ణుపత్నీ"** (ఈ జగత్తును శాసించేది, విష్ణువుకు పత్ని) అనే వేదవాక్యంతో నీ ఏ అతిశయాన్ని అధ్యయనం చేస్తున్నామో,

**(తాం సమృద్ధిమ్ శాఖానుశాఖం శ్రీసూక్తం బహుముఖయతే)**- శాఖలన్నిటిలోను ఉండే శ్రీసూక్తం ఆ అతిశయాన్ని బహుముఖంగా విశదీకరిస్తున్నది.

**(పౌరుషే సూక్తే)**- పురుషసూక్తంలో,

**(జగతః కశ్చిత్ ఈష్టే ఇతి యః ఉక్తః)**- జగత్తుకు అంతటికీ ఒకడే ఈశ్వరుడై ఉన్నాడు- అని ఏ పరమపురుషుడు తెలుపబడుతున్నాడో,

**(తమ్)**- ఆ శ్రీమన్నారాయణుని,

**(ఉత్తరః అనువాకః)**- నారాయణానువాకం,

**(త్వత్కం పతిమ్ అధిజగౌ)** - నీ భర్తగా తెలిపింది. తైత్తిరీయసంహితలోని నాల్గవ కాండంలో నాల్గవ ప్రశ్న చివరలో **"అస్యేశానా జగతో విష్ణుపత్నీ"** అనే వాక్యంతో శ్రీరంగనాయకియొక్క అద్వితీయాతిశయం-అంటే-సకల జగదీశ్వరీత్వ రూపమైన గొప్పతనం- అనుసంధింపబడుతున్నది. ఆ గొప్పతనాన్ని **"హిరణ్యవర్ణాం హరిణీమ్"** అని ప్రారంభమవుతున్న శ్రీసూక్తంతో- నారాయణునకు కలిగే గొప్పతనం కూడా నీవు అతనికి దివ్యమహిషివిగా ఉన్నందువలననే-అని నారాయణానువాకం తెల్పుతున్నది- అని భావం. రెండవ పాదం ఆరంభంలో

ఉండే "శ్రీః" అనే పదం సంబోధన (ఈ పురుష సూక్తం అన్ని వేధాలలో పఠింపబడు తున్నది).

**(శాఖానుశాఖమ్)- "ఇదం హి పౌరుషం సూక్తం సర్వవేదేషు పఠ్యతే"** (అన్ని వేదాలలోను పురుషసూక్తం పఠింపబడుతున్నదని చెప్పబడుతున్నది) అని కూరత్తాళ్వాన్ కూడా శ్రీవైకుంఠస్తవంలో **"సర్వశ్రుతిష్వనుగతమ్.... సూక్తమ్ తు పౌరుషమ్"** (అన్ని వేదాలలో ఉన్నది... పురుషసూక్తం) అని అన్నారు. ఈ పురుషసూక్తంవలెనే శ్రీసూక్తం కూడా తైత్తిరీయశాఖలోని మంత్రం మాత్రమే కాకుండా మాధ్యందినాది సకలశాఖలలోను పఠింపబడుతున్నదనే విషయం **"శాఖానుశాఖమ్"** అని అనడంద్వారా తెలుపబడింది.

**(ఈష్టే కశ్చిజ్జగత ఇతి యః పౌరుషే సూక్త ఉక్తః)- "ఈష్టే కశ్చిజ్జగతః"** అనే ఈ ఆనుపూర్వితో కూడిన వాక్యం పురుషసూక్తంలో కన్పించనందువల్ల ఇది శబ్దానువాదం కాదు, అర్థానువాదమని గ్రహించాలి. **"పురుష ఏవేదం సర్వమ్, యత్ భూతం యచ్చ భవ్యమ్, ఉతామృతత్త్వస్యేశానః"** (కన్పించేది, ఇంతకుముందు ఉన్నది, ఇకపై ఉండబోయేది అయిన ఈ జగత్తుకు ప్రభువు - పురుషశబ్దవాచ్యుడైన నారాయణుడే. అతడే మోక్షానికి అధిపతి) ఇత్యాది వాక్యాలలో అర్థానువాదాన్ని గమనించవచ్చు.

**(ఉత్తర శ్చానువాకః)- "అద్భ్యః సంభూతః"** అని ప్రారంభమవుతున్న అనువాకం ఉత్తరానువాకమనబడుతున్నది. ఇందులో **"హ్రీశ్చ తే లక్ష్మీశ్చ పత్న్యౌ"** (భూదేవి, లక్ష్మీదేవి - నీ పత్నులు) అనే వాక్యం ఇక్కడ వివక్షితం.

**14) ఉద్బాహుస్త్వా ముపనిషదసా వాహ నైకా నియన్త్రీం**
**శ్రీమద్రామాయణమపి పరం ప్రాణితి త్వచ్చరిత్రే ।**
**స్మర్తారోఽస్మజ్జనని! యతమే సేతిహాసైః పురాణైః**
**నిన్యుర్వేదా నపి చ తతమే త్వన్మహిమ్ని ప్రమాణమ్ ॥**

అస్మజ్జనని = మాకు తల్లివి అయిన శ్రీరంగనాయకీ!, అసౌ = ఈ, ఉపనిషత్ ఏకా = (శ్రీసూక్తం) అనే ఉపనిషత్ ఒక్కటి మాత్రమే, ఉద్బాహుః = చేతిని పైకెత్తి, త్వాం = నిన్ను, నియంత్రీం = ఈశ్వరిగా, న ఆహ = చెప్ప లేదు, శ్రీమత్ రామాయణమ్ అపి = శ్రీమద్రామాయణంకూడా, త్వచ్చరిత్రే = నీ చరిత్ర విషయంలో, పరం ప్రాణితి=

మిక్కిలిగా జీవిస్తున్నది, యతమే = ఎవరు, స్మర్తారః= స్మృతికర్తలో, తతమే అపి చ = వారుకూడా, వేదాన్ = వేదాలను, స+ఇతిహాసైః = ఇతిహాసాలతో కూడుకొన్న, పురాణైః= పురాణాలతో, త్వత్ + మహిమ్ని = నీ వైభవంలో, ప్రమాణం = ప్రమాణంగా, నిన్యుః = పొందించారు (నిరూపించారు).

**వ్యాఖ్యానమ్ :-** పూర్వం పల్కిన ఉపనిషన్మంత్రమే కాక, ఇతిహాస పురాణాదులు కూడా లక్ష్మీదేవియొక్క వైభవప్రతిపాదనంలో ఉపక్షీణాలు అవుతున్నాయి – అని ఇందులో అంటున్నారు.

**(అస్మజ్జనని!)** మాకు తల్లి అయిన శ్రీరంగనాయకీ!,

**(అసౌ ఉపనిషత్ ఏకా ఉద్బాహు స్సతీ త్వాం నియంత్రీం నాహ)**– ముందు శ్లోకంలో పల్కిన రీతిలోనే ఉపనిషత్తు మాత్రమే చేతులను పైకెత్తి నీ ఐశ్వర్యాన్ని తెలుపడం లేదు. మఱి ఇంక ఏమి? అని అంటే,

**(శ్రీమద్రామాయణ మపి త్వచ్చరిత్రే పరం ప్రాణీతి)**– శ్రీ రామాయణం కూడా నీ మహిమను వర్ణించడంలో తాను ప్రాణాలను నిలుపుకొన్నది.

**(స్మర్తారః యతమే)**– స్మృతికర్తలు అనే ఏ పరాశరాది మహర్షులున్నారో,

**(తతమేఽపి చ)** – వారుకూడా,

**(సేతిహాసైః పురాణైః)**– ఇతిహాసాలతో కూడిన పురాణాలతో– అని భావం.

**(వేదాన్ త్వన్మహిమ్ని ప్రమాణం నిన్యుః)**– వేదాలను నీ వైభవంలో ప్రమాణాలుగా గ్రహించారు. "**ప్రమాణం నిన్యుః**" అనే ప్రయోగాన్ని "**ప్రమాణతాం నిన్యుః**" అనే అర్థాన్ని ఇస్తున్నందువల్ల, దీనిని భావప్రధాన నిర్దేశంగా గ్రహించాలి. ఇది ద్వికర్మక ప్రయోగం. "**సత్యం సత్యం పునస్సత్య ముద్ధృత్య భుజముచ్యతే**" (నిజం, నిజం, ముమ్మాటికి నిజం. చేతులను పైకెత్తి ప్రమాణం చేయబడుతున్నది.) అనే ప్రమాణ వచనాన్ని అనుసరించి "**ఉద్బాహుః**" అని అనబడింది. "**అసౌ ఉపనిషత్**" అని అనడం – పూర్వశ్లోకంలోని "**ఉత్తరశ్చానువాకః**" అనే ప్రయోగాన్ని స్మరింపజేస్తుంది.

**(శ్రీమద్రామాయణమపీత్యాది)**– ఇతిహాసశ్రేష్ఠమైన శ్రీరామాయణం ద్వారా "**శిఱైయిరున్దవళే*ఱ్ఱ*మ్ శొల్లుకిఱదు**" (చెఱలో ఉన్న సీతాదేవి గొప్పతనం

చెప్పబడుతున్నది) అనే శ్రీవచనభూషణ దివ్యసూక్తి ఇక్కడ అనుసంధేయం. **"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్"** (శ్రీరామాయణ కావ్యం అంతా సీతాదేవియొక్క గొప్ప చరిత్ర) అని అంటూ వాల్మీకి భగవానుడు నోరార పల్కినందువల్ల ఈ విధంగా నిశ్చయించి పల్కడంలో లోటు లేదు. **"కరుణా కాకుత్థ్సః"** అని కీర్తింపబడే శ్రీరాముడు కరుణామూర్తి అయినా, సీతాదేవియొక్క సాహచర్యం వల్లనే ఆ భగవానుని కారుణ్యం తల ఎత్తి కార్యకరమయినది- అని, అతనితో చేరి ఉండని సమయంలో అతని కారుణ్యం జీవించడంలేదని అన్వయవ్యతిరేకాల ద్వారా నిరూపించడానికి సాధ్యమైనందున, శ్రీరామాయణం అంతా మహాలక్ష్మియొక్క వైభవప్రతిపాదనంలో విశ్రాంత మవుతున్నదని అనడం పొందికను కల్గినది. **"ప్రాణితి"** అనే క్రియ ద్వారా శ్రీరామాయణానికి సీతాచరిత్ర ప్రతిపాదనమే జీవనాడి- అనే విషయం స్ఫురిస్తున్నది.

శ్లోకం ఉత్తరార్ధంలో **"యతమే"** అనే పదానికి **"యే"** (ఎవరు) అని అర్థం. వేదోపబృంహణం కోసం ప్రవర్తించిన పరాశరాది మహర్షులు కూడా నీ వైభవాన్ని తెలియజేస్తూ, వేదార్థాలను వివరిస్తున్నవారయ్యారు- అని తెలుపబడింది.

**15) ఆకుగ్రామనియామకాదపి విభోరాసర్వనిర్వాహకాత్**
**ఐశ్వర్యం యదిహోత్తరోత్తరగుణం శ్రీరఙ్గభర్తుః ప్రియే! ।**
**తుఙ్గం మఙ్గళ ముజ్జ్వలం గరిమవత్పుణ్యం పునః పావనం**
**ధన్యం యత్తదదశ్చ వీక్షణభువ స్తే పఙ్చషా విప్రుషః ॥**

శ్రీరంగభర్తుః ప్రియే = శ్రీరంగనాథునకు ఇష్టురాలవైన ఓ శ్రీరంగనాయకీ!, ఆకుగ్రామనియామకాత్ = చిన్నగ్రామాన్ని పాలించేవానిని మొదలు, సర్వనిర్వాహకాత్ = సమస్తాన్ని నిర్వహించే, ఆవిభోః = అపి = ప్రభువైన బ్రహ్మదేవునివరకు, ఇహ= ఈ లోకంలో, ఉత్తర + ఉత్తరగుణం = ఇంకా ఇంకా వృద్ధి చెందే, యత్ =ఏ, ఐశ్వర్యం = ఐశ్వర్యం ఉన్నదో, తుంగం = (మేరువు మొదలైన) గొప్ప వస్తువులు, మంగళం = (పూలు, చందనం మొదలైన) మంగళద్రవ్యాలు, ఉజ్జ్వలం = (రత్నాలు మొదలైన) గొప్పగా ప్రకాశించే వస్తువులు, గరిమవత్ = (హిమాలయం మొదలైన) బరువైన వస్తువులు, పుణ్యం = (యాగాలవల్ల కలిగే) ధర్మం, పునః = అంతేకాక, పావనం = (కావేరి మొదలైన) పవిత్రతను కల్గించే వస్తువులు, ధన్యం = భాగ్యాన్ని కల్గిన వస్తువులు-

అనే, యత్ = ఏ, ఐశ్వర్యం = (లోకంలోని) సంపద ఉన్నదో, తత్ = ఆ ఐశ్వర్యం, అదశ్చ= **"తుంగమ్"** ఇత్యాదిగా తెలుపబడిన ఐశ్వర్యం, తే = నీయొక్క, వీక్షణ భువః= కటాక్షాలవల్ల పుట్టే, పంచషాః = ఐదారు, విప్రుషః = బిందువులు (కణాలవల్ల కలిగేది మాత్రమే).

**వ్యాఖ్యానమ్ :- "మానాధీనా మేయసిద్ధిః"** కనుక, శ్రీరంగనాయకియొక్క వైభవమనే ప్రమేయానికి ఇవి ఇవి ప్రమాణాలు – అని పూర్వమే తెలియజేశారు. ఇక, ప్రమాణప్రతిపన్నమైన శ్రీరంగనాయకియొక్క ఐశ్వర్యాన్ని తెలియజేస్తున్నారు.

**(శ్రీరంగభర్తుః ప్రియే!)**– శ్రీరంగనాథునకు దివ్యమహిషివి అయిన ఓ శ్రీరంగనాయకీ !,

**(ఆకుగ్రామనియామకాత్ సర్వనిర్వాహకాత్ ఆవిభోరపి)**–చిన్నదైన గ్రామానికి ప్రభువునుండి సర్వలోకనిర్వాహకుడైన బ్రహ్మపర్యంతంగా,

**(ఉత్తరోత్తరగుణం యత్ ఐశ్వర్యమస్తి)**– ఉత్తరోత్తరం వృద్ధి అవుతూ పోయే అతిశయాన్ని కల్గిన ఏ ఐశ్వర్యం ఉన్నదో, అది,

**(తుంగమ్)**– మేరువు మొదలైన పర్వతరూపాలలో ఉన్నతంగా ఉండే వస్తుసమూహం,

**(మంగళమ్)**– చందనకుసుమహరిద్రా (పసుపు) కుంకుమాది మంగళకరాలై ఉండే వస్తుసమూహంకూడా,

**(గరిమవత్)**– హిమవత్పర్వతం, మందరం, మైనాకం మొదలైన పర్వతాల రూపంలో గురుత్వాన్ని కల్గిన వస్తుసమూహం,

**(పుణ్యమ్)**–యజ్ఞయాగాదుల రూపంలోని పరలోకసాధనమైన సుకృతరాశి,

**(పునః)**– ఇంతేకాక,

**(పావనమ్)** – గంగా, యమునా, సరస్వతీ, కావేరి – మొదలైన పరిశుద్ధిని కల్గించే నదులు.

**(ధన్యమ్)**– నవనిధులరూపంలోని భాగ్యఫలభూత వస్తుసమూహం–అనే,

**(యత్ అస్తి)**– ఏది ఉన్నదో,

**(తత అతచ్చ)**– ఈ విధమైన ఉన్నతాలైన వస్తువులు అన్నీ,

**(తే వీక్షణభువః పంచషాః విప్రుషః)**– నీ కటాక్షకందళితాలైన అయిదారు చిన్న చిన్న కణాలు మాత్రమే. లోకంలో "మంచిది" అని గొప్పగా చెప్పబడే సకల వస్తువులు లక్ష్మీకటాక్షలేశంవల్లనే గొప్పతనాన్ని పొంది, ప్రకాశిస్తున్నాయి– అని తెలుపబడింది.

లోకంలో గొప్పగా కీర్తింపబడే ఏ వస్తువు అయినా, ఒకే పరిమితిలోని గొప్పతనాన్ని కల్గినది కాదు. ఒకనిని ఒక కుగ్రామానికి అధికారిగా చూస్తున్నాము. మఱి ఒకనిని మహానగరానికి అధ్యక్షునిగా చూస్తున్నాము. ఈ విధంగా ఒకరికంటే ఇంకొకరి గొప్పతనం అధికంగా కన్పిస్తున్నది. విద్య, అందం మొదలైనవానిలో దేనిని గమనించినా, ఇవి కూడా అందఱికి సమానంగా ఉండవు. అంతు లేని ఎక్కువ తక్కువదనాలు కన్పిస్తాయి. దీనిని ఉద్దేశించియే **"ఉత్తరోత్తరగుణమ్"**– అని అన్నారు. శ్రీస్తవంలోని **"ఐశ్వర్యం మహాదేవ వాఽల్ప మథవా"**, **"ఐశ్వర్యం యదశేషపుంసి"** అనీ అంటూ రెండు శ్లోకాలలోని అర్థాన్ని ఈ శ్లోకం సంగ్రహించి పల్కుతున్నది.

**16) ఏకో ముక్తాతపత్ర ప్రచలమణిఘణాత్కారిమౌళి ర్మనుష్యః**
**దృప్యద్దన్తావళస్థో న గణయతి నతాన్ యత్ క్షణం క్షోణిపాలాన్ ।**
**యత్తస్మై తిష్ఠతేఽన్యః కృపణ మశరణో దర్శయన్ దన్తపఙ్క్తీః**
**తత్తే శ్రీరఙ్గరాజప్రణయిని! నయనోదఞ్చితన్యఞ్చితాభ్యామ్॥**

శ్రీరంగరాజ ప్రణయిని = శ్రీరంగనాథుని ప్రియురాలవైన శ్రీరంగనాయకీ!, ఏకః = ఒక, మనుష్యః = మానవుడు, దృప్యత్ దంతావళస్థః = మదపుటేనుగుపై ఉండేవాడై, ముక్తాతపత్ర = ముత్యాల గొడుగులో, ప్రచల = మిక్కిలిగా చలించే, మణి= మణులు రాపిడివల్ల చేసే, ఘణాత్కారి = ఘణఘణమనే ధ్వనిని కల, మౌళిః = కిరీటాన్ని దాల్చినవాడై, నతాన్ = (తనకు) నమస్కరించిన, క్షోణిపాలాన్= సామంతరాజులను, క్షణం న గణయతి = ఒక్క క్షణకాలం అయినా లక్ష్యం చేయడం లేదు, (ఇతి) యత్ = (అనే విషయం) ఏది ఉన్నదో, తత్ = అది, అన్యః = ఇంకొక మనుష్యుడు, అశరణః = వేఱొక దిక్కు దేనినీ లేనివాడై, కృపణం = తన దైన్యం వ్యక్తమయే రీతిలో, తస్మై =

(పూర్వం తెల్పిన మదపుటేనుగుపై ఉండే చక్రవర్తి అయిన) అతనికి, దంతపంక్తీః = తన దంతాల వరుసను, దర్శయన్ = ప్రదర్శిస్తూ, తిష్ఠతే = (తన దైన్యాన్ని వ్యక్తం చేస్తూ) ఉన్నాడు, (ఇతి) యత్ = అనే విషయం ఏది ఉన్నదో, తత్ = ఆ విషయం - (ఈ రెండు), తే = నీయొక్క, నయన+ ఉదంచిత న్యంచితాభ్యాం = నేత్రాలను తెరచుకోవడంచేత, మూసికోవడం చేత కల్గుతున్నవి.

**వ్యాఖ్యానమ్ :-** లోకంలో ఒకడు ఐశ్వర్యంయొక్క పరమావధిలో ఉండడం, ఇంకొకడు దారిద్ర్యపరమావధిలో ఉండడం- అనేవి అన్నీ లక్ష్మీకటాక్షసద్భావంవల్ల, తదభావంవల్లనే -అని ఇందులో అంటున్నారు.

**(శ్రీరంగరాజ ప్రణయిని)**- ఓ శ్రీరంగనాయకీ !,

**(ఏకో మనుష్యః దృప్యద్దంతావళస్థః)**- ఒకడు మత్తగజంపై అధిరోహించి ఉండేవాడై,

**(ముక్తాతపత్రప్రచలమణిఘణాత్కారిమౌళిః)**- ముత్యాల బుట్టలో కదలాడే రత్నహారాలతో ఘణఘణమని ధ్వనించే కిరీటాన్ని కలవాడై,

**(నతాన్ క్షోణీపాలాన్)**- ఆ సమయంలో తనకు నమస్కరించిన ప్రభువులను,

**(క్షణం న గణయతి ఇతి యత్)**- ఒక్కక్షణం కూడా లెక్కించడం లేదు- అనే ఐశ్వర్యపరాకాష్ఠ అనేది ఏది ఉన్నదో, ఇదికూడా.

**(అన్యో మనుష్యః)**- వేరొక మనుష్యుడు,

**(కృపణం యథా తథా దంతపంక్తీ దర్శయన్)**- మిక్కిలి దైన్యం వ్యక్తమయే రీతిలో తన దంతాల వరుసను ప్రదర్శించేవాడై,

**(తస్మై తిష్ఠతే ఇతి యత్)**- పూర్వం ప్రస్తావించిన మదోన్మత్తునకు తన దైన్యాన్ని వ్యక్తం చేస్తూ నిలచి ఉన్నాడనే దారిద్ర్యపరాకాష్ఠ అనేది ఏది ఉన్నదో,అది,

**(తత్ తే నయనోదంచితన్యంచితాభ్యామ్)**- అది అంతా నీ కటాక్షవీక్షణం యొక్క విస్తృతివల్లనే, సంకోచంవల్లనే. ఐశ్వర్యపరాకాష్ఠకు హేతువు- నయనోదంచితం, దారిద్ర్య పరాకాష్ఠకు హేతువు - నయనన్యంచితం -అని క్రమేణ అన్వయించుకోవాలి.

**"కణ్డార్ వణఙ్గ క్కళియాన్మైమీదే కడల్ శూ్ళ్ ఉలకుక్కొరు కావలనాయ్ విణ్డోయ్ నెడువెణ్ కుడైనిళ్ళలిన్ కీళ్ విరినీరులకాణ్డు"** (చూచినవారు నమస్కరించేటట్లుగా మదపుటేనుగుపై సంచరిస్తూ సముద్రపరివేష్ఠితమైన భూమికి అద్వితీయ ప్రభువై, ఆకాశాన్ని తాకే విశాలశ్వేతచ్ఛత్రం కింద భూమిని పాలించి) అని తిరుమజ్జైయాళ్వార్ అనుగ్రహించిన రీతిలో ఒకడు మత్తగజంపై అధిరోహించి, ముత్యాలచ్ఛత్రం నీడ క్రింద వేంచేసి ఉండగా, సామంతులు వచ్చి తనను నమస్కరించినా, వారిని ఎంతమాత్రం కటాక్షించకుండా మదాంధుడై ఉండే ఐశ్వర్యగర్వాన్ని చూస్తున్నాము. ఆ స్థితిలో, వేరొకడు తన అకించన్య-అనన్యగతిత్వాలను ప్రదర్శిస్తూ, తన పళ్ళను చూపిస్తూ యాచకముద్రతో నిలచి ఉండే దారిద్ర్యసన్నివేశాన్ని చూస్తున్నాము. ఈ రెండు లక్ష్మీకటాక్షవీక్షావిస్తార సంకోచనిబంధనాలు- అని అంటున్నారు.

**"తస్మై తిష్ఠతే"** - అనే ప్రయోగంలో "ప్రకాశనస్థేయాఖ్యయోశ్చ" అనే పాణినిసూత్రంతో చతుర్థీవిభక్తి వచ్చింది. **"కోఽపి కృష్ణాయ తిష్ఠతే -ఆశ్రయం ప్రకాశయతీత్యర్థః"**. తన ఆశయాన్ని ప్రకటిస్తున్నాడని తాత్పర్యం. కూరేశులు కూడా వరదరాజస్తవంలో **"విశ్వస్మై త్వం కరిగిరిపుర స్సంతిష్ఠస ఇహ"**- అని ప్రయోగించారు. **"కణ్డార్ వణఙ్గ క్కళియాన్మైమీదే.. విణ్డోయ్ నెడువెణ్కుడై నిళ్ళలిన్ కీళ్"** (చూచేవారు నమస్కరించే రీతిలో మదపుటేనుగుపై ఆకాశాన్ని తాకే ఎత్తైన తెల్లని గొడుగు నీడలో) వేంచేసి ఉండేవాని సమక్షంలో తమ యాచకత్వాన్ని ప్రదర్శిస్తూ ఉన్నారు- అనే అర్థంలో **"తస్మై తిష్ఠతే"** అని ప్రయోగించినట్లుగా గ్రహించాలి. మూడవ పాదం చివర **"దన్తపంక్తిమ్"** అని ఏకవచనాతంగా కొందఱు పఠిస్తారు. **"దంతపంక్తీః"** అని ద్వివచనాంతమైన పాఠమే యుక్తం. కవివివక్షితపాఠంకూడా ఇదే.

లోకంలో, ఒకడు మహాధనికుడై ఉండడం, ఇంకొకడు అకించనుడై ఉండడం - వారి వారి కర్మలకు అనుగుణమని శాస్త్రాలలో చెప్పబడుతూ ఉండగా, ఇక్కడ **"తత్ తే నయనోదంచితన్యంచితాభ్యామ్"** అని అనడం ఏవిధంగా తగినది? **"నమః శ్రీరంగనాయక్యై యద్భ్రూవిభ్రమభేదతః, ఈశేశితవ్యవైషమ్య నిమ్నోన్నత మిదం జగత్"** (ఏ శ్రీరంగనాయకి కనుబొమల కదలికలలోని తేడాల వల్ల

పాలించేవాడు- పాలింపబడే వాడనే భేదంతో ఈ జగత్తు హెచ్చుతగ్గులుగా ఉన్నదో, ఆ శ్రీరంగనాయకికి నమస్కారం) అని వీరే శ్రీరంగరాజస్తవంలో పల్కడం కూడా ఏరీతిలో యుక్తం? అని సందేహపడవద్దు. లక్ష్మీకటాక్షంయొక్క ఉదంచిత - న్యంచితాలుకూడా తత్తత్కర్మానుగుణంగానే సంభవిస్తాయి.

**17) రతిర్మతి సరస్వతీ ధృతిసమృద్ధిసిద్ధిశ్రియః**
**సుధాసఖి! యతోముఖం చిచలిషేత్ తవ భ్రూలతా ।**
**తతోముఖ మథేన్దిరే! బహుముఖీ మహంపూర్వికాం**
**విగాహ్య చ వశంవదాః పరివహన్తి కూలఙ్కషాః ॥**

సుధాసఖి = అమృతానికి తోబుట్టువు అయిన, ఇందిరే = లక్ష్మీస్వరూపిణివి అయిన శ్రీరంగనాయకీ!, తవ = నీయొక్క, భ్రూలతా = లతలవంటి కనుబొమలు, యతోముఖం = ఎవనిని ఉద్దేశించి, చిచలిషేత్ = మిక్కిలిగా చలించగోరుతున్నదో (అనుకూలంగా చలిస్తున్నదో), తతోముఖం=అతనిని ఉద్దేశించి, రతిః=ప్రీతి,మతిః = జ్ఞానం, సరస్వతీ=విద్య, ధృతి=ధైర్యం, సమృద్ధి = సమృద్ధి, సిద్ధి= కార్యసిద్ధి, శ్రియః = ఐశ్వర్యం - అనే ఇవి, బహుముఖీం = అనేకవిధాలుగా, అహంపూర్వికాః = నేను ముందు నేను ముందు అనే రీతిలో, విగాహ్య = పొంది, వశంవదాః = అతనివశంలో ఉన్నవై, కూలంకషాశ్చ = కట్టలు తెంచుకొని పొంగి పొర్లుతున్నవై, అథ = పూర్ణంగా, పరివహంతి = ప్రవహిస్తున్నాయి.

**వ్యాఖ్యానమ్** :- లోకంలో వారివారికి సంభవించే సకలసంపదలు శ్రీమహాలక్ష్మియొక్క భ్రూభంగవిలాసాధీనాలు- అని ఇందులో అంటున్నారు. **"స శ్లాఘ్యః స గుణీ ధన్యః స కులీన స్స బుద్ధిమాన్, స శూర స్స చ విక్రాంతో యం త్వం దేవి! నిరీక్షసే"** (దేవీ! నీవు ఎవరిని కటాక్షిస్తావో, అతడే శ్లాఘించ దగినవాడు, అతడే గుణవంతుడు, ధన్యుడు, అతడే మంచివంశంలో పుట్టినవాడు, బుద్ధిమంతుడు, శూరుడు, విక్రమాన్ని కలవాడు.) అనే ప్రసిద్ధ శ్రీవిష్ణుపురాణ ప్రమాణాన్ని అనుసరించిన ఈ శ్లోకం దానిని విస్తృతిరూపంగా అవతరించింది- అని చెప్పవచ్చు. లోకం ఒకనిని పొగడడం, ఒకడు గుణవంతుడై ఉండడం, ధనికుడై ఉండడం, సత్కులంలో జన్మించడం, బుద్ధిలో గొప్పవాడై ఉండడం, శౌర్య వీర్యపరాక్రమశాలియై ఉండడం- ఇవి అన్నీ శ్రీరంగనాయకి యొక్క కటాక్షానికి అధీనాలు-అని పూర్వం పల్కిన (విష్ణుపురాణ) ప్రమాణవచనతాత్పర్యం. ఆ అర్థమే ఈ శ్లోకంలో వివరింపబడుతున్నది.

శ్రీరంగనాయకిని **"సుధాసఖి"** అని సంబోధిస్తున్నారు. అమృతంవలె పరమభోగ్యమైనదానా! - అని భావం. అమృతం పుట్టిన చోటినుండే లక్ష్మీదేవి కూడా అవతరించినందున, దానిని అనుసరించికూడా ఈవిధంగా చెప్పబడి ఉండవచ్చు. పెరియాళ్వార్లు లక్ష్మీదేవిని **"శీదైక్కడలుళ్ అముదు"** (చల్లని సముద్రంలోని అమృతం) అని శబ్దతః నిర్దేశించారు. దేవతలు పొందిన అమృతం బాహ్యామైన అమృతం. **"విణ్ణవర్ అముదుణ అదిల్ వరుమ్ పెణ్ణముదుణ్డ ఎమ్బెరుమానే !"** (దేవతలు అమృతం భుజించగా, అరుదైన లక్ష్మి అనే అమృతాన్ని పొందిన స్వామీ!) అనే రీతిలో భగవానుడు గ్రహించిన అమృతమైన లక్ష్మీదేవి ఆంతరమైన అమృతం. ఇటువంటి ఓ ఇందిరా! ఓ మహాలక్ష్మీ!

**(తవ భ్రూలతా యతోముఖం చిచలిషేత్)** - నీ భ్రూలత (కనుబొమలు) ఏవ్యక్తిని ఉద్దేశించి మిక్కిలిగా స్పందిస్తున్నాయో,

**(అథ తతోముఖమ్)** - వెంటనే, ఆ పురుషునిలో,

**(రతిర్మతిసరస్వతీధృతిసమృద్ధిసిద్ధిశ్రియః)** - ప్రీతి, జ్ఞానం, వాక్కు, ధైర్యం, పరిపూర్తి, సిద్ధి, సంపత్తు - అనే ఇవి అన్నీ,

**(బహుముఖీమ్ అహం పూర్వికాం విగాహ్య)**- బహువిధంగా అహమహమికతో (నేను ముందు, నేను ముందు - అని),

**(వశంవదా స్సత్యః)**- వశమై,

**(కూలంకషాః)**- అవధిని దాటి,

**(పరివహంతి)**- వారికే కాక, వారి వంశంలో తరతరాలుగా సమృద్ధిగా ఉప్పొంగి ప్రవహిస్తాయి.

ఈ శ్లోకంలో **"రతి"**- అని ప్రారంభించి ఏడు మంచి ఫలితాలు నిర్దేశింపబడ్డాయి. సకలవిధాలైన హితాలు వీటిలో అంతర్గతాలు. రతి అంటే- ప్రీతి. భగవద్భాగవతులను దర్శిస్తే వెన్నెల, మలయమారుతం, పుష్పం, చందనం మొదలైనవారిని చూచినప్పుడు వలె కలిగే ప్రీతి. మతి, సరస్వతులు ఏవి! - అంటే- **"తన్మే సమర్పయ మతిం చ సరస్వతీం చ త్వామంజసా స్తుతిపదైః యదహం ధినోమి"** (నిన్ను నేను వెంటనే స్తుతిపదాలతో సంతోషింపజేసే రీతిలో

బుద్ధిని, వాక్కును నాకు అనుగ్రహించు) (వరదరాజస్తవం) అని శ్రీదేశికులు ప్రార్థించిన రీతిలో ప్రాప్తవిషయంలో స్తుతిని చేయడానికి తగిన జ్ఞానం, వాక్కు. ధృతి అంటే- ధైర్యం, స్థైర్యమని కూడా చెప్పవచ్చు. మానసిక స్థైర్యం దీనిద్వారా తెలుపబడింది. సమృద్ధి అంటే- **"యువా స్యాత్ సాధు యువాఽధ్యాయకః"** అని అంటూ ఆరంభించి తైత్తిరీయోపనిషత్తులో చెప్పబడిన పూర్తి. సిద్ధి అంటే- కోరిన దానిని అన్నిటినీ పూర్తిగా పొందడం. **"శ్రీః"** అంటే- ఏమిటో చెప్పనక్కఱలేదు కదా. శ్రీస్తవంలో **"ఐశ్వర్యం యదశేషపుంసి యదిదమ్"** ఇత్యాది శ్లోకార్థం ఇక్కడ అనుసంధేయం.

**"తవ భ్రూలతా యతోముఖం చలేత్"** అని అనకుండా, **"చిచలిషేత్"** అని పల్కినందువల్ల లక్ష్మీకటాక్షం ప్రసరించడానికి ముందే ఈ హితాలన్నీ సమృద్ధిగా ప్రవహించడం ఆరంభిస్తాయని తెలుపబడింది. **"అహంపూర్వికా"** అంటే- నేను ముందు, నేను ముందు- అని. రతి, మతి. సరస్వతి మొదలైనవి ఒక్కొక్కటి మునుముందుగా బయలుదేరతాయి- అని భావం. **"కూలంకషాః పరివహంతి"** అంటే- పుత్రపౌత్రశిష్యప్రశిష్యపరంపరాపర్యంతం ఉప్పొంగి ప్రవహిస్తాయి- అని భావం.

**18) సహస్థిరపరిత్రస వ్రజవిరిఞ్చనాకిఞ్చనైః**
**అనోకహబృహస్పతి ప్రబలవిక్లబప్రక్రియమ్ ।**
**ఇదం సదసదాత్మనా నిఖిలమేవ నిమ్నోన్నతం**
**కటాక్షతదుపేక్షయో స్తవ హి లక్ష్మి! తత్తాణ్డవమ్ ॥**

లక్ష్మి = లక్ష్మీస్వరూపిణివి అయిన శ్రీరంగనాయకీ!, స్థిర పరిత్రస = స్థావరజంగమాల, వ్రజ = సముదాయం, విరించన = సర్వాధికుడైన బ్రహ్మదేవుడు, అకించనైః సహ = ఏమీ లేనివాడైన దరిద్రుడు - అనే వీరితోపాటు, అనోకహ = ఏజ్ఞానం లేని వృక్షం, బృహస్పతి = జ్ఞానులలో గొప్పవాడైన బృహస్పతి, ప్రబల = మిక్కిలి బలవంతుడు, విక్లబ = దుర్బలుడు - అనే వీరియొక్క ప్రక్రియం = ప్రకారాన్ని కల్గినది అయిన, ఇదం = ఈ జగత్తు, నిఖిలమ్ ఏవ = అంతా, సత్+అసత్+ ఆత్మనా= మంచి, చెడు - అనే రూపంతో, నిమ్న+ఉన్నతం = ఎత్తు పల్లాలుగా ఉండేది - అనే, యత్ = ఏవిషయం ఉన్నదో, తత్ =అది, తవ = నీ, కటాక్ష = కటాక్షాల యొక్క తత్+ఉపేక్షయోః = (ఆ

కటాక్షాల) ఉపేక్షయొక్క తాండవం హి = నాట్యం కదా! (నీ కటాక్షాల ప్రసరణంవల్ల, అవి ప్రసరింపకపోవడం వల్ల సంభవిస్తున్నాయి కదా)

**వ్యాఖ్యానమ్ :-** లోకంలో కన్పించే సకలపదార్థాలలో ఉండే నీచోచ్చభావం అంతా లక్ష్మీ కటాక్షసంకోచ వికాసాలకు అధీనమైనది- అని ఇందులో పల్కుతున్నారు.

**(స్థిరపరిత్రసవ్రజవిరించనాకించనై స్సహ)-** స్థిరమంటే-స్థావరాలు. పరిత్రప మంటే జంగమాలు. వ్రజం - సమూహం. వృక్షాలు, పర్వతాలు, మండపాలు మొదలైనవి స్థావరాలు. ఆ రీతిలో స్థిరంగా ఉండకుండా కదులుతూ మెదులుతూ ఉండే జంగమాలు. ఈవిధమైన భేదమే కాక,

**(విరించన- అకించనైః)** - అన్ని బ్రహ్మాండాలకు అధిపతి అయిన చతుర్ముఖునివలె మహాధనికుడై ఉండడం, ఒక్క కానీకూడా లేని అకించనుడై ఉండడం - అనే భేదం గోచరిస్తుంది కదా ! అంతమాత్రమే కాక,

**(అనోకహబృహస్పతి)-** **"కవైయాకి క్కొమ్బియాకి క్కాట్టకత్తే నిఱ్కుమవై యల్ల నల్ల మరఙ్గళ్, శవైనడువే నీట్టోలై వాశియానిన్ఱాన్ కుఱిప్పఱియమాట్టాదవనే మఱమ్"** (అరణ్యంలో శాఖోపశాఖలుగా వృద్ధి చెందేవి కావు. వృక్షాలు, సభలో పత్రాన్ని చదివేవాని భావాన్ని గ్రహించలేనివాడే నిజమైన వృక్షం) అనే రీతిలో చెట్టు అనదగిన అజ్ఞుడై ఉండడం, భూలోకబృహస్పతి అనే రీతిలో విద్వన్మణిగా ఉండడం- అనే భేదంకూడా కన్పిస్తున్నది. ఇంతమాత్రమేకాక,

**(ప్రబలవిక్లబప్రక్రియమ్)-** వీరులు, శూరులై ఉండడం, చాలా బలహీనుడై ఉండడం- అనే రీతిలో భేదాన్నికూడా చూస్తున్నాము. ఇటువంటి రీతులను కల్గినదైన,

**(ఇదమ్ నిఖిలమేవ)-** ఈ ప్రపంచం అంతా,

**(సదసదాత్మనా నిమ్నోన్నతమ్)-** మంచివిగా, చెడ్డవిగా ఉండే ఆకారంతో అధమంగాను, ఉత్తమంగాను ఉన్నవి.

**(హే లక్ష్మి తత్ తవ కటాక్షతదుపేక్షయోః తాండవమ్ ఇతి)** - ఓ శ్రీరంగ నాయకీ ! పూర్వం వివరించిన రీతిలోని హెచ్చు తగ్గులన్నీ - నీ కటాక్షాలవల్ల, వాటి అభావంవల్ల ఏర్పడిన తాండవమే.

స్థావరజంగమాత్మకమైన ఈ ప్రపంచంలో కొందఱు మూఢులై, కొందఱు విద్వాంసులై, కొందఱు సంపన్నులై, కొందఱు దరిద్రులై, కొందఱు సమర్థులై (బలవంతులై), మఱికొందఱు దుర్బలులై- ఈ రీతిగా పరస్పరవిషమమైన స్థితులలోఉండడానికి కారణం ఏది ? అంటే, లక్ష్మీదేవియొక్క అనుగ్రహప్రవాహం ప్రవహించిన చోటు ఉత్తుంగ (ఉన్నత) స్థితిలోను, అది ప్రవహించని చోటు అధమస్థితిలోను ఉన్నది- అని తెల్పినట్లయినది.

**19) కాలే శంసతి యోగ్యతాం చిదచితో రన్యోన్యమాలిఙ్గతోః**
**భూతాహఙ్కృతిబుద్ధి పఞ్చకరణీః స్వాన్తప్రవృత్తీన్ద్రియైః ।**
**అణ్డానావరణైః సహస్రమకరోత్ తాన్ భూర్భువ స్సుర్వతః**
**శ్రీరఙ్గేశ్వరదేవి! తే విహృతయే సఙ్కల్పమానః ప్రియః ॥**

శ్రీరంగేశ్వరదేవి = శ్రీరంగనాథుని దేవేరీ!, కాలే = సృష్టికి పూర్వకాలంలో, యోగ్యతాం=సృష్టికి అర్హతను, శంసతి = భావిస్తూ ఉండగా, చిత్+అచితోః= జీవతత్త్వం, ప్రకృతితత్త్వం - అనే ఈ రెండు, అన్యోన్యమ్ ఆలింగతోః = ఒకటితో ఇంకొకటి కలసి ఉన్నవి కాగా, ప్రియః = నీ ప్రియుడైన భగవానుడు, సంకల్పమానః = సంకల్పించే వాడై, తే = నీయొక్క, విహృతయే = క్రీడకొఱకు, భూత = పంచ భూతాలు, అహంకృతి= అహంకారతత్త్వం, బుద్ధి = మహతత్త్వం, వంచకరణీ= అయిదు జ్ఞానేంద్రియాలు, స్వాంత = మనస్సు, ప్రవృత్తి+ఇంద్రియైః=కర్మేంద్రియాలు - అనే వీనితో, ఆవరణైః= సప్తావరణాలతో, తాన్ = ప్రసిద్ధాలైన, భూర్భువ స్సర్వతః = భూలోక, భువర్లోక, స్వర్లోకాలను కల, సహస్రం = వేలాది, అణ్డాన్= బ్రహ్మాండాలను, అకరోత్= సృష్టించాడు.

**వ్యాఖ్యానమ్:-** భగవానుడు జగత్సృష్టిని నిర్వహించడం లక్ష్మీవిహారార్థమే - అని ఇందులో, అంటున్నారు.

**(శ్రీరంగేశ్వరదేవి!)**- ఓ శ్రీరంగనాయకీ !,

**(చిదచితోః అన్యోన్యమ్ ఆలింగతోః సతోః)**- చేతనాచేతనాలు ఒక దానితో ఇంకొకటి కూడి ఉండే సమయంలో- అంటే - **"అచిదవిశేషితాన్ ప్రళయసీమని సంసరతః"** (అచిత్తువలె ప్రళయసీమలో సంచరించే జీవులను చూచి) అని, **"అచిద విశిష్టాన్ ప్రళయే జంతూన్"** (అచిత్తు కంటే వేఱుకాని రీతిలో ప్రళయ కాలంలో ఉండే జీవులను) అనే రీతిలోని స్థితిలో ఉన్న సమయంలో - అని అర్థం.

**(కాలే యోగ్యతాం శంసతి సతి)**– కరణకళేబరయోగం చేయడం అనే సృష్టికి తగిన పరువం (కాలం) రాగానే– అని భావం. కాలం అనేది– సృష్టి యోగ్యతను తెలుపడం అంటే ఇదేకదా. అపుడు భగవానుడు ఏమి చేస్తాడు? – అని అంటే,

**(తే విహృతయే)**– నీ లీలకు తగినట్లుగా,

**(ప్రియః సంకల్పమానః)**– నీకు వల్లభుడైన శ్రీరంగనాథుడు **"సో కామయత బహుస్యాం ప్రజాయేయేతి"** (ఆ పరమాత్మ – "నేను అనేకంగా కాగలను" – అని సంకల్పించాడు.) అని ఉపనిషత్తు పల్కిన విధంగా బహురూపాన్ని పొందే సంకల్పాన్ని చేసేవాడై,

**(భూతాహంకృతిబుద్ధిపంచకరణీః స్వాంతప్రవృత్తీంద్రియైః)**– భూతాలంటే– పృథివి, జలం, తేజస్సు, వాయువు, ఆకాశం– అనే అయిదు భూతాలు. అహంకృతి అంటే– ప్రకృతియొక్క వికారరూపమైన అహంకారతత్త్వం. బుద్ధి అంటే– మహతత్త్వమ్. **"పంచకరణీః"** – అని సమాసం. ఆ అయిదు కరణాలు ఏవి? అంటే – ఇంద్రియాలు శ్లోకంలో తరువాత ప్రవృత్తీంద్రియశబ్దంతో కర్మేంద్రియాలు చెప్పబడి నందున ఇక్కడ జ్ఞానేంద్రియాలు చెప్పబడ్డాయని భావించాలి. **"శెవి వాయ్ కణ్ మూక్కు ఉడలెన్జైమ్బులనుమ్"** (చెవి, జిహ్వా, నేత్రాలు, నాసిక, చర్మం– అనే అయిదు ఇంద్రియాలు) అనబడే త్వక్కు(చర్మం), చక్షుస్సు, చెవి, జిహ్వా, ఘ్రాణాలు తెలుపబడ్డాయి. స్వాంతమంటే– జ్ఞానేంద్రియాలయొక్క, కర్మేంద్రియాల యొక్క కార్యాలకు తప్పక కావలసిన మనస్సు. ప్రవృత్తీంద్రియాలంటే – కర్మేంద్రియాలనబడే వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలు. వీటితోపాటు,

**(ఆవరణైః)** సప్తావరణాలతో పాటు,

**(భూర్భువ స్స్వర్వతః)** – భూలోకభువర్లోకసువర్లోకాలయొక్క,

**(తాన్ సహస్రమ్ అండాన్)** – ప్రసిద్ధాలై, వేలాదిగా ఉండే అండాలను,

**(అకరోత్)** – సృష్టించాడు.

శ్రీరంగనాయకీ! నీ ముఖోల్లాసమే తన ప్రయోజనంగా కల్గిన నీ ప్రియ వల్లభుడైన శ్రీరంగనాథుడు నీ విహారంకోసమే **"పొఙ్గు ఐమ్బులనుమ్ పొతి యైన్దుమ్**

**కరుమేన్దిరియమ్ ఐమ్బూదమ్ ఇజ్ఞు ఇవ్వుయిరేయ్ పిరకిరుది మానాఙ్గార మనజ్ఞళే"** (వర్ధిల్లే శబ్దాది విషయాలు అయిదు, జ్ఞానేంద్రియాలు అయిదు, కర్మేంద్రియాలు అయిదు, అయిదు భూతాలు, ఈ సంసారంలో ఈజీవాత్మతో కలసి ఉండే ప్రకృతి, మహత్తత్త్వం, అహంకారం, మనస్సు) అని చెప్పబడిన తత్త్వాలతోను, సప్తావరణాల తోను, భూర్భువస్సువర్లోకాలతో కూడిన పలువేల బ్రహ్మాండాలను సృష్టించాడు- అని తాత్పర్యం. వీటికి లీలావిభూతి - అని పేరు. ఎవరి లీల? అంటే - దివ్య దంపతుల లీల - అని అనాలి. ఇద్దఱికి ఇవి లీలయే అయినా, ముఖ్యంగా శ్రీరంగనాయకియొక్క లీలను ఉద్దేశించే వీటిని సృష్టించాడని పల్కిన ఈ సూక్తి ద్వారా భగవానుని పరమరసికత్వం సూచితమైనది.

**20) శబ్దాదీన్ విషయాన్ ప్రదర్శ్య విభవం విస్మార్య దాస్యాత్మకం**
**వైష్ణవ్యా గుణమాయయాఽత్మనివహాన్ విప్లావ్య పూర్వః పుమాన్ ।**
**పుంసా పణ్యవధూవిడమ్బివపుషా ధూర్తానివాయాసయన్**
**శ్రీరఙ్గేశ్వరి! కల్పతే తవ పరీహాసాత్మనే కేళయే ॥**

శ్రీరంగేశ్వరి = ఓ శ్రీరంగనాయకీ!, పూర్వః పుమాన్ = పురాణ పురుషుడైన శ్రీరంగనాథుడు, దాస్యాత్మకం = (జీవులకు సహజమైన) దాస్యరూపమైన, విభవం= ఐశ్వర్యాన్ని, విస్మార్య = మఱపింపజేసి, శబ్దాదీన్ విషయాన్ = శబ్దాది లౌకికవిషయా లను, ప్రదర్శ్య = ప్రదర్శించి, వైష్ణవ్యా = విష్ణువైన తనకు చెందిన, గుణమాయయా= సత్త్వరజస్తమోగుణాత్మకమైన మాయతో, (ప్రకృతితో), ఆత్మనివహాన్ = జీవసమూహాలను, విప్లావ్య = వ్యామోహపఱచి, పణ్యవధూ = భోగకాంతను, విడంబి=పోలిన, వపుషా = రూపాన్ని ధరించిన, పుంసా = పురుషునితో, ధూర్తాన్ ఇవ = కాముకులైన పురుషులను ఆయాసపఱచినట్లుగా, ఆయాసయన్ = ఆయాసాన్ని - ఖేదాన్ని - కలుగజేసేవాడై, తవ = నీయొక్క, పరీహాసాత్మనే = పరిహాసరూపమైన (నీకు పరిహాసాన్ని కల్గించే - నవ్వును తెప్పించే), కేళయే = క్రీడకోసం, కల్పతే = సమర్థుడవుతున్నాడు.

**వ్యాఖ్యానమ్ :- "విచిత్రా దేహసంపత్తి రీశ్వరాయ నివేదితుమ్, పూర్వమేవ కృతా బ్రహ్మన్! హస్తపాదాదిసంయుతా"** (బ్రహ్మా! చేతులు, కాళ్ళు మొదలైన అంగాలతో కూడిన విచిత్రమైన దేహమనే సంపద భగవన్నివేదనకోసం పూర్వమే సృష్టింపబడింది.) అనే రీతిలో చేతనులకు కరణకళేబరప్రదానం చేసి, **"తాముళరే తముళ్ళముళ్ళుళదే తామరైయిన్ పూవుళదే ఏత్తుమ్ పొழுదుణ్డే, వామన్ తిరుమరువు**

**తాళ్ మరువు శెన్నియరే శెవ్వే యరు నరకమ్ శేర్వదరిదు"** (ఇరణ్డామ్ తిరువన్దాది-21) (తాము (జీవులు) ఉండనే ఉన్నారు, తమ మనస్సు ఉన్నది, తామరపూవు ఉన్నది. పూజించే కాలం ఉన్నది. ఐశ్వర్యం నిండిన వామనుని శ్రీచరణాలను చేర్చదగిన శిరస్సును కలవారై ఉన్నారు. అయినా, లోకులు నరకాన్ని చేరడం ఆశ్చర్యం!) అనే రీతిలో నిర్వేదానికి తగినట్లుగా ఆ కరణకళేబరాలను విషయాంతరాలలో లగ్నం చేస్తున్న జీవులను కూడా సర్వేశ్వరుడే సృష్టిస్తున్నాడు. ఇదికూడా లక్ష్మితో కలసి ఒక రసాన్ని అనుభవించడంకోసం కదా! మహాప్రభువులు గూనివాళ్ళను, మరుగుజ్జులను, గుడ్డివాళ్ళను, చెవిటివాళ్ళను చేరదీసి, వారిచే నాట్యం చేయించి చూచి వినోదించే రీతి ఒకటి ఉన్నది కదా. అదే రీతిలోనే ఇదికూడా. అందువల్ల, లక్ష్మీదేవి నర్మకేళికోసమే ఈ విధంగా భగవానుడు చేస్తున్నాడు- అని ఈ శ్లోకంలో అంటున్నారు.

**(శ్రీరంగేశ్వరి !)**- ఓ శ్రీరంగనాయకీ !,

**(పూర్వః పుమాన్)**- పురాణపురుషుడైన శ్రీరంగనాథుడు,

**(శబ్దాదీన్ విషయాన్ ప్రదర్శ్య)**- శబ్దాదివిషయాంతరాలను చూపి,

**(దాస్యాత్మకం విభవం విస్మార్య)**- భగవచ్ఛేషత్వమనే తమ ఐశ్వర్యాన్ని వారు మఱచిపోయేటట్లుగా చేసి,

**(పణ్యవధూవిడంబవపుషా పుంసా)**- వేశ్యావేషంవంటి వేషంతో. (పణ్యస్త్రీ వేషంతో)- కూడిన పురుషులతో (జీవులతో)

**(ధూర్తాన్ ఇవ)** - ధూర్తులను వంచించినట్లుగా,

**(వైష్ణవ్యా గుణమాయా)** - **"దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దుర్యత్యయా"** (త్రిగుణాత్మకమైన నా ఈ దైవీమాయ దాటరానిది) అని నిర్దేశింపబడినది, విష్ణువు అనబడే తనచేతనే నియమింపబడినది, సత్త్వరజస్తమోరూప గుణత్రయాత్మకమై ఉండే మాయతో,

**(ఆత్మనివహాన్ విప్లావ్య)**- జీవసమూహాన్ని వంచించి,

**(ఆయాసయన్)**- వారికి శ్రమను కలుగజేసేవాడై,

**(తవ పరీహాసాత్మనే కేళయే కల్పతే)** – నీ వినోదం కల్గించడంలో సమర్థుడవు తున్నాడు.

**"పణ్యవధూవిడంబశరీరకుడై"**న పురుషుని స్థానంలో **"దైవీమాయ"**ను గ్రహించాలి. ధూర్తుల స్థానంలో ఆత్మసమూహాన్ని గ్రహించాలి. ఈ విధంగా కరణం, కర్మ ఉపమానత్వేన ఒకటి, ఉపమేయత్వేన ఒకటి – రెండు వస్తువులు నిర్దేశింపబడినట్లే, కర్తకూడా రెండుగా చెప్పబడాలి. కాని, **"పూర్వః పుమాన్"** అని పురాణపురుషుడు ఒక్కడు మాత్రమే కర్తగా చెప్పబడినట్లు కన్పిస్తుంది. పరమపురుషునిస్థానంలో ఒక మహాప్రభువును ఉపమానంగా మనస్సులో భావించాలి. నవరాత్రి మొదలైన ఉత్సవవిశేషాలలో ఒక మహాప్రభువు ఒక పురుషునకు వేశ్యావేషాన్ని వేయించి, అతనిని చూపించి, కొంతమంది ధూర్తులను (విటులను) వ్యామోహపఱచి (అంటే– అతడే నిజమైన వేశ్యగా తలచేటట్లు చేసి) ఆ వినోదంతో తాను తన పత్నికి (మహిషికి) ఒక వినోదాన్ని కల్గిస్తాడు. అదే రీతిలో భగవానుడు కూడా దైవమాయతో సంసారులను లౌకిక సుఖాలనే గోతులలో పడదోసి, ఈ విధమైన వినోదంతో తన దివ్యదేవేరికి ఒక వినోదాన్ని కల్గిస్తున్నాడని తెలుపబడినట్లయింది. శ్లోకంలో **"పూర్వః పుమాన్"** అనే ఒక కర్తృపదం ఉన్నది. దానినుండి **"పుమాన్"** అనే దానినిమాత్రం అనుషంగం చేసికొని, అర్థం నిర్వహించాలి. **"పణ్యవధూవిడంబవపుషా పుంసా ధూర్తాన్ ఆయాసయన్ పూమానివ"** అని – అన్వయం.

**21) యద్దూరే మనసో యదేవ తమసః పారే యదత్యద్భుతమ్**
**యత్కాలాదపచేళిమం సురపురీ యద్గచ్ఛతో దుర్గతిః ।**
**సాయుజ్యస్య యదేవ సూతి రథవా యద్దుర్గ్రహం మద్గిరామ్**
**తద్విష్ణోః పరమం పదం తవ కృతే మాత స్సమామ్నాసిషుః ॥**

మాతః = తల్లీ! శ్రీరంగనాయకీ!, యత్ = ఏ చోటు, మనసః = మనస్సుకు, దూరే = అందనిదిగా ఉన్నదో (మనస్సుతో భావించడానికికూడా వీలుకాదో), యత్+ ఏవ = ఏ ప్రదేశమే, తమసః = ప్రకృతికి, పారే = ఆవలి వైపున ఉన్నదో, యత్=ఏ ప్రదేశం, అత్యద్భుతం = మిక్కిలి ఆశ్చర్యకరమైనదో, యత్ = ఏ ప్రదేశం, కాలాత్ = కాలంవల్ల, అపచేళిమం = పరిణతిని (మార్పును) పొందదో, యత్ = ఏ ప్రదేశాన్ని

ఉద్దేశించి, గచ్ఛతః = వెళ్ళేవానికి, సురపురీ = దేవనగరమైన అమరావతి, దుర్గతిః = నరకమో, యత్ +ఏవ = ఏ ప్రదేశమ్, సాయుజ్యస్య = మోక్షానికి, సూతిః = పుట్టినిల్లో, అథవా = లేక, యత్ = ఏ చోటు, మద్గిరాం = నా వాక్కులకు, దుర్గ్రహం = అందనిదో, విష్ణోః = విష్ణువుయొక్క, తత్ = ఆ, పరమం = ఉత్కృష్టమైన, పదం = స్థానమైన వైకుంఠాన్ని, తవ కృతే = నీకోసంగా ఉన్నదని, సమామ్నాసిషుః = (వేదంలో) అధ్యయనం చేశారు (పలికారు).

**వ్యాఖ్యానమ్** :- గడచిన శ్లోకంలో శ్రీరంగనాయకికి లీలావిభూతి యోగాన్నిగూర్చి అనుగ్రహించారు. ఇక, నిత్యవిభూతియొక్క ఉపయోగాన్నిగూర్చి పలుకవలసి ఉన్నది కనుక, అది ఈ శ్లోకంలో చెప్పబడుతున్నది.

**(మాతః! తద్విష్ణోః పరమం పదం తవ కృతే సమామ్నాసిషుః)**- ఓ శ్రీరంగనాయకీ! ఆ పరమపదం నీ కోసమే ఉన్నదని వైదికులు పల్కుతున్నారు- అని భావం. **"వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః, ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తైర్భాగవతైః స్సహ"** (గొప్ప లోకమైన పరమపదంలో జగత్తుకు అధిపతి అయిన గొప్ప మహిమను కల విష్ణువు భక్తులతో, భాగవతులతో కలసి వేంచేసి ఉన్నాడు) అని దివ్యదంపతులు ఇద్దటికే అది స్థానంగా చెప్పబడినప్పటికీ, **"ఒణ్డొడియాళ్ తిరుమకళుమ్ నీయుమే నిలానిఱ్ప"** (అందమైన గాజులను కల లక్ష్మీదేవి, నీవు మాత్రమే విహరించగా) (తిరువాయ్మొఱ్రి-4-9-10) అనే ప్రకారాన్ని బాగా గమనించి చూస్తే, లక్ష్మీదేవికే ప్రాధాన్యం తెలుస్తున్నందున, **"పరమం పదం తవ కృతే సమామ్నాసిషుః"** అని అనడంలో కొఱత లేదు - అని భావం. ఆ పరమపదంయొక్క గొప్పతనాన్ని మూడు పదాలతో వివరంగా అనుగ్రహిస్తున్నారు.

**(యత్ మనసః దూరే)**- ఇటువంటిది -అని మనస్సులో కూడా భావించడానికి సాధ్యం కానిది- అని భావం. ఇటువంటివారి మనస్సుకు- అని ఇక్కడ విశేషించి చెప్పబడకపోయినా, శ్రీరామానుజులు శ్రీవైకుంఠగద్యలో- **"బ్రహ్మాదీనాం వాఙ్మనసాగోచరే శ్రీమతి వైకుంఠేమనే దివ్యలోకే"** (బ్రహ్మాదుల వాక్కులకు, మనస్సుకు అందని గొప్పదైన వైకుంఠ దివ్యలోకంలో) అని అనుగ్రహించినందువల్ల చతుర్ముఖుడు మొదలైనవారి మనస్సుకు కూడ అందనిది అని చెప్పబడినట్లుగా గ్రహించాలి.

**(యదేవః తమసః పారే)**– ఏ స్థానవిశేషం ప్రకృతిమండలానికి ఆవల వైపు ఉన్నదో,

**(యత్ అత్యద్భుతమ్)**– అద్భుతమని, ఆశ్చర్యమని లోకంలో కొన్ని శబ్దాలు ప్రయోగింపబడుతున్నాయి కదా ! ఇవి అన్నీ ఆ స్థానవిశేషానికే తగినవి. అక్కడ ఉండే సన్నివేశవిశేషాలతో పరమపదం చాలా అద్భుతమైనది. **"అత్యద్భుతత్వ మావదు– అనుక్షణమ్ అపూర్వాశ్చర్యావహత్వమ్"** (అత్యద్భుత్వం అంటే– ప్రతిక్షణం ఆశ్చర్యాన్ని కల్గించేదిగా ఉండడం) అనేది తత్త్వత్రయవ్యాఖ్యానంలో శ్రీవరవర మునుల శ్రీసూక్తి.

**(యత్ కాలాత్ అపచేలిమమ్)**– కాలకృతపరిణామం లేని దేశమని భావం. కాలాన్ని నిర్వహించేవారైన సూర్యచంద్రులు అక్కడ లేనందువల్ల, కాలవిపాకానికి అక్కడ ప్రయోజనం ఏదీ లేనందువల్ల అకాలకాల్యమై ఉంటుంది.

**(యద్గచ్ఛతః సురపురీదుర్గతిః)**– ఆ స్థానవిశేషాన్ని పొందినవానికి స్వర్గాదిలోకం నరకనిర్విశేషమై తోస్తుంది – అని భావం. **"ఏతే వై నిరయా స్తాత! స్థానస్య పరమాత్మనః"** (నాయనా! పరమాత్మ స్థానంతో పోలిస్తే ఇవి అన్నీ నరకాలే) అని కదా చెప్పబడుతున్నదికదా!

**(యదేవ సాయుజ్యస్య సూతిః)**– **"నిరంజనః పరమం సామ్యముపైతి"**, (ప్రకృతి సంబంధం లేనివాడు గొప్ప సామ్యాన్ని పొందుతున్నాడు) **"తమ్మైయే నాళుమ్ వణఙ్గి త్తొழுవార్క్కు తమ్మైయేయొక్క అరుళ్శెయ్వర్"** (భగవానుడు తనను నిత్యం నమస్కరించి కొలిచేవారికి తనతో సామ్యాన్ని అనుగ్రహిస్తాడు.) అనే రీతిలో ఆ భగవానుని అనుగ్రహంతో పొందే పరమసామ్యాపత్తి పొందే చోటు.

**(అథవా మద్గిరాం యత్ దుర్గ్రహమ్)**– దివ్యదంపతుల కృపావిశేషంతో దేనినైనా వర్ణించగల్గిన తమ వాక్కుకు కూడా అందనిది– అని అంటున్నారు. ఇది చాలా అతిశయాన్ని కల్గిన విశేషణం. **"బ్రహ్మాదీనాం వాఙ్మనసాగోచరే"** (బ్రహ్మాదుల వాక్కుకు, మనస్సుకు అందనిది) అని శ్రీరామానుజులు పల్కడం గొప్ప కాదు. **"మద్గిరాం దుర్గ్రహమ్"** అని పల్కడమే గొప్ప– అనేది కవి అభిప్రాయం కాబోలు.

పెరియతిరుమొ/గ్రి ప్రబంధంలోని **"శాన్దేన్దు మెన్ములైయార్"** (చందనం పూసికొన్న సుకుమారవక్షాన్ని కలవారు) అనే పాశురంయొక్క వ్యాఖ్యానంలో పెరియవాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన సూక్తిని గమనించండి - **"కిడాంబియాచ్చాన్, శిఱియాణ్డాన్ పెరుమాళ్ పణిత్తానాక ప్పలకాలుమ్ శొల్లుమ్. "నాన్ శొల్లుకిఱ వాచ్యవాచకజ్గళే యన్నే, భట్టరుమ్ వ్యవహరిక్కిఱదు"- ఎన్నిరుక్కవొణ్ణాదు. అజ్గుత్తైక్కు ఏర్గ్ర ముణ్డు. మున్నే నిన్ఱ తూణై నాన్ 'తూణ్' ఎన్ఱవాఱే శిరాయాయ్ త్తోన్ఱుమ్. అవర్ శొన్నవాఱే తళిరుమ్ ముఱియుమాయ్ త్తోన్ఱుమ్- ఎన్ఱు".** (నేను పలికే మాటలే కదా భట్టర్ కూడా పల్కుతున్నారు- అని భావించరాదు. వారి విషయంలో ఒక వైలక్షణ్యం ఉన్నది. ఎదురుగా ఉండే స్తంభాన్ని నేను "స్తంభం" అంటే కొయ్యగా తోస్తుంది. వారు పల్కితే, చిగిర్చి కొమ్మలు రెమ్మలు కల్గినట్లు ఉంటుంది. -అని శిఱియాణ్డాన్ పెరుమాళ్ పలికారని కిడాంబి ఆచ్చాన్ పలుమార్లు అన్నారు.) ఇటువంటి వాక్సామర్థ్యాన్ని కల తమకు కూడా వర్ణించడానికి సాధ్యం కానిది- అనే ఈ సూక్తి విలక్షణవాగ్విన్యాసమే. అందువల్ల ఇటువంటి పరమపదాన్ని, ఓ శ్రీరంగనాయకీ! నీ భోగంకోసంగా ఏర్పాటు చేసినట్లు వైదికులు పల్కుతున్నారు.

తరువాత 24వ శ్లోకంలో **"భగవతి ! యువయోరాహు రాస్థానరత్నమ్"** (పూజ్యురాలా! మీ ఇద్దఱి యొక్క గొప్ప ఆస్థాన మండపంగా అంటారు) అని దివ్యదంపతులిద్దఱికి చెందినదిగా పల్కిన సూక్తితో ఇది విరోధించదు.

**22) హేలాయా మఖిలం చరాచరమిదం భోగే విభూతిః పరా**
**ధన్యా స్తే పరిచారకర్మణి సదా పశ్యన్తి యే సూరయః ।**
**శ్రీరఙ్గేశ్వరదేవి! కేవలకృపానిర్వ్యాహ్యవర్గే వయం**
**శేషిత్వే పరమః పుమాన్ పరికరా హ్యేతే తవ స్ఫారణే॥**

శ్రీరంగేశ్వరదేవి = శ్రీరంగనాథుని దేవేరీ!, అఖిలం = సమస్తమైన, ఇదం = (గోచరించే) ఈ, చరాచరం = జంగమస్థావర రూపమైన లోకం అంతా, హేలాయాం= (నీ) క్రీడలో ఉపయోగపడుతున్నది, పరా = గొప్పది అయిన, విభూతిః = నిత్య విభూతి, భోగే = నీ భోగంలో ఉపయోగపడుతున్నది, యే = ఎవరు (నిత్య సూరులు), సదా = ఎల్లప్పుడు, పశ్యంతి = దర్శిస్తున్నారో, తే = ఆ, ధన్యాః = భాగ్యశాలులైన, సూరయః= నిత్యసూరులు, పరిచారకర్మణి = నీ కైంకర్యంలో ఉపయోగపడుతున్నారు,

వయం: = ఈ లీలావిభూతిలో ఉండే మేము, కేవలకృపా = నీ నిర్హేతుక కృపతో, నిర్వాహ్యా= నిర్వహింపదగిన (ఉజ్జీవింపచేయదగిన), వర్గే= జీవవర్గంలో అంతర్భ విస్తున్నాము, పరమః పుమాన్ = పరమపురుషుడైన భగవానుడు, శేషిత్వే = నీ శేషిభావంలో (నీకు శేషిగా ఉండే స్థితిలో ఉపయోగపడుతున్నాడు), తవ = నీయొక్క, స్ఫారణే = వైభవంలో, ఏత్ = వీరంతా, పరికరాః హి = సామగ్రి కదా.

**వ్యాఖ్యానమ్ :-** గడచిన ఒక శ్లోకంలో లీలావిభూతినిగూర్చి, ఇంకొక శ్లోకంలో నిత్యవిభూతిని గూర్చి పల్కుతూ, ఇవి శ్రీరంగనాయకియొక్క ఉపయోగం కోసమే- అని అన్నారు. ఇందులో- ఉభయవిభూతులు, ఆ ఉభయవిభూతుల లోని పదార్థాలు, భగవానుడు- అన్నీ లక్ష్మీదేవియొక్క విభూతి (సంపద) అని అంటున్నారు.

**(శ్రీరంగేశ్వరదేవి !)**- ఓ శ్రీరంగనాయకీ !,

**(ఇదమ్ అఖిలమ్ చరాచరమ్ తవ హేలాయామ్)**- జంగమ స్థావరాత్మ కాలుగా కన్పించే ఈ జగత్తు అంతా నీ క్రీడలో వినియోగింపబడుతున్నది. **"త్వం న్యంచద్భి రుదంచద్భిః కర్మసూత్రోపపాదితైః, హరే ! విహరసి క్రీడాకందుకైరివ జంతుభిః"** (హరీ! కిందకు, పైకి వచ్చేవారు, కర్మలనే నేత్రాలతో బంధింపబడిన వారైన జీవులతో నీవు, కిందకు పోయి పైకి వచ్చే క్రీడాకందుకాలతో వలె, వినోదిస్తున్నావు) అని, ఈ విభూతిని లీలకోసమని చెప్పబడిందికదా!

**(పరా విభూతిః భోగే)**- త్రిపాద్విభూతి నీ గొప్పదైన భోగంలో వినియోగింప బడింది.

**(యే సూరయః సదా పశ్యంతి తే పుణ్యాః తవ పరిచారకర్మణి)**- **"సదా పశ్యంతి సూరయః"** (నిత్యసూరులు సదా పరమాత్మను దర్శిస్తున్నారు) అని దివ్యదంపతులైన మిమ్ములను సదా దర్శించేవారుగా శ్రుతిలో చెప్పబడిన భాగ్య శాలులైన నిత్యముక్తులు నీ కైంకర్యంలో వినియోగింపబడినవారై ఉన్నారు. శేషశేషాశనగరుడ ప్రముఖానంతపరిజన పరిచారికాపరిచరిత చరణయుగళత్వం భగవానునకువలె లక్ష్మికికూడా ఉన్నది కదా! **"....అకిలుమ్ పణి శెయ్‌వదు గృహిణిక్కితే"** (అయినా సేవ చేయడం గృహిణికే కదా) అనే ముముక్షుప్పడి శ్రీసూక్తిని అనుసంధించాలి.

**(వయం కేవలకృపానిర్వాహ్యవర్గే)**- బుభుక్షువులం, ముముక్షువులం అయిన అస్మదాదులు నీ నిర్హేతుకకృపను పొంది నిర్వహింపదగినవారి వర్గంలో అంతర్భ వించినవారం. మేముకూడా నీకు ఒకవిధంగా దాసులమై ఉన్నామని భావం.

**(పరమః పుమాన్ శేషిత్వే)**- పరమపురుషుడైన భగవానుడు నీకు శేషియై, వినియోగపడుతున్నాడు. శేషిత్వమంటే - కైంకర్య ప్రతిసంబంధిత్వం. కైంకర్యాన్ని స్వీకరించేవాడై ఉండడం- అని భావం.

**(ఏతే తవ స్ఫారణే పరికరా హి)**- ఈ రీతిలో ఇక్కడ చెప్పబడినది అంతా నీ వైభవంలో అంతర్భవిస్తుంది, అంతే. నీకు ఉపయోగించనిది ఏ వస్తువు ఈ ఉభయవిభూతులలో లేదని భావం.

**23) ఆజ్ఞానుగ్రహభీమ కోమలపురీపాలా ఫలం భేజుషాం**
**యాఽయోధ్యేత్యపరాజితేతి విదితా నాకం పరేణ స్థితా ।**
**భావై రద్భుతభోగభూమగహనై స్సాన్ద్రా సుధాస్యన్దిభిః**
**శ్రీరఙ్గేశ్వరగేహలక్ష్మి! యువయో స్తాం రాజధానీం విదుః ॥**

శ్రీరంగేశ్వరగేహలక్ష్మి = శ్రీరంగనాథుని గృహలక్ష్మీ!, యా = (పరమపదంలోని) ఏ దివ్యనగరి, ఆజ్ఞా = అజ్ఞచేత, అనుగ్రహా = అనుగ్రహంచేత, (క్రమంగా), భీమ=భయాన్ని కల్గించేవారుగా, కోమల = సుకుమారులుగా (అనుకూలురుగా) ఉండే, పురీపాలా =నగరపాలకులను కల్గినదో, భేజుషాం = భక్తులకు, ఫలం = ప్రయోజన రూపంగా ఉన్నదో, అయోధ్యా ఇతి = **"అయోధ్యా"**-అని, అపరాజితా ఇతి= **"అపరాజితా"** అని, విదితా = ప్రసిద్ధిని పొందినదో, నాకం = పరమాకాశానికి, పరేణ=ఆవలి వైపున, స్థితా = ఉన్నదో, సుధాస్యందిభిః = అమృతాన్ని చిందించేవి (భోగ్యాలైనవి), అద్భుత = ఆశ్చర్యాన్ని కల్గించేవి అయిన భోగ = అనుభవాల, భూమి= అతిశయంచేత, గహనైః = నిండుగా ఉండేవి అయిన, భావైః = భావాలతో, సాంద్రా= దట్టంగా ఉండేది, అయిన, తాం = ఆ, నగరాన్ని, యువయోః = మీ ఇద్దఱి యొక్క రాజధానీం = రాజధానీ నగరంగా, విదుః = తెలిసికొంటున్నారు.

**వ్యాఖ్యానమ్ :-** పూర్వం **"యద్దూరే మనసః"** అనే శ్లోకంలో పరమపదం లక్ష్మీదేవికోసం ఏర్పాటుచేయబడిందని అన్నారు. ఆ పరమపదంలోని శ్రీవైకుంఠ దివ్యనగరి దివ్యదంపతులకోసం ఏర్పడినదని ఇందులో అనుగ్రహిస్తున్నారు.

**(శ్రీరంగేశ్వరగేహలక్ష్మి!)**- శ్రీరంగదివ్యవిమానానికి అలంకారమైన ఓ శ్రీరంగనాయకీ !,

**(యా పురీ)**- ఏదివ్యనగరి,

**(ఆజ్ఞానుగ్రహభీమకోమలపురీపాలా)**- ఆజ్ఞతో భయంకరులుగాను, అనుగ్రహంతో సౌమ్యులుగాను ఉండే నగరపాలకులను కల్గినదై ఉన్నదో- అని భావం. శ్రీరంగరాజస్తవంలో శ్రీరంగమందిరద్వారపాలకులను నమస్కరించే శ్లోకంలో- **"స్మేరాననాక్షికమలైః నమతో పునానాన్ దంష్ట్రాగదాభ్రుకుటిభిః ద్విషతో ధునానాన్"** (చిఱునవ్వును కల పద్మాలవంటి నేత్రాలతో తమను నమస్కరించే వారిని పవిత్రులుగా చేస్తూ, కోరపళ్ళతో, కనుబొమలతో భగవానుని ద్వేషించేవారిని బెదరించి తరుముతూ ఉండేవారై) అని అనుగ్రహించిన సూక్తి ఇక్కడ అనుసంధేయం. దాని భావమేమి? అంటే- ద్వారపాలకులు భాగవతులకు అనుకూలురుగాను, భగవద్భాగవత విరోధులకు ప్రతికూలురుగాను ఉంటారు. మందహాసాన్ని కల తమ ముఖాన్ని, తిరునేత్రాలను చూపి, వారిని పవిత్రులుగా చేస్తున్నారు. కోఱపళ్ళతో, గదలతో, కనుబొమలతో ప్రతికూలురకు భయంకరంగాను ఉంటారు- అని. ఆ రీతిలోనే ఇక్కడ కూడా తెలుపబడుతున్నది. ఆజ్ఞను నిర్వహించడంకోసం వంగిన కోరపళ్ళను చూపి భయాన్ని కల్గించేవారై, అనుగ్రహాన్ని చేస్తున్న రీతిని చూపి సౌమ్యరూపులై పురీపాలకులున్నారు.

**(ఫలం భేజుషామ్)** - **"భేజుషాం ఫలమ్"** అని పదాల క్రమాన్ని మార్చి అన్వయించాలి. భక్తులకు పరమపురుషార్థం- అని అర్థం. **"భేజివాంసః"** అనేది ప్రథమా విభక్తి బహువచనం. ఆ పదానికి షష్ఠీబహువచనం **"భేజుషామ్"** అని అవుతుంది. **"భక్తానామ్"** అనే పదాన్ని అధ్యాహరించుకోవాలి. భక్తులయొక్క- అని అర్థం. ఇది క్వసుప్రత్యయాంతమైన శబ్దం. దివ్యదంపతులను ఆశ్రయించేవారికి పరమభోగ్యమైన స్థానమని భావం.

**(యా అయోధ్యేతి అపరాజితేతి విదితా)**- తైత్తిరీయారణ్యకంలో "దేవానాం **పూ రయోధ్యా"** (నిత్యసూరుల నగరం అయోధ్య) అని, **"వివేశాపరాజితా"** అని అయోధ్యగా, అపరాజితగా చెప్పబడ్డ చోటు. **"అయోధ్యా"** అంటే- **"యోద్ధుమ్ అశక్యా"** - ఎవరికీ యుద్ధం చేసి ఆక్రమించడానికి సాధ్యం కాని చోటు- అని

అర్థం. **"అపరాజితా"** అంటే - ఏనాడు పరాజయాన్ని పొందని చోటు -అని అర్థం.

**(నాకం పరేణ స్థితా)- "పరేణ నాకం పురి హేమమయ్యాం యో బ్రహ్మకోశో౽స్త్యపరాజితాఖ్యః"** (స్వర్గానికి ఆవలవైపు హిరణ్మయమైన పురిలో అపరాజిత అనే పేరును కల ఏ పరబ్రహ్మస్థానం ఉన్నదో) అనే శ్రీరంగరాజస్తవ పూర్వశతకసూక్తి ఇక్కడ అనుసంధేయం. ప్రకృతిమండలానికి ఆవలి వైపున **"పొన్నులకు"** అనబడే హిరణ్మయపురిలో **"అపరాజిత"** అనే నామాన్ని కల స్థానవిశేషం ప్రకాశిస్తున్నది.

**(సుధాస్యందిభిః అద్భుతభోగభూమగహనైః భావైః సాంద్రా)**- ఆ చోట ఉండే పదార్థవిశేషాలను ఇది తెల్పుతున్నది. **"సుధాస్యందిభిః"**- అమృతాన్ని ప్రవహించేవి,- అని అర్థం. పరమభోగ్యాలై ఉండే- అని భావం. ఇది **"భావైః"** అనే దానికి విశేషణం. భావాలేవి? అంటే- పదార్థాలు, వస్తువులు. అవి ఇంకా ఎటువంటివై ఉన్నాయి? అని అంటే,

**(అద్భుతభోగభూమగహనైః)**- ఆశ్చర్యకరమైన సుఖానుభవాల ఆధిక్యంతో నిండినవి. దట్టమైనవి. ఈ విధమైన పదార్థాలతో,

**(సాంద్రా)** - నిబిడంగా ఉండేది.

**(తామ్ యువయోః రాజధానీం విదుః)**- అటువంటి దివ్యపురిని దివ్యదంపతులైన మీకు రాజధాని- అని వేదాంతులు తెలిసికొంటున్నారు.

**24) తస్యాఞ్చ త్వత్కృపావన్నిరవధిజనతావిశ్రమార్హావకాశం**
**సజ్జీర్ణం దాస్యతృష్ణా కలితపరికరైః పుమ్భి రానన్దనిఘ్నైః ।**
**స్నేహాదస్థానరక్షావ్యసనిభి రభయం శార్ఙ్గచక్రాసిముఖ్యైః**
**ఆనన్దైకార్ణవం శ్రీర్భగవతి! యువయో రాహు రాస్థానరత్నమ్॥**

భగవతి = షాడ్గుణ్యపూర్ణ అయిన, శ్రీః=ఓ లక్ష్మీస్వరూపిణివి అయిన శ్రీరంగ నాయకీ!, తస్యాం = (గడచిన శ్లోకంలో ప్రస్తుతమైన, అయోధ్య, అపరాజిత అనబడే) ఆ నగరిలో, త్వత్కృపావత్ = నీకృపవలె, నిరవధి = పరిమితి లేని, జనతా= జన సమూహానికి, విశ్రమ+అర్హ = విశ్రమించడానికి తగిన, అవకాశం = చోటును కల్గినది,

దాస్యతృష్ణా = కైంకర్యంలోని ఆశచేత, కలిత = గ్రహించిన, పరికరైః = చామరాది కైంకర్యసాధనాలను కలవారు, ఆనందనిఘ్నైః = ఆనందంలో మునిగిన వారైన, పుంభిః = పురుషులచేత, సంకీర్ణం = కిక్కిరిసి (నిబిడంగా) ఉన్నది, స్నేహాత్= ప్రీతివల్ల, అస్థాన = అక్కరలేనపుడు కూడా, రక్షా = రక్షించడంలో (మంగళాశాసనం చేయడంలో), వ్యసనిభిః = నిరంతరం ప్రయత్నాన్ని కల్గిన, శార్ఙ్గ = శ్రీశార్ఙ్గమనే విల్లు, చక్ర=శ్రీసుదర్శన మనే చక్రం, అపి = నందకమనే ఖడ్గం, ముఖ్యైః = మొదలైన దివ్యాయుధాలతో, అభయం = భయం లేనిది, ఆనంద+ఏకార్ణవమ్ = కేవలం ఆనందసముద్రం అయిన, ఆస్థానరత్నం చ = గొప్పదైన ఆస్థానమండపాన్ని (వేయికాళ్ళ మండపాన్ని) కూడా, యువయోః రాజధానీం = మీదే అని, ఆహుః = పల్కుతున్నారు.

**వ్యాఖ్యానమ్** :- గడచిన శ్లోకంలో, పరమపదంలో అయోధ్య-అని, అపరాజిత - అని పిలువబడే రాజధానియొక్క గొప్పతనాన్నిగూర్చి పలికారు. ఇందులో, అక్కడ ఉండే ఆస్థానవైభవాన్నిగూర్చి వర్ణిస్తున్నారు. తిరుమామణి మండపమే ఆస్థానమండపమనబడుతున్నది.

**(భగవతి! శ్రీః)** - షాడ్గుణ్యసంపదను కల్గిన ఓ శ్రీరంగనాయకీ !,

**(తస్యాం చ)** - పూర్వశ్లోకంలో పల్కిన దివ్యరాజధానిలో-అని అర్థం.

**(ఆస్థానమ్ యువయో రాహుః)**- తిరుమామణిమండపమనేదానిని దివ్యదంపతులైన మీకు చెందినదిగా వేదాంతులు పల్కుతున్నారు. ఆ తిరుమామణిమండపం ఎటువంటిది ? అంటే-

**(త్వత్కృపావత్ నిరవధిజనతా విశ్రమార్హావకాశమ్)**- నీ కృప ఏవిధంగా నిరతిశయమైనదో, ఆ విధంగానే నిరవధికాలైన నిత్యముక్తుల సమూహాలు విశ్రమించడానికి అనువైన అవకాశవిశేషాన్ని కల్గినది. (తిరుమామణిమండపం) నిత్యముక్తుల నిరవధికత్వాన్ని గూర్చి పల్కుతూ శ్రీరంగనాయకియొక్క కరుణవలె నిరవధికమైనది- అని పలికే ఈ సూక్తి చాలా రస్యం. ఇంకా ఎటువంటిది ? అని అంటే,

**(దాస్యతృష్ణాకలితపరికరైః ఆనందనిఘ్నైః పుంభిః సంకీర్ణమ్)**- దాస్యం చేయడంలో ఉండే కుతూహలంతో ఛత్రం, చామరం మొదలైన కైంకర్యసాధనాలను చేతిలో ధరించి ఉండేవారు, తాము చేసే ఆ కైంకర్యాన్ని గూర్చి తలుస్తూ ఆనంద

పరవశులైన నిత్యులతో, ముక్తులతో నిండి ఉంటుంది. శ్రీవచనభూషణంలో- **"స్వరూపప్రాప్తియై శాస్త్రమ్ పురుషార్థమాక చ్చొల్లానిఱ్క ప్రాప్తిఫలమాయ్ క్కొణ్డు కైంకర్యమ్ వరుకిఱాప్పోలే"** (స్వరూపప్రాప్తిని శాస్త్రం పురుషార్థంగా తెలుపుతూ ఉండగా, ప్రాప్తి ఫలంగా కైంకర్యం వచ్చేటట్లు) అని పల్కిన రీతిలో **"స్వేన రూపేణాభినిష్పద్యతే"** (ముక్తుడు స్వస్వరూపాన్ని పొందుతున్నాడు) అని అనాది కర్మనిబంధనమైన అచిత్సంబంధంతో మఱుగుపడి ఉండే తన అసాధారణా కారంయొక్క ఆవిర్భావరూపమైన స్వరూపప్రాప్తియే పురుషార్థంగా చెప్పబడినప్పటికీ, ఈ విధంగా ఆవిర్భవించిన స్వరూపాన్ని కల ఆత్మశేషత్వాన్ని పురస్కరించుకొని మాత్రమే నిరూపింపబడవలసినవాడైనందున, శేషి విషయంలో చేసే కైంకర్యంతో తప్ప స్వరూపం నిలువదు కనుక, ఆ స్వరూప ప్రాప్తిఫలంగా, భగవదనుభవజనిత ప్రీతికారితకైంకర్యం తప్పక వచ్చి చేరుతుంది- అనేది భగవద్రామానుజసిద్ధాంతం కనుక, **"దాస్యతృష్ణాకలిత పరికరైః"** అని పలికారు. ఆ కైంకర్యం అనేది తాను అభిమానించే వ్యక్తికి చేసేది కనుక, దుఃఖరూపమైనది కాకుండా, ఆనందరూపమై ఉంటుంది కనుక, వెంటనే **"ఆనందనిఘ్నైః"** అని అన్నారు.

ఆ ఆస్థానమండం ఇంకా ఎటువంటిది? అని అంటే-

**(స్నేహాదస్థానరక్షావ్యసనిభిః శార్ఙ్గచక్రాసిముఖ్యైః అభయమ్)**- అభినివేశాతి శయం వల్ల మనస్సులో అస్థానే శంకను పొంది, మంగళాశాసనాన్ని చేయడంలోనే ఆసక్తిని కలవారైన దివ్యాయుధాలతో భయం తీరిన చోటు- అని భావం. పరమపదంలో భయానికి ఏవిధమైన ప్రసక్తి లేకపోయినా, అక్కడ కూడా భయం కల్గుతుందని భావించి, అది తీరడంకోసం శ్రీసుదర్శనం, శ్రీశార్ఙ్గం మొదలైన దివ్యాయుధాలు చేసే మంగళాశాసనాన్ని హేతువు అని పలికే ఈసూక్తి- తిరుమఱ్లిశైప్పిరాన్ నాన్ముకన్ తిరువన్దాదిలో- **"ఆఙ్గు ఆరవార మదు కేట్టు అழలుమిழும் పూఙ్గారరవు"** (అక్కడ పరమపదంలో మంగళాశాసన సంరంభాన్ని విని ఆదిశేషుడు అస్థానే భయశంకతో అగ్నిని వెలువరిస్తాడు) అని పల్కిన సూక్తిని అనుసరించి పల్కినది. ఉపనిషత్తులో **"ఏతత్ సామ గాయన్ ఆస్తే హావు హావు హావు"** (ముక్తుడు సామగానాన్ని **హావు, హావు, హావు** - అని అంటూ చేస్తాడు) ఇత్యాదిగా తెలుపబడినట్లుగానే, నిత్యులు, ముక్తులు గొప్ప కంఠధ్వనితో

సామగానాన్ని చేసే సందడి నిరంతరంగా కొనసాగుతూ ఉండగా, శయనమై ఉండే ఆదిశేషుని చెవిలో ఆ సందడి వినబడగానే, అది సామగానఘోష- అనే సంగతిని మఱచి, అసురులు, రాక్షసులు హాని కల్గించడంకోసం ఈ నిత్యవిభూతిలో కూడా వచ్చి గొడవచేస్తున్నారు కాబోలు- అనే భ్రమకారణంగా కలత చెంది, వారు భగవానుని వద్దకు సమీపించలేని రీతిలో విషాగ్నిని వెలువరిస్తూ ఉన్నాడని కదా పూర్వం ప్రస్తావించిన పాశురం తెల్పింది. ఆ స్వభావం ఆదిశేషునకు ఒక్కనికే కాదు, దివ్యాయుధాలకు అన్నిటికీ సమానం. ఇది అన్యథాజ్ఞానప్రయుక్తం కదా! పరమపదంలో అన్యథాజ్ఞానానికి అవకాశం ఉన్నదా? అని కొందఱు శంకించ వచ్చు. దానికి అవకాశం లేని రీతిలో **"స్నేహాత్"** అని అన్నారు. జ్ఞానదశ –అని, ప్రేమదశ- అని రెండు దశలున్నాయి. **"జ్ఞానదశైయిల్ రక్ష్యరక్షకభావమ్ తన్ కప్పిలే కిడక్కుమ్", "పేమదశైయిల్ తట్టుమాఱి కిడక్కుమ్"** (జ్ఞానదశలో రక్ష్యరక్షక భావం యథాక్రమంలో ఉంటుంది. ప్రేమదశలో వ్యత్యస్తమవుతుంది.) అని శ్రీవచన భూషణంలో తెలుపబడడం గమనించాలి. సహజంగానే నిర్భయమైన పరమపదాన్ని ఒకానొక హేతువిశేషంచేత **"అభయమ్"** అని పల్కిన ఈ సూక్తి అక్కడ ఉండేవారి అభినివేశంలోని గొప్పతనాన్ని తెలుపడంలో పర్యవసిస్తుందని తెలియాలి.

ఇక, **"ఆనన్దైకార్ణవమ్"** అనేది చివరి విశేషణం. అపరిచ్ఛిన్నమైన ఆనందం ఒకటి తప్ప, వేఱొకటి ఏదీ లేని చోటు – అని దీని అర్థం. ఈ రీతిలో ఇటువంటి తిరుమామణి మండపాన్ని దివ్యదంపతులైన మీ ఇద్దరి దివ్యభోగానికి ఏకాంతమైన చోటుగా వేదాంతజ్ఞులు పల్కుతున్నారని తాత్పర్యం.

**25) తత్ర స్రక్స్పర్శగన్ధం స్ఫురదుపరి ఫణారత్నరోచిర్వితానం**
**విస్తీర్యానన్తభోగం తదుపరి నయతా విశ్వమేకాతపత్రమ్ ।**
**తైస్తైః కాన్తేన శాన్తోదితగుణవిభవై రర్హతా త్వామసహ్యైః**
**అన్యోఽన్యాద్వైతనిష్ఠాఘనరసగహనాన్ దేవి! బధ్నాసి భోగాన్ ॥**

దేవి = ఓ శ్రీరంగనాయకీ!, తత్ర = ఆస్థానమండపంలో, స్రక్ = పూలమాల వలె, స్పర్శ=సుకుమార స్పర్శను, గంధం = సుగంధాన్ని కల్గినది, స్ఫురత్ =ప్రకాశించే, ఉపరి = పైభాగంలో ఉండే, ఫణారత్న = (ఆదిశేషుని) పడగలలోని మణుల,

రోచిర్వితానం = కాంతులనే మేల్కట్టును కల్గినది అయిన, అనంతభోగం = ఆదిశేషుని శరీరాన్ని, విస్తీర్య = శయనంగా పఱచుకొని, తదుపరి = దానిపై (ఆసీనులై), విశ్వం= సమస్త జగత్తును, ఏకాతపత్రం = ఒకే గొడుగు (పాలన)లో ఉండేటట్లుగా, నయతా = (పాలనను) నడిపే, తైః తైః = ఆయా (ప్రసిద్ధాలైన), అసంఖ్యైః = లెక్కలేనన్ని, శాంత+ ఉదిత గుణవిభవైః = శాంతోదితదశ-అనే దశలోని గుణాల వైభవాలతో, త్వాం = నిన్ను ఉద్దేశించి (నీకు), అర్హతా = తగినవాడైన, కాంతేన = (నీ) ప్రియుడైన స్వామితో, అన్యోన్య = పరస్పరం, అద్వైతనిష్ఠా = ఒకటిగా ఉండే స్థితిచేత, ఘనరసగహనాన్ = అధికరసం నిండిన, భోగాన్ = అనుభవాలను, బధ్నాసి = చెందేటట్లు (అనుభవించేటట్లు) చేస్తున్నావు.

**వ్యాఖ్యానమ్** :- గడచిన శ్లోకంలో, పరమపదంలోని తిరుమామణి మండపాన్ని వర్ణించారు. ఆ మండపంలో సర్వశేషి అయిన భగవానునితో కలసి లక్ష్మీదేవి దివ్యభోగాలను అనుభవించే రీతినిగూర్చి ఈ శ్లోకంలో పల్కుతున్నారు.

**(దేవి!)** - ఓ శ్రీరంగనాయకీ !,

**(తత్ర)**- ఆ తిరుమామణి మండపంలో - అని అర్థం. **"అనంతభోగం విస్తీర్య"** అనే ప్రయోగంతో ఇది అన్వయిస్తుంది. ఆదిశేషుని శరీరాన్ని పడుకగా పఱచి- అని అర్థం. ఆ ఆదిశేషుని తిరుమేని ఎటువంటిది? అనే విషయాన్ని ఇక తెల్పుతున్నారు.

**(స్రక్స్పర్శగంధమ్)**- పూమాలికలలోని స్పర్శ, పరిమళంవంటి మృదుస్పర్శను, సుగంధాన్ని కల్గినది- అని అర్థం. దీనివల్ల సౌకుమార్యం, సౌగంధ్యం తెలుపబడ్డాయి. ఇంకా అనంతభోగం ఎటువంటిది ? అని అంటే,

**(స్ఫురదుపరి ఫణారత్నరోచిర్వితానమ్)** - పైన వ్యాపించి ఉండే మాణిక్యాల నుండి ప్రవహించే తేజఃపుంజాలే మేల్కట్టుగా అమరి ఉన్నవి. వితానమని ప్రత్యేకంగా ఏదీ పైన కట్టబడలేదు. ఆదిశేషుని ఫణాలలోని రత్నసమూహాలనుండి స్ఫురించే జ్యోతిర్మండలమే వితానం వలె ఉన్నదని తెలుపబడింది. ఈ రీతిలో ఇటువంటి,

**(అనంతభోగం విస్తీర్య)**- ఆదిశేషుని తిరుమేనిని పడుకగా పరచుకొని,

**(తదుపరి)**- దానిపై -అని అర్థం. ఇక్కడ **"నివిశ్య"**- అనే ల్యబంత పదాన్ని అధ్యాహరించుకోవాలి. ఆదిశేషునిపై వేంచేసి ఉండి- అని అర్థం.

**(విశ్వమేకాధిపత్యం నయతా)**- ఇది **"కాంతేన"** అనే పదానికి విశేషణం. **"పొఙ్గోదమ్ శూఖ్గ్న్ద పువనియుమ్ విణ్ణులకుమ్ అఙ్గాదుమ్ శోరామే ఆళ్కిన్ఱ ఎమ్బెరుమాన్"** (పొంగే సముద్రాన్ని చుట్టూ కల భూమిని, పరమపదాన్ని- వీటిలో ఏమీ చెదటిపోకుండా పాలించే స్వామి) అని, **"అకల్ విశుమ్బుమ్ నిలనుమ్ ఇరుళార్ విన్నై కెడ చ్చెఙ్గోల్ నడావుదిర్"** (విశాలమైన పరమపదాన్ని, భూమిని ఏ క్లేశం కలుగకుండా పాలిస్తున్నారు.) అని, **"వీఱ్ఱిరున్దేళులకుమ్ తనిక్కోల్ శెల్ల"** (సింహాసనంలో వేంచేసి ఉండి, ఏడు లోకాలలో తన ఆధిపత్యం చెల్లేటట్లుగా) అని పలికే రీతిలో ఉభయ విభూతులలో ద్వైరాజ్యం లేకుండా చేసి, ఏకాధిపత్యాన్ని చెలాయిస్తూ రక్షిస్తున్నాడు, శ్రీరంగనాథుడు (భగవానుడు). అతడు ఇంకా ఎటువంటివాడంటే-

**(అసంఖ్యైః తైస్తైః శాంతోదితగుణవిభవైః త్వామ్ అర్హతా)**- భగవానుని నేరుగా సంబోధించి పలికేటపుడు **"ఉనక్కేఱ్కుమ్ కోలమలర్ ప్పావైక్కు"** (నీకు తగిన, అందమైన లక్ష్మీదేవికి) అని అంటారు. లక్ష్మీదేవిని నేరుగా సంబోధించి పలికేటపుడు "నీకు తగిన అతడు" అని అంటారు. **"తుల్యశీలవయో వృత్తాం తుల్యాభిజనలక్షణామ్, రాఘవోఽర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా"** (సమానమైన శీలాన్ని, వయస్సును, వృత్తాన్ని కల్గినది, తుల్యమైన అభిజన, లక్షణాలను కల్గినదైన ఈ సీతకు నీవు తగినవాడవు. సీత నీకు తగినది) అని హనుమానుడు పల్కినట్లుగా పరస్పరం తగినవారుకదా, ఇరువురు.

**(శాంతోదితగుణవిభవైః)**- భగవచ్ఛాస్త్రాలలో (పాంచరాత్ర సంహితంలలో) భగవానునకు నిత్యోదితదశ- అని, శాంతోదిత దశ- అని రెండు స్థితులు చెప్పబడ్డాయి. ఇక్కడ విశేషంగా చెప్పవలసిన విషయాలున్నాయి. శ్రీరంగరాజస్తవం ఉత్తరశతకంలో **"యమాశ్రిత్యైవ... శాంతోదితదశః"** అనే సందర్భంలో వివరంగా అవి తెలుపబడ్డాయి. ఇక్కడ సంగ్రహంగా తెలుపబడుతున్నవి. భగవానుడు తన వైశ్వరూప్యాన్ని అనుభవించే దశ అయిన శాంతోదితదశకు తగిన గుణాతిశయాలతో,

**(త్వామ్ అర్హతా)** నీకు తగినవాడు. ఆ కల్యాణగుణాలు ఎటువంటివి?- అని అంటే,

(అసంఖ్యైః)– లెక్కలేనివి.

(త్రైస్త్రైః)– ఈ విశేషణానికి అనిర్వచనీయాలని అర్థం. "అటువంటివి" అని అనవచ్చు. అంతేతప్ప, ఇటువంటి ప్రకారవిశేషాన్ని కల్గినవి– అని నోరుతెరచి వర్ణించడానికి వీలు కానివి– అని భావం. అందువల్ల, ఇటువంటి గుణాతి శయాలతో నీకు తగి ఉండే,

(కాంతేన సహ) – అళ్గకియమణవాళన్‌తో – రమ్యజామాతతో పాటు (అళ్గకియ మణవాళన్– అని శ్రీరంగనాథునకు పేరు)

(అన్యోన్యాద్వైతనిష్ఠాఘనరసగహనాన్ భోగాన్ బధ్నాసి) – మిక్కిలి ఘనమైన భోగ్యతయే మూర్తీభవించిన దివ్యభోగాలను అనుభవిస్తున్నావు. ఆ భోగాను భవాలను అనుభవించే సమయంలో మీ ఇద్దరి మధ్యలో పరస్పరం వ్యక్తిభేదాన్ని కూడా గమనించడం అరుదైన రీతిలో ఉంటుంది. ఇద్దఱు ఒకే వ్యక్తి అనే రీతిలో ఒకే నీరుగా కలసి అనుభవించే భోగాలనుగూర్చి పల్కిన రీతి ఇది. అభిప్రాయంలో కొంచెం కూడాతేడా లేకుండా కలసి అనుభవించే రీతిని తెల్పినట్లయింది. రెండవ పాదంలో "విశ్వమేకాతపత్రమ్" అనే పాఠభేదం ఉన్నది.

**26) భోగ్యా వామపి నాన్తరీయకతయా పుష్పాఙ్గరాగై స్సమం**
**నిర్వృత్తప్రణయాతివాహనవిధౌ నీతాః పరీవాహతామ్ ।**
**దేవి! త్వామను నీళయా సహ మహీదేవ్య స్సహస్రం తథా**
**యాభి స్త్వం స్తనబాహుదృష్టిభిరివ స్వాభిః ప్రియం శ్లాఘసే ॥**

దేవి = శ్రీరంగనాయకీ!, వామ్+అపి = మీ ఇద్దఱికి, పుష్ప+అంగరాగైః సమం= పూలతో, ఒంటికి పూసికొనే చందనం మొదలైన మైపూతలతో సమానంగా, నాంత రీయకతయా = నిన్ను విడచి ఉండకుండా అవినాభావంగా ఉండేవారైనందున, భోగ్యాః = ప్రియమైనవారు, నిర్వృత్త = పూర్ణమైన, ప్రణయ+అతి వాహనవిధౌ=ప్రేమ అధికంగా పెల్లుబికి బయట వచ్చేటట్లు చేసే క్రమంలో, పరీవాహతాం = కాలువలుగా (తూములుగా) ఉండే స్థితిని, నీతాః = పొందింపబడినవారు, త్వామ్ అను = నిన్ను అనుసరించి, నీళయా సహ = నీళాదేవితో పాటుగా, మహీ=భూదేవి, తథా = అదే రీతిలో, సహస్రం= వేల సంఖ్యలోని, దేవ్యః = దివ్య పత్నులు (ఉన్నారు), త్వం = నీవు, యాభిః = ఏ దివ్యపత్నులచేత, స్వాభిః = నీకు చెందినవి అయిన, స్తనబాహుదృష్టిభిః

ఇవ = స్తనాలు, బాహువులు, నేత్రాలు - అనే వానితోవలె, ప్రియం = నీ ప్రియుడైన భగవానుని, శ్లాఘసే = ఆనందింపజేస్తున్నావో (అటువంటి దివ్యపత్నులు వేలాదిగా ఉన్నారు)

**వ్యాఖ్యానమ్ :-** లోకంలో, ఒక వ్యక్తికి ఇద్దఱు భార్యలుంటే, వారిలో పరస్పరమాత్సర్యం కలిగి అది క్రమంగా వృద్ధి పొందడాన్ని గమనిస్తున్నాము. భగవానుని చూస్తే, **"తక్కార్ పలర్ దేవిమార్ శాల వుడైయార్"** (తగిన దేవేరులు చాలా మంది ఉన్నారు) అనే రీతిలో **"పదినాఱు పల్లాయిరమెణ్ణిఱన్ద పెరున్దేవిమార్"** (పదహాఱువేల మంది, ఇంకా లెక్కలేనంతమంది గొప్ప దేవేరులను) కలవాడై ఉన్నాడు. వారిమధ్య (వర్తనం) పరిచరణం ఏ విధంగా ఉంటుంది? అనే విషయం వక్తవ్యాంశాలలో ఒకటి కనుక, అది ఈ శ్లోకంలో తెలుపబడుతున్నది. పొయ్కై ఆౘ్వార్ ముదల్ తిరువన్దాదిలో **"తిరుమకళుమ్ మణ్మకళుమ్ ఆయ్మకళుమ్ శేర్న్దాల్ తిరుమకట్కే తీర్న్ద వాఱు ఎన్కొల్?.. మాలోదవణ్ణర్ మనమ్"** అనే ఒక పాశురాన్ని అనుగ్రహించారు. ఈ పాశురాన్ని అనన్దాౘ్వాన్ ఒక విధంగా నిర్వహించారని, భట్టర్ ఇంకొక విధంగా నిర్వహించారని ఆ సందర్భంలోని వ్యాఖ్యానంలో అనుగ్రహింపబడింది. అనన్దాౘ్వాన్ (అనంతార్యులు) నిర్వహించిన రీతి ఏమంటే - **"తిరుమకట్కే తీర్న్ద వాఱు ఎన్కొల్?"** అనే ప్రయోగాన్ని ఉపలక్షణం చేసి, **"తిరుమకట్కే తీర్న్ద వాఱు ఎన్కొల్?, మణ్మకట్కే తీర్న్ద వాఱు ఎన్కొల్? ఆయ్మకట్కే తీర్న్ద వాఱు ఎన్కొల్?"** అని అన్వయించి, సౌభరి యాభై రూపాలను ధరించి, యాభైమంది పత్నులపట్ల ఒకే రీతిలో కలసి వర్తించి, ఆనందించినట్లుగా, భగవానుడు ఒక్కొక్క దివ్యమహిషితోను ఏ భేదం - అంతరం - లేకుండా ఒకే నీరు కలిసినట్లుగా కలసి, వర్తించిన రీతి తెలుపబడినదని అనన్దాౘ్వాన్ చేసిన అర్థనిర్వాహం. ఇక, భట్టర్ అర్థనిర్వాహం ఈ శ్లోకంలో తెలుపబడినరీతిలోనే చేయబడింది. లోకంలో అనుభోక్తలు, దివ్యపీతాంబరాలు, దివ్యభూషణాలు, పుష్పాలు, చందనం మొదలైనవానిని వినియోగ పఱచుకొనే టపుడు, ఆ పీతాంబర భూషణాదులలో పరస్పర మాత్సర్యం ఏమీ ఉండదు కదా! అనుభవంలో అవి అన్నీ ఉపకరణకోటిలోకి అన్వయిస్తాయి; అంతేకదా! మఱి ఇక, ఏ విశేషాన్ని వాటిలో చూడము. స్తనాలు, బాహువులు, నేత్రాలు మొదలైన దివ్యావయవాలలో అభినివేశాన్ని పొందేటపుడు, ఒక్కొక్క దివ్యాంగంపట్ల అభినివేశాన్ని పొందేటపుడు

ఇంకొక దివ్యాంగం దానితో స్పర్ధిస్తున్నట్లుగా కన్పించదు. ఇవి అన్నీ అచేతన పదార్థాలు కనుక అవి మాత్సర్యాన్నిగాని, స్పర్ధను గాని పొందే కారణంలేదు. **"తనక్కేయాక ఎన్నై క్కొళ్ళుమీదే ఎనక్కే కణ్ణనై యాన్‌కొళ్ శిఱప్పే"** (నీకోసమే నన్ను గ్రహించు) అని **"ఎమ్మావీట్టు"** దశకంలో ఆ/ళ్వార్లు అనుగ్రహించి నది అచిద్వత్ పారతంత్ర్యమే కనుక, అటువంటి పారతంత్ర్యసీమాభూమిలో నిలచి ఉండే దివ్యదేవేరులు పరస్పరం మాత్సర్యాన్ని, స్పర్ధను పొందకుండా, కలసి పరిచర్య చేరే రీతి తెలుపబడుతున్నది, ఈ శ్లోకంలో. భగవానుడు ఒక దేవేరితో సంశ్లేషించే టపుడు, మిగిలిన దేవేరులు ఉపకరణకోటిలో నిలచి, ఆనందిస్తారు. ఇందువల్ల సపత్నీసౌహార్దవైభవం తెలుపబడినట్లయినది.

**(వామపి నాంతరీయకతయా)**- **"నాంతరీయక"** మంటే - ఉపకరణం. భగవానుడు, లక్ష్మీదేవి కలసి ఆనందించేటపుడు మిగిలిన దేవేరులు కుసుమ, చందనాదులవలె ఉపకరణకోటిలో అన్వయిస్తారు.

**(నిర్వృత్తప్రణయాతివాహనవిధౌ నీతాః పరీవాహతామ్)**- చెఱువులో నీరు నిండితే, అది కట్టలు తెంచుకోకుండా, దాని పరిమితిలో నీరు లోపల ఇమిడి ఉండేటట్లుగా, తూములను (కలుజులను) తెరచి, ఆ చెఱువులోని పరిమితికి మించిన నీటిని బయటకు విడిచే రీతి ఉన్నది కదా! చెఱువు లోపల తేటపడే నీరు, బయటకు ప్రవహించి వచ్చే నీరు - రెండు ఒకటే. ఇవి పరస్పరం బుద్ధి భేదాన్ని పొందవు. "మమ్ములను బయటకు గెంటివేశారుకదా" అని ప్రవాహం జలం కోపించదు. "మనం లోపలే ఉండిపోయాము కదా" అని చెఱువు లోపల నిలచి ఉండే జలం ఆనందించదు. అదే రీతిలోనే ఇక్కడకూడా గ్రహించాలి. చెఱువులో నిలచి ఉండే నీటిస్థానంలో లక్ష్మీదేవిని గ్రహించాలి. పరీవాహంగా బయటకువెలువడే జలంయొక్క స్థానంలో మిగిలిన దివ్యదేవేరులను గ్రహించాలి. **"పూరేత్పీడే తటాకస్య పరీవాహః ప్రతిక్రియా"** (చెఱువు నిండినపుడు, ఆ చెఱువులోని నీటిని తూములద్వారా బయటకు విడువడమే దానికి ప్రతిక్రియ) అని ఉత్తరరామచరితశ్లోకం ఇక్కడ భావ్యం. ఇందువల్ల అపరిమితజలపూర్తిలో పరీవాహక్రియ అత్యంతావశ్యకమైనట్లే, దివ్యదంపతుల ఉత్కూలభోగంలో మిగిలిన దివ్యదేవేరులుకూడా అత్యంతం ఆవశ్యకమైనవారు- అని తాత్పర్యం.

ఇటువంటి దివ్యదేవేరులు ఎవరు? అంటే, అది శ్లోకంలోని మూడవ పాదంలో తెలుపబడుతున్నది-

**(దేవి! త్వా మనునీళయా సహ మహీ దేవ్య స్సహస్రం తథా)**- అని అంటూ. లక్ష్మీదేవి ప్రధానభోగ్యకోటిలో నిలుస్తుంది. భూదేవి, నీళాదేవి, ఇంకా మిగిలిన అసంఖ్యాకలైన దివ్యదేవేరులు ఆమెను అనుసరించి ఉంటారు. **"పల్లాయిరమ్ పెరుమ్ దేవిమారొడు పౌవమెఱి తువరై ఎల్లారుమ్ శూழ చ్చిజ్గాశనత్తే యిరున్దానై"** (పలువేల మంది దేవేరులతో సముద్రంలోని ద్వారకలో అందఱు పరివేష్టించి ఉండగా సింహాసనంలో వేంచేసి ఉన్నాడు.) అని, **"పదినాఱాయిరవర్ దేవిమార్ పణి శెయ్య త్తువరై ఎన్నుమదిల్. నాయకరాకి వీற்றிరున్ద మణవాళర్"** (పదహారువేల మంది దేవేరులు సేవ చేయగా ద్వారకలో నాయకుడై వేంచేసి ఉండే పెండ్లికొడుకు) అని, **"తక్కార్ పలర్ దేవిమార్ శాలయుడైయార్"** (తగిన పలువురు దేవేరులను చాలా మందిని కలవాడు) అని గల పాశురాలు ఇక్కడ అనుసంధేయాలు.

ఈ (మిగిలిన) దివ్యదేవేరులను లక్ష్మీదేవి ఏవిధంగా సంభావిస్తుంది? అని అంటే, ఆ విషయం తెలుపబడుతున్నది; నాల్గవ పాదంలో-

**(యాభి స్త్వం స్తనబాహుదృష్టిభిరివ స్వాభిః ప్రియం శ్లాఘసే)**- అని అంటూ. లక్ష్మీదేవి తన స్తనభుజాదులనే అవయవాలుగానే మిగిలిన దేవేరులను భావిస్తుంది. **"శ్లాఘసే"** అనే పదానికి- **"రమయసే"** (ఆనందింపజేస్తావు)- అని తాత్పర్యం.

**27) తే సాధ్యా స్సన్తి దేవా జనని! గుణవపుర్వేషవృత్తస్వరూపైః**
**భోగైర్వా నిర్విశేషా స్సవయస ఇవ యే నిత్యనిర్దోషగన్ధాః ।**
**హే శ్రీః! శ్రీరఙ్గభర్తు స్తవ చ పదపరీచారవృత్త్యై సదాపి**
**ప్రేమప్రదాణభావావిలహృదయ హఠాత్కారకైఙ్కర్యభోగాః ॥**

జనని = తల్లీ!, శ్రీః = ఓ శ్రీరంగనాయకీ!, యే = ఎవరు, గుణ = కల్యాణ గుణాలతో, వపుః=దివ్యరూపాలతో, వేష=వేషాలతో, వృత్త=ప్రవర్తనలతో, స్వరూపైః= స్వరూపాలతో, భోగైః వా = లేక, అనుభవాలతో, నిర్విశేషాః = ఏ విధమైన భేదం లేనివారు, (అందువల్లనే), సవయసః ఇవ = సమానమైన వయస్సును కల మిత్రుల వంటివారో, నిత్య = ఎల్లప్పుడు, నిర్దోషగంధాః = దోషగంధాన్ని ఏమాత్రం లేనివారో,

సదా అపి=ఎల్లప్పుడూ కూడా, ప్రేమ = భక్త్యతిశయంచేత, ప్రదాణ = కలిగిన, భావ+అవిల = మనోవికారంవల్ల, ఆవిల = ఆర్తిని-కలతను - పొందిన, హృదయ = హృదయాలతో, హఠాత్కార = బలాత్కారంగా వెనువెంటనే చేసే, కైంకర్య భోగాః = కైంకర్యమనే అనుభవాన్ని కలవారో, ప్రీతికారితకైంకర్యాలను హృదయ పూర్వకంగా, తక్షణం చేస్తున్నారో, అటువంటి, ఆ = ఆ, సాధ్యాః దేవాః = సాధ్యులు-అనగా-నిత్యసూరులు, శ్రీరంగభర్తుః = శ్రీరంగనాథునకు, తవ చ = నీకు, పదపరీచారవృత్త్యై= (మీ ఇరువురి) శ్రీపాదాలను సేవించే కైంకర్యంకోసం, సంతి= ఉన్నారు.

వ్యాఖ్యానమ్ :- ఈ శ్లోకంద్వారా పరిచారకప్రభావాన్ని తెల్పుతున్నారు.

(జనని)- తల్లివి అయిన శ్రీరంగనాయకీ !,

(తే సాధ్యా స్సంతి దేవాః)- "యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః" (ఎక్కడ పురాతనులైన నిత్యసూరులున్నారో) అనే శ్రుతివాక్యాన్ని అనుసరించి ఇది ప్రయోగింపబడింది. అపరిమితమైన నిత్యముక్తులు పరిచారకులుగా వెల్గొందు తున్నారు. వారు ఎటువంటివారై ఉన్నారు? అని అంటే,

(గుణవపుర్వేషవృత్తస్వరూపైః)- ఇత్యాదిగా వారి గొప్పతనం తెలుపబడు తున్నది.

(నిత్యనిర్ధోషగంధాః)- "మాయవన్ శేౕఱ్ఱళ్ళల్ పొయ్న్నిలత్తే" (వంచించే, బలిష్ఠమైన బురదవంటి, అసత్తు అనదగిన ప్రకృతిలో) పడి ఉండడమనే దోష గంధాన్ని లేనివారు.

(గుణవపుర్వేషవృత్తస్వరూపైః భోగై ర్వా నిర్విశేషాః)- అపహతపాప్మత్వాది గుణాలు, దివ్యమంగళరూపం, శంఖచక్రాదులను ధరించి ఉండడమనే వేషం, అజ్ఞానుగ్రహాదివ్యాపారాలు, జ్ఞానానందామలత్వాది ఆత్మస్వరూపం- భగవదనుభవ, విభూత్యనుభవాలు-అనే వీటిలో కొంచెంకూడా తారతమ్యం లేకుండా ఉంటారు. "పరమం సామ్యముపైతి" (భగవానునితో పరమసామ్యాన్ని ముక్తుడు పొందు తున్నాడు) అని అంటూ ఉపనిషత్తు పల్కిన క్రమంలో పరమసామ్యాన్ని పొందినవారై ఉండేవారని భావం. "నిర్విశేషాః" అనే పదానికి కొంచెంకూడా తారతమ్యం లేనివారని భావం. దివ్యదంపతులైన మీతో, తమతో (పరస్పరం) భేదం లేనివారని తాత్పర్యం. అందువల్లనే.

(సవయస ఇవ)- సమానవయస్కుల వలె - సఖులవలె ఉంటారు. వీరు ఎందుకోసం ఉన్నారు? అని అంటే,

(సదా౽పి శ్రీరంగభర్తుః తవ చ పదపరీచారవృత్త్యై)- నీకు, నీవల్లభునకు నిత్యకైంకర్యాలను చేయడంకోసమే వారి సత్త ఉన్నది. **"దేవిమారావార్ తిరుమకళ్ పూమి యేవ మఱ్ఱమరర్ ఆట్చెయ్‌వార్"** (దేవేరులైన లక్ష్మీదేవి, భూదేవి ప్రేరేపించగా మిగిలిన నిత్యసూరులు కైంకర్యం చేస్తారు) అనే తిరువాయ్‌మొழி పాశురం ఇక్కడ అనుసంధేయం.

ఇతరులకు సేవ చేయడం అనేది లోకంలో దుఃఖరూపంగా ఉంటుంది కనుక, వారికి కూడా ఇది దుఃఖాత్మకంగా ఉంటుందా? - అని అంటే, **"ఉఱ్ఱేన్ ఉకన్దు పణి శెయ్‌దు"** (నిన్ను పొందాను. ఆనందంచి కైంకర్యం చేసి) అనే రీతిలో మనస్సు లోపల పండిన అద్వితీయమైన ప్రీతితో మనస్సు కరగిపోయిన సమయంలో కైంకర్యం చేస్తే తప్ప నిలువలేని స్థితిని పొంది, ప్రేమబలాత్కారంతో కైంకర్యాన్ని చేసేవారు కనుక, దానినే భోగంగా తలచినవారు - అని భావం. ఈ విధంగా ఇటువంటి **"సాధ్యాః దేవా స్సంతి"** (సాధ్యులనబడే నిత్యసూరులున్నారు.)

"ప్రేమప్రద్రాణభావ"- ప్రేమవల్ల పండిన స్థితిని పొంది, **"ఆవిలహృదయ"** జ్ఞానవిపాకకార్యమైన అజ్ఞానంతో కలత పొందిన మనస్సుతో ఉండేవారని భావం. వీరు "స్నేహాదస్థానరక్షావ్యసను"లుకదా !

**28) స్వరూపం స్వాతన్త్ర్యం భగవత ఇదం చన్ద్రవదనే!**
**త్వదాశ్లేషోత్కర్షా ద్భవతి ఖలు నిష్కర్షసమయే ।**
**త్వమాసీః మాత శ్శ్రీః! కమితు రిదమిత్థంత్వవిభవః**
**తదన్తర్భావాత్ త్వాం న పృథగభిధత్తే శ్రుతిరపి ॥**

చంద్రవదనే = చంద్రునివంటి ముఖాన్ని కల్గిన ఓ శ్రీరంగనాయకీ!, మాతః= తల్లీ! శ్రీః = లక్ష్మీ! నిష్కర్షసమయే = తీర్మానం-నిర్ణయం - చేసేటపుడు, భగవతః= భగవానునియొక్క ఇదం = ఈ, స్వరూపం = స్వరూపం, స్వాతంత్ర్యం = స్వాతంత్ర్యం, త్వత్ = నీయొక్క ఆశ్లేష+ఉత్కర్షాత్ = సంబంధంయొక్క అతిశయంచేత - గొప్పతనం చేత, భవతి ఖలు = కల్గుతున్నది కదా! కమితుః = నీకు మిక్కిలి ఇష్టుడైన భగవానునకు,

త్వం = నీవు, ఇదమ్+ఇత్థంత్వ విభవః = ఇతడు ఇటువంటివాడు" - అవే గొప్పతనంగా, ఆసీః = అయినావు (నిరూపకవు అయినావు, శ్రుతిః = వేదం, త్వామ్ అపి = నిన్నుకూడా, తత్+అంతర్భావాత్ = "ఇతడు ఇటువంటివాడు" అనే గొప్పతనంలో నీవు అంతర్భవించి ఉండడంచేత, పృథక్ = ప్రత్యేకంగా, న అభిధత్తే = నిన్ను గూర్చి పలుకడం లేదు. (ధర్మి అయిన భగవానుని తెలుపడంద్వారా ధర్మభూతురాలవైన నిన్ను తెలిపినట్లే అవుతుంది కనుక, వేదం నిన్ను ప్రత్యేకంగా వర్ణించలేదు)

**వ్యాఖ్యానమ్ :-** లక్ష్మీదేవి భగవానునకు స్వరూపనిరూపకధర్మమై ఉండే రీతిని ఈ శ్లోకంలో అనుగ్రహిస్తున్నారు.

**(చంద్రవదనే ! మాతః ! శ్రీః !)**- దాసులను ఆనందింపజేయగల్గిన ముఖాన్ని కల్గిన తల్లీ ! లక్ష్మీదేవీ !,

**(నిష్కర్షసమయే)**- శాస్త్రార్థాలను నిష్కర్షించి పలికే సమయంలో- అని అర్థం. శాస్త్రార్థాలను వివేకించి పల్కడం ఏవిధంగా? అని అంటే,

**(భగవతః ఇదం స్వరూపం స్వాతంత్ర్యం త్వదాశ్లేషోత్కర్షాత్ ఖలు భవతి)**- నీతో గల చేరికచేతనే భగవానునకు స్వాతంత్ర్యమనే స్వరూపం సిద్ధిస్తున్నది. ఇదే శాస్త్రార్థనిష్కర్షం - అని అంటున్నారు. భగవానునకు అనన్యాధీనసత్తాకమైన స్వరూపం ఈమెకు అధీనమని అనడం తగునా ? - అని అంటే, దానికి తగిన ఉపపత్తి మూడవ పాదంలో తెలుపబడుతున్నది.

**(కమితుః ఇదమిత్థంత్వవిభవః త్వమ్ ఆసీః)**- భగవానునకు నీవే ఇదంత్వవిభవంగా, ఇత్థంత్వ విభవంగా ఉన్నావు. అంటే- **"తిరువిల్లా త్తేవరై తేవరల్లారై త్తేతేల్ మిన్ తేవు"** (లక్ష్మిని లేని అవరదైవాలను పరదైవంగా కొలువ వద్దు) అని అంటూ తిరుమఝిశైయాళ్వార్లు అనుగ్రహించినందువల్ల, **"అయమ్ ఈశ్వరః"** అని విశేష్యనిర్దేశాన్ని చేసేటపుడు లక్ష్మీపురస్సరంగానే చేయవలసి ఉన్నది. **"శ్రియఃపతిః"** అని, **"తిరుమాల్"** అని చెప్పవలసి ఉన్నది. భగవానుని వద్ద లక్ష్మీదేవిని చూస్తే తప్ప "ఇతడు సర్వేశ్వరుడు" అని చెప్పడం లేదు. ఆ రీతిలోనే భగవానునకు లక్షణం చెప్పవలసి వస్తే శ్రియఃపతిత్వమే లక్షణంగా చెప్పబడు తున్నది. అందువల్ల ఇటువంటి స్వరూపాన్ని పురస్కరించుకొని **"కమితు రిదమిత్థంత్వవిభవః త్వమాసీః"** అని అనడం చాలా పొసగుతుంది.

శ్లోకంలో మొదటి మూడు పాదాలలో పల్కిన అర్థాన్ని నాల్గవ పాదం స్థిరీకరిస్తున్నది -

**(తదంతర్భావాత్ త్వం న పృథగభిధత్తే శ్రుతిరపి)**- అని అంటూ. పిరాట్టిని (లక్ష్మీదేవిని) గూర్చి పలుకడానికి శ్రీసూక్తం అనే ఒక భాగం కన్పిస్తున్నా, **"కర్వైకట్టాక్కావేరి"** వలె అంతు లేకుండా ఉండే వేదంలో లక్ష్మీదేవినిగూర్చి ప్రత్యేకంగా ఎందువల్ల పలుకలేదు? అని సందేహించేవారికి సమాధానమైన రీతిలో, ఆ భగవానునిలో లక్ష్మీదేవి అంతర్భవించినందున, అతనిని పల్కిన చోటు అంతా లక్ష్మీదేవినికూడా పల్కినట్లే - అనే కారణంతో ప్రత్యేకంగా వేదం ఆమెను గూర్చి పలుకలేదు- అని భావం.

**29) తవ స్పర్శాదీశం స్పృశతి కమలే! మఙ్గళపదం**
**తవేదం నోపాధే రుపనిపతితం శ్రీరసి యతః ।**
**ప్రసూనం పుష్యన్తీమపి పరిమళర్ధిం జిగదిషుః**
**న చైవన్త్వా దేవం స్వదత ఇతి కశ్చిత్కవయతే ॥**

కమలే = లక్ష్మీదేవీ!, తవ = నీయొక్క, స్పర్శాత్ = స్పర్శవల్ల, మంగళపదం= మంగళమనే శబ్దం, ఈశం = భగవానుని, స్పృశతి = స్పృశిస్తున్నది (తెల్పుతున్నది), ఇదం = ఈ మంగళంపదం, తవ = నీకు, ఉపాధేః = ఏదో ఒక కారణంవల్ల, న ఉపనిపతితం = వచ్చినది కాదు, యతః = ఎందువల్ల? అంటే, శ్రీః = మంగళం గానే, అసి = నీవు (ఎల్లప్పుడు) ఉన్నావు. ప్రసూనం = పూవును, పుష్యంతీమ్ = అతిశయాన్ని కలుగజేసే, పరిమళ+ఋద్ధిమ్ అపి = సువాసనయొక్క సమృద్ధి కూడా, జగదిషుః = వర్ణించగోరేవాడైన, కశ్చిత్ = ఒకడు (కవి), ఏవంత్వాత్ = ఈ విధంగా ఉండడంవల్ల, ఏవం=ఈవిధమైన సువాసనయొక్క సమృద్ధి పూవుకు కల్గింది-అని, న చ కవయతే = వర్ణించడం లేదు కదా. (సువాసన పూవు గొప్పతనానికి కారణంగా వర్ణింపబడు తున్నదే తప్ప, ఆ సువాసనకు వేరొక గొప్పతనం వర్ణింపబడడం లేదు కదా)

వ్యాఖ్యానమ్ :- అక్కడక్కడ ప్రమాణవచనాలలో భగవానుని మంగళపదంతో నిర్దేశించడం కన్పిస్తుంది. **"మంగళం భగవాన్ విష్ణుః మంగళం మధుసూదనః, మంగళం పుండరీకాక్షో మంగళం గరుడధ్వజః"** అని, **"పవిత్రాణాం పవిత్రం యో మంగళానాం చ మంగళమ్"** అని మొదలైన ప్రయోగాలలో ఆ విషయం

కన్పిస్తుంది. ఆ విధంగా భగవానుని పట్ల మంగళపదప్రయోగం చేయబడడం లక్ష్మీదేవియొక్క సంబంధంవల్లనే- అని, లక్ష్మీదేవికి అది నిరుపాధికమని ఇందులో అనుగ్రహిస్తున్నారు.

**(కమలే ! ఈశమ్ తవ స్పర్శాత్ మంగళపదం స్పృశతి)**- ఓ శ్రీరంగనాయకీ! సర్వేశ్వరుడైన భగవానుని ఉద్దేశించి మంగళపదప్రయోగం చేయబడడం అనేది నీ సంబంధనిబంధనమే సుమా!- అని భావం. **"ఐశ్వర్యం యదశేషపుంసి యదిదం సౌందర్యలావణ్యయోః రూపం యచ్చ హి మంగళం కిమపి యల్లోకే సదిత్యుచ్యతే, తత్సర్వం త్వదధీనమేవ"** (లోకంలో పురుషులందరిలోని ఐశ్వర్యం, సౌందర్య లావణ్యాల రూపం, మంగళమనబడేది ఏ వస్తువు అయినా, లోకంలో మంచిది అనబడేది ఏది అయినా- ఇది అంతా నీ అధీనమే) అని అంటూ శ్రీస్తవంలో పల్కిన రీతిలోనే లక్ష్మీదేవి మంగళస్వరూపిణికనుక, ఈమెతో సంబంధంవల్లనే భగవానునకు మంగళపదవాచ్యత్వం ఏర్పడుతున్నది- అని అనడం యుక్తమే.

దీనికిపైన ఒక సందేహం కలుగవచ్చు- భగవానునకు కల మంగళపద వాచ్యత్వం లక్ష్మీసంబంధమైనట్లే, ఈమెకు గల మంగళశబ్దవాచ్యత్వం ఇతరసంబంధ నిబంధనమై ఉన్నదా ? అని. ఆ సందేహానికి తావు లేదు- అనే విషయాన్ని ఈ శ్లోకం రెండవ పాదం తెల్పుతున్నది.

**(ఇదమ్ తవ ఉపాధే రుపనిపతితం న)**- నీకుఈ మంగళ పదం ఔపాధికం కాదు- ఇతరసంబంధనిబంధనం కాదు- అని. ఈ విధంగా పల్కిన విషయాన్ని ఉపపాదిస్తున్నది.

**(శ్రీరసి యతః)**- అనే పదం. **"యతః త్వం శ్రీరసి, తత ఏవ ఇదమ్ తవ ఉపాధేః నోపనిపతితమ్"** అని అన్వయించాలి. సహజంగానే నీవు మంగళమనే పేరును పొందినదానవు కనుక, స్వాభావికమైన దీనిని ఔపాధికమని అనడానికి ప్రసక్తి లేదు- అని భావం. ఇది ఉత్తరార్ధంలో ఒక దృష్టాంతంతో నిరూపిస్తున్నారు.

**(ప్రసూనం పుష్యంతీమపి)**- ఇత్యాదిగా. ఈ సూక్తి భావం ఏమంటే- లోకంలో పుష్పానికి అతిశయం పలికేటపుడు "పరిమళంవల్ల కలిగే గొప్పతనం ఇది" అని అంటారు. మల్లెపూవు, సంపెంగ పూవు, పొగడపూవు మొదలైనవానిని

గొప్పవి–అని పల్కినపుడు వానిలో గొప్ప పరిమళం ఉండడమే దానికి కారణమని అంటాము. దీనికి పిమ్మట, పరిమళం దేనివల్ల కల్గుతున్నది ? – అనే ఇంకొక సందేహం కలుగదు. దానికొక కారణంకూడా చెప్పబడడం లేదు. "పరిమళం గొప్పది" అనే మాట సహజంగానే లోకం తెలిసిన విషయం. దానికి ఇంక దేనివల్ల అతిశయం కలుగదు. పుష్పానికి గల అతిశయాన్ని గూర్చి పలికేటపుడు దాని పరిమళాన్ని పురస్కరించుకొని చెప్పాలి; భగవానునకు అతిశయాన్ని లక్ష్మిని పురస్కరించుకొని పలకాలి; పరిమళానికి గల అతిశయం స్వతస్సిద్ధం అనేది ఎటువంటిదో, ఆవిధంగానే లక్ష్మికి అతిశయం స్వతస్సిద్ధం– అని చెప్పబడినట్లయినది.

**(ప్రసూనం పుష్యంతీ మపి పరిమళర్ధిమ్)** – పుష్పానికి అతిశయం కల్గించేది పరిమళసంపదయే అయినా– అని అర్థం.

**(తాం జగదిషుః కశ్చిత్ ఏవంత్వాత్ ఏవం స్వదతే ఇతి న హి కవయతే)**– ఆ పరిమళసంపత్తుయొక్క గొప్పతనాన్ని వర్ణించదలచినవాడు దానికి ఇంకొక కారణాన్ని దేనినీ చెప్పడం లేదు – అని భావం.

**30) అపాఙ్గా భూయాంసో యదుపరి పరం బ్రహ్మ తదభూత్**
**అమీ యత్ర ద్విత్రా స్స చ శతమఖాది స్తదధరాత్ ।**
**అతశ్శ్రీ! రామ్నాయ స్తదుభయ ముశంస్త్వాం ప్రణిజగౌ**
**ప్రశస్తి స్సా రాజ్ఞో యదపి చ పురీకోశకథనమ్ ॥**

శ్రీః = లక్ష్మీస్వరూపిణివి అయిన శ్రీరంగనాయకీ!, భూయాంసః = అధికమైన, అపాంగాః = (నీ) కటాక్షాలు, యత్+ఉపరి = దేనిపైన (పడుతున్నాయో), తత్=అది, పరం బ్రహ్మ = పరతత్త్వం, అభూత్ = అయినది, యత్ర = ఎవనిపైన, అమీ = ఈ కటాక్షాలు, ద్విత్రాః = రెండు, మూడు మాత్రం పడినవో, స చ = అతడు. అయితే, తత్+అధరాత్=ఆ పరతత్త్వం కంటే తక్కువవాడైన, శతమఖాదిః = ఇంద్రుడు మొదలైనవారుగా, అభూత్ = అయినాడు, అతః = అందువల్ల, తత్= ఆ, ఉభయం = పరంబ్రహ్మ, అంతకంటే తక్కువవారైన ఇంద్రాదులు – అనే వీరిద్దరిని, ఉశన్ = పేర్కొనే, ఆమ్నాయః = వేదం, త్వాం = నిన్ను, ప్రణిజగౌ= చక్కగా పల్కింది, (ఏవిధంగా? అంటే), పురీ = నగరంయొక్క, కోశ = కోశాగారం యొక్క, కథనం =

వర్ణన అనేది యత్ + అపి = ఏది ఉన్నదో, సా చ = అదికూడా, రాజ్ఞః ప్రశస్తిః = ప్రభువు యొక్క పొగడ్తయే (ప్రభువును పొగడినట్లే కాగలదు).

**వ్యాఖ్యానమ్ :-** పూర్వం 28వ శ్లోకంలో **"త్వాం న పృథగభిధత్తే శ్రుతి రపి"** అని లక్ష్మీదేవిని వేదం ప్రత్యేకంగా చెప్పలేదు- అని అన్నారు కదా! ఇందులో. వేదం, ఒక విధంగా లక్ష్మిని గూర్చి పల్కుతున్నది- అనే విషయాన్ని నిరూపిస్తున్నారు. పరబ్రహ్మ గాని, లోకపాలకులు గాని- ఎవరైనా లక్ష్మీకటాక్షవిశేషంతో సత్తను పొందినవారైనందున, అటువంటివారి వైభవాన్ని పలికే వేదం లక్ష్మినిగూర్చి కూడా పల్కినది కావడంలో లోటు లేదు- అని అంటున్నారు.

**(శ్రీః ! తవ భూయాంసః అపాంగాః యదుపరి(పతితాః) తత్ పరం బ్రహ్మ అభూత్)-** ఓ శ్రీరంగనాయకీ! నీ గొప్ప కటాక్షవీక్షణాలు ఏ వ్యక్తిపై పడినవో, ఆ వ్యక్తి పరబ్రహ్మమనే పేరును పొందినవాడయ్యాడు-అని అంటున్నారు. ఈ విధంగా పల్కడం దేనినిబట్టి? అని అంటే **"శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే"** (శ్రద్ధ అనబడే లక్ష్మివల్ల దేవుడు దేవత్వాన్ని పొందుతున్నాడు) అని శ్రుతి, **"తిరువిల్లా త్తేవరై త్తేఱేల్మిన్ తేవు"** (లక్ష్మి లేని అవర దైవాలను పరదైవంగా కొలువవద్దు) అనే దివ్యసూరిసూక్తి పల్కినందువల్ల లక్ష్మీసంబంధం దేవాధిదేవత్వ నియామకంగా తెలినందువల్ల ఈ విధంగా పల్కడంలో లోటు లేదు.

**(అమీ యత్ర ద్విత్రాః స చ శతమఖాది స్తదధరాత్)- "అమీ"** అనే పదం ముందు పల్కిన అపాంగాలను నిర్దేశిస్తుంది. నీ కటాక్షవీక్షణాలు విశేషంగా ప్రసరించకుండా, కొన్ని చిన్న కణాల పరిమితిలో ప్రసరంచిన చోటు ఏదో, అదే తక్కువది అయిన ఇంద్రాదిదిక్పాలకుల రూపంలో పరిణమించింది- అని భావం. **"ఆది"** శబ్దం ద్వారా బ్రహ్మరుద్రాదులను గ్రహించాలి. ఈ విధంగా లక్ష్మీదేవియొక్క అధిక కటాక్షాలు ప్రసరించిన చోటు పరబ్రహ్మమనే పేరు పొందింది. ఆమె కటాక్షాలు కొన్ని మాత్రమే ప్రసరించిన చోటు బ్రహ్మరుద్ర ఇంద్రాదిదేవతావర్గంగా పేరు పొందింది-అని అన్నందువల్ల - గొప్పగా చెప్పబడే సమస్తవ్యక్తులకు కల్గిన అతిశయం లక్ష్మీకటాక్షవీక్షణాధీనమనే వాస్తవం తెలుపబడినట్లయినది. ఇపుడు ఎందుకోసం చెప్పబడింది? అని అంటే, ఆ విషయాన్ని మూడవ పాదం తెల్పుతున్నది.

**(అతః తదుభయం ఉశన్ అమ్నాయః త్వాం ప్రణిజగౌ)**- పూర్వం పల్కిన పరబ్రహ్మం, ఇంద్రాదిదేవతా వర్గం- అనే రెండిటినిగూర్చి పలికే వేదం నిన్నుగూర్చియే పరోక్షంగా పల్కినట్లయినది- అని భావం. పరబ్రహ్మ దేవేంద్రాది వర్గాలనుగూర్చి పల్కడంద్వారా లక్ష్మినిగూర్చి పల్కినట్లు ఏవిధంగా కాగలదు? అని సందేహించేవారికి తగిన సమాధానాన్ని నాల్గవ పాదం తెల్పుతున్నది.

**(ప్రశస్తి స్సా రాజ్ఞః యదపి చ పురీకోశకథనమ్)**- ఒక నగరంలో ఉండే ధనరాశియొక్క అతిశయాన్ని వర్ణిస్తే, అది ఆ నగరాన్ని పాలించే మహాప్రభువు వైభవాన్ని వర్ణించినట్లుగా కదా పర్యవసిస్తుంది. పరబ్రహ్మాదులను పురీకోశస్థానంలోను, లక్ష్మీదేవిని ప్రభువుస్థానంలోను నిలిపి (ఈ సూక్తిని) పలికారు. అయోధ్యానగర వైభవాతిశయాన్ని వర్ణించడం ఆ అయోధ్యకు ప్రభువైన దశరథచక్రవర్తియొక్క గొప్పతనాన్ని పల్కినట్లు అవుతుంది- అనే విషయంలో వివాదం లేదుకదా ! అదేవిధంగా మహాలక్ష్మియొక్క కటాక్షాధీన సత్తాశాలురైన వారిని (పరబ్రహ్మ- ఇంద్రాదులను) వర్ణించడం మహాలక్ష్మి సముత్కర్ష కీర్తనంలోకి చేరుతుంది- అని అనడంలో అడ్డు లేదు- అని భావం. ఇటువంటి ఉక్తిచాతుర్యం భట్టర్‌కు తప్ప ఇంకెవరికీ సాధ్యం కాదు- అనేది ఇక్కడ అవశ్యవక్తవ్యం.

**31) స్వత శ్రీ! స్త్వం విష్ణోః స్వమసి తత ఏవైష భగవాన్**
**త్వదాయత్తర్ధిత్వేఽప్యభవ దపరాధీనవిభవః ।**
**స్వయా దీప్త్యా రత్నం భవదపి మహార్ఘం న విగుణం**
**న కుణ్ఠస్వాతన్త్ర్యం భవతి చ న చాన్యాహితగుణమ్ ॥**

శ్రీః = లక్ష్మీదేవి!, త్వం = నీవు, విష్ణోః = భగవానునకు, స్వతః = సహజంగానే, స్వం=సొత్తువుగా, అసి = ఉన్నావు, తతః ఏవ = అందువల్లనే, ఏషః = ఈ, భగవాన్= శ్రీరంగనాథభగవానుడు, త్వత్+అయత్త = నీ అధీనంలో ఉండే (నీవల్ల కలిగే), ఋద్ధిత్వే అపి = గొప్పతనాన్ని - వైలక్షణ్యాన్ని కల్గి ఉండే స్థితిని కలవాడైనా, అపరాధీన= పరాధీనం కాని, విభవః = వైభవాన్ని కలవాడై, అభవత్ = అయినాడు, (ఏవిధంగా? అంటే), రత్నం = రత్నం, స్వయా = తనయొక్క, దీప్త్యా = కాంతితో, మహా + అర్ఘం = గొప్ప విలువను కల్గినది, భవత్+అపి = అయినప్పటికీ, విగుణం = గుణహీనం, న = కాదు, నకుంఠ స్వాతంత్ర్యం = తన ప్రాముఖ్యాన్ని కోల్పోయినది కాదు, అన్య+అహిత=

ఇతరులవల్ల కల్గిన, గుణం చ = వైలక్షణ్యాన్ని - శ్రేష్ఠతను - కల్గినది కూడా, న చ భవతి= కావడం లేదు.

వ్యాఖ్యానమ్ :- "స్వరూపం స్వాతంత్ర్యమ్" అనే (28వ) శ్లోకంనుండి వరుసగా మూడు శ్లోకాలతో భగవానునకు గల అతిశయం అంతా లక్ష్మివల్లనే కల్గుతున్నది- అని చెప్పబడిందికదా! ఇదే వాస్తవమైతే, భగవానునకు కల గొప్పతనం అంతా నిరుపాధికమైనది, ఏ ఒక్కటి సోపాధికం కాదు- అని పలికే సర్వశాస్త్రాలు వ్యర్థాలు కాగలదు. పూర్వం పల్కినది అంతా అతివాదమే; అంతే - అని తొలగదోయవలసివస్తుంది- అని భావించి, ఆ విధమైన క్షేపానికి అవకాశం లేశం కూడా లేని సంగతిని నిరూపిస్తున్నారు- ఈ శ్లోకంలో. తగిన ఒక దృష్టాంత విశేషాన్ని ప్రదర్శించి సమర్థిస్తున్నారు. ఇందులో చమత్కారపూర్ణంగా భట్టర్ పలికే రీతిని వినండి. (గమనించండి). రత్నానికి కాంతివల్ల గొప్పతనం కల్గుతున్నదని అంటున్నాము. దీనివల్ల రత్నానికి ఏమయినా తక్కువదనం చెప్పినట్లుగా కాగలదా? రత్నానికి స్వాభావికమైన అతిశయం లేదు. అన్యాధీనమైన అతిశయమే ఉన్నది- అని పల్కినట్లుగా అవుతుందా?- కానేకాదు. ఎందుకు కాదు! అని అంటే, కాంతి అనేది రత్నానికి స్వాభావికమైన, స్వతస్సిద్ధమైన గుణమేతప్ప, ఔపాధికమైనది కాదు. ఔపాధికమైనదానివల్ల అతిశయం కల్గినట్లుగా పల్కినపుడే- సహజమైన అతిశయం లేదు- అని చెప్పినట్లు కాగలదు. విద్వాంసునకు వైదుష్యంవల్ల అతిశయం, ధనికునకు ధనంవల్ల అతిశయం, కులీనునకు (ఉత్తమకులంలో పుట్టిన వానికి) కులంవల్ల అతిశయం, సుందరునకు రూపంవల్ల అతిశయం- పల్కినట్లయితే, ఇవి అన్నీ పరాధీనమైన (ఔపాధికమైన) అతిశయాలని తోచదుకదా! అదే రీతిలో ఇక్కడకూడా గ్రహించాలి.

(శ్రీః)- ఓ శ్రీరంగనాయకీ !,

(త్వం స్వతః విష్ణోః స్వమ్ అసి)- నీవు సహజంగానే భగవానుకు సొత్తువై ఉన్నావు. "స్వత్వ మాత్మని సంజాతం స్వామిత్వం బ్రహ్మణి స్థితమ్" (సొత్తుగా ఉండడం ఆత్మల స్థితి; స్వామియై ఉండడం పరబ్రహ్మస్థితి) అని, "దాసభూతా స్స్వత స్సర్వే హ్యాత్మానః పరమాత్మనః" (ఆత్మలన్నీ పరమాత్మకు సహజంగానే దాసభూతాలు) అని గల ప్రమాణాలు లక్ష్మికికూడా సాధారణాలే కనుక

(సంబంధించినది కనుక) ఈవిధంగా చెప్పబడింది. "సహజంగానే నీవు భగవానునకు దాసురాలివై ఉన్నావు"-అని చెప్పబడినట్లయింది. లక్ష్మీదేవి భగవానునకు తప్ప మిగిలినవారికి స్వామినిర్యై (యజమానురాలై) భగవానునకు సొత్తై ఉంటుంది కదా!

**(తత ఏవ)**- అందువల్లనే- అని అర్థం. భగవానునకు నీవు మిక్కిలిగా శేషభూతురాలవై ఉన్నందువల్లనే.

**(ఏష భగవాన్ త్వదాయర్ధిత్వే అపి అపరాధీనవిభవః అభవత్)**- భగవానుడు నీకు అధీనమైన అతిశయాన్ని కలవాడని చెప్పబడినా, స్వతంత్రవైభవశాలియే అవుతున్నాడు. **"త్వదాయత్తర్ధిత్వేஉపి"** అని అంటూ పరాధీనవైభవశాలిత్వాన్ని చెప్పి, వెంటనే **"అపరాధీనవిభవః"** అని అనడం పొసగుతుందా? అని అంటే, తరువాత శ్లోకం ఉత్తరార్ధంలో ఒక దృష్టాంతాన్ని ప్రదర్శించి సమర్థిస్తున్నారు.

**(రత్నం స్వయా దీప్త్యా మహార్ఘం భవత్ అపి)**- ఒక రత్నం గొప్ప విలువను కల్గినదై ఉండడం- తన కాంతివల్లనే అయినా,

**(న విగుణమ్ భవతి, న కుంఠస్వాతంత్ర్యం భవతి, న చ అన్యాహితగుణం భవతి)** - ఆ రత్నం గుణహీనం కావడం లేదు, తన స్వాతంత్ర్యలో లోటును పొందినది కావడం లేదు, అన్యాధీనమైన వైభవాన్ని కల్గినది కావడం లేదు. ఇదే రీతిలో, ఇక్కడ కూడా గ్రహించాలి - అని భావం. స్వరూపనిరూపకమైన వస్తువువల్ల కలిగే అతిశయం స్వాధీనమే అవుతుంది తప్ప, పరకీయం కాదని చెప్పినట్లయినది. దానివల్ల లక్ష్మీదేవి భగవానునకు స్వరూపనిరూపకభూత- అనే విషయం స్థిరీకరింపబడింది. **"మణత్తై క్కొణ్డు పుష్పత్తై విరుమ్బుమాప్పోలేయుమ్, ప్రభైయై క్కొణ్డు రత్నత్తై విరుమ్బుమాప్పోలేయుమ్"** (పరిమళాన్నిబట్టి పుష్పాన్ని ఆదరించినట్లు, కాంతినిబట్టి రత్నాన్ని ఆదరించినట్లు) అనే రీతిలో లక్ష్మీదేవిని పురస్కరించుకొనియేకదా భగవానుని ఆశిస్తున్నాము (ఆదరిస్తున్నాము).

**32)** ప్రశకనబలజ్యోతిః జ్ఞానైశ్వరీవిజయప్రథా
ప్రణతవరణప్రేమ క్షేమఙ్కరత్వపురస్సరాః ।
**అపి పరిమళః కాన్తిర్లావణ్య మర్చిరితీన్దిరే!**
**తవ భగవత శ్చైతే సాధారణా గుణరాశయః ॥**

ఇందిరే = ఓ లక్ష్మీదేవీ!, ప్రశకన = శక్తి, బల = బలం, జ్యోతిః = తేజస్సు, జ్ఞాన=జ్ఞానం, ఐశ్వరీ = ఐశ్వర్యం, విజయ = వీర్యం, ప్రథా = ప్రసిద్ధి, ప్రణత వరణ = ఆశ్రితులను వరించడం (స్వీకరించడం), ప్రేమ = (వారిపట్ల) ప్రీతి, క్షేమం కరత్వ = (వారికి) క్షేమాన్ని కలుగజేయడం - అనే, పురస్సరాః = మొదలైన గుణాలు, అపి = అంతేకాక, పరిమళః = సౌగంధ్యం, కాంతిః = సౌందర్యం, లావణ్యం = లావణ్యం, అర్చిః = మెఱుపు, ఇతి = అనే, ఏత్ = ఈ, గుణరాశయః = కల్యాణ గుణసమూహాలు, తవ=నీకు, భగవతః చ = శ్రీరంగనాథ భగవానునకు కూడా, సాధారణాః = సమానాలుగా ఉన్నాయి.

**వ్యాఖ్యానమ్ :-** ఇంతవరకు లక్ష్మీదేవియొక్క స్వరూపాన్ని అనుసంధించారు. ఇక, ఆ స్వరూపాన్ని ఆశ్రయించి ఉండేవి, దివ్యమంగళరూపాన్ని ఆశ్రయించి ఉండేవి అయిన కల్యాణగుణాలను అనుసంధించగోరి, మునుముందుగా భగవానునకు, లక్ష్మీదేవికి సాధారణాలైన కొన్ని కల్యాణగుణాలను ఈ శ్లోకంలో ప్రస్తావిస్తున్నారు.

మొదటి పాదంలో షాడ్గుణ్యం చెప్పబడుతున్నది. జ్ఞానశక్తి, బలైశ్వర్య వీర్యతేజస్సులే కదా షాడ్గుణ్య మనబడుతున్నాయి. వీటిలో, శక్తిని "ప్రశకన" అనే పదంతోను, తేజస్సును **"జ్యోతి"**శ్శబ్దంతోను, వీర్యాన్ని **"విజయప్రథా"** శబ్దం తోను నిర్దేశించారు. జ్ఞానం, బలం, ఐశ్వర్యం – అనే ఇవి ఆ శబ్దాలతోనే నిర్దేశింప బడ్డాయి. వీటిలో, శక్తి అంటే – ఇది చేయడానికి సులభమైనది, ఇది చేయడానికి అరుదైనది – అనే తేడా లేకుండా, దేనిని అయినా సులభంగా చేసి పూర్తి చేయగల్గడం. బలం అంటే– అనాయాసంగా అన్నిటినీ ధరించగల్గడం. తేజస్సు అంటే– సహాయాంతర నిరపేక్షంగా దేనినైనా పూర్తి చేయగల్గడం.

ఇక్కడ ఈవిధంగా అనుగ్రహించిన భట్టర్ తామే తరువాత **"యువత్వాదౌ తుల్యేఽపి"** అనే శ్లోకంలో ఔచిత్యానుగుణంగా గుణవిభాగాన్ని చేయబోతున్నారు కనుక, ఇక్కడ పల్కిన గుణాలు స్వరూపయోగ్యతామాత్రప్రకథనార్థమని భావించాలి.

ఇక, శ్లోకంలోని రెండవ పాదంలో, ప్రణతవరణం, ప్రణతప్రేమ, ప్రణత క్షేమంకరత్వమనే మూడు గుణాలు చెప్పబడ్డాయి. ప్రణతవరణమంటే- ఆశ్రితజనస్వీకారం, ప్రణతప్రేమ అంటే- ఆశ్రితులపట్ల ప్రేమ అతిశయించి

ఉండడం. ప్రణతక్షేమంకరత్వమంటే- ఆశ్రితులకు కాలసిన ఇష్టానిష్టప్రాప్తి పరిహారాలను చేయడం. చివరలోగల "పురస్సర" శబ్దం ప్రధానవాచకం. ఇవి మూడు ముఖ్యమైన కల్యాణగుణాలని భావం. ఈ విధంగా రెండు పాదాల ద్వారా చెప్పబడినవి - దివ్యాత్మస్వరూపాశ్రితాలైన కల్యాణగుణాలు. ఇక, మూడవ పాదంలో దివ్యమంగళవిగ్రహనిష్ఠాలైన గుణాలు చెప్పబడుతున్నాయి.

**(పరిమళః కాంతిః లావణ్యమ్ అర్చిః)**- పరిమళమంటే - సౌగంధ్యం. పంచోపనిషణ్మయమైన తిరుమేని కనుక, ఎల్లప్పుడు ఘుమఘుమ అని గుబాళిస్తుంది. కాంతి అంటే - సౌందర్యం. **"తోళ్ కణ్డార్ తోళే కణ్డార్ తొడుకళ్ళక్క మలమన్న తాళ్ కణ్డార్ తాళే కణ్డార్ తడక్కై కణ్డారు మఃదే"** (బాహువులను చూచినవారు బాహువులనే చూచారు. పద్మాలవంటి పాదాలను దర్శించినవారు పాదాలనే దర్శించారు, విశాలమైన శ్రీహస్తాన్ని చూచినవారు కూడా ఆవిధమైనవారే) (కంబరామాయణమ్) - అనే రీతిలో ఒక్కొక్క దివ్యాంగం లోను అందం నిండుగా ఉండడం. లావణ్యమంటే - సముదాయశోభ. **అర్చిస్** - అంటే - ఉజ్జ్వలత్వం. పరప్రకాశకత్వమని భావం. ఈ రీతిలో ఇటువంటి రెండు రీతులలోని (స్వరూపగత- దివ్యమంగళవిగ్రహగత) గుణాలు.

**(ఇందిరే! తవ భగవతశ్చ సాధారణాః)** - ఓ శ్రీరంగనాయకీ! నీకు, శ్రీరంగనాథునకు సాధారణాలైన కల్యాణగుణాలు. క్షేమంకరత్వమంటే- ఇష్టప్రాపణం, అనిష్టనివారణం కనుక, ఇవి రెండిటిని భగవానుడు సాక్షాత్తుగానే చేయగల్గినవాడు. లక్ష్మీదేవి కొన్ని ఇష్టప్రాపణాలను సాక్షాత్తుగాను, మఱి కొన్నిటిని భగవానుని పురస్కరించుకొని చేయగల్గినవి. అనిష్టనివారణాన్ని నియతంగా భగవానుని పురస్కరించుకొనే చేయించగల్గినది; **"సహ ధర్మచరీం శౌరేః సమ్మంత్రిత జగద్ధితామ్, అనుగ్రహమయీం వందే నిత్యమజ్ఞాత నిగ్రహామ్"** (యతిరాజసప్తతి-2) (భగవానుని సహధర్మచారిణి, జగతుత హితాన్ని చక్కగా ఆలోచించేది, అనుగ్రహ రూపిణి, ఏనాడు నిగ్రహాన్ని తెలియనిది అయిన లక్ష్మికి నమస్కరిస్తున్నాను) అని వేదాంతదేశికులు అనుగ్రహించారు కనుక. శ్రీవచనభూషణంలో **"పిరాట్టి స్వశక్తియై విట్టాళ్"** (సీతాదేవి తన శక్తిని విడచి పెట్టింది.) (82) అనే శ్రీసూక్తి ఇక్కడ అనుసంధేయం. లంకలోకి పోయి తన విక్రమాన్ని చూపిన హనుమానుని తోకకు

నిప్పుపెట్టబడినదని తెలిసిన సీతాదేవి **"శీతో భవ హనూమతః"** (హనుమానునకు చల్లనివాడవు కావాలి) అని పల్కి అగ్నిను నీరుగార్చగల్గినది. **"దగ్ధో భవ దశానన"** (రావణా! నీవు దగ్ధం కావాలి) అని పల్కి, విరోధివర్గాన్ని భస్మం చేసి, తనను తను రక్షించుకోగల్గిన శక్తి ఆమెకు ఉన్నా, **"అసందేశాత్తు రామస్య తపస శ్చానుపాలనాత్, న త్వా కుర్మి దశగ్రీవ! భస్మ భస్మార్హతేజసా"** (రావణా! శ్రీరాముడు ఆజ్ఞాపించ నందువల్ల, తపస్సును పాలిస్తున్నదందున, నిన్ను నేను భస్మం చేయగల్గినా, భస్మం చేయడం లేదు) అని పల్కి, నాథుడైన శ్రీరాముని వింటిబలిమిద్వారా నెరవేరవలసిన విరోధినిరసనాన్ని తన శక్తిని ఉపయోగించి చేయలేదుకదా!

**33) అన్యేఽపి యౌవనముఖా యువయో స్సమానాః**
**శ్రీరఙ్గమఙ్గళవిజృమ్భణ వైజయన్తి! ।**
**తస్మిం స్తవ త్వయి చ తస్య పరస్పరేణ**
**సంస్తీర్య దర్పణ ఇవ ప్రచురం స్వదన్తే ॥**

శ్రీరంగమంగళవిజృంభణ వైజయంతి = శ్రీరంగంలో మంగళాలను విస్తరింపజేసే ధ్వజంవంటి దానా! అన్యే = మిగిలిన, యౌవనముఖాః అపి = యౌవనం మొదలైన గుణాలు కూడా, యువయోః = మీ ఇద్దఱికి, సమానాః = సాధారణాలు, తవ = నీ యొక్క (గుణాలు), తస్మిన్ = ఆ స్వామిలో, తస్య = ఆ స్వామి గుణాలు, త్వయి చ = నీలోను, దర్పణే ఇవ = అద్దంలో వలె, పరస్పరేణ = పరస్పరంగా, సంస్తీర్య = ప్రతిఫలించి, ప్రచురం = మిక్కిలిగా, స్వదంతే = మీ ఇద్దఱికి ఆనందాన్ని కల్గిస్తున్నాయి.

**వ్యాఖ్యానమ్ :-** దివ్యదంపతులకు సమానాలైన ఇంకా మఱి కొన్ని కల్యాణగుణాలను గూర్చి పల్కి, ఇవి పరస్పరం భోగ్యాలై ఉండే క్రమాన్ని ఈ శ్లోకంలో చమత్కారభరంగా పల్కుతున్నారు.

**(శ్రీరంగమంగళవిజృంభణవైజయంతి!)**- ఇది శ్రీరంగనాయకిని గూర్చి చేసిన విలక్షణమైన సంబోధన. శ్రీరంగనిలయానికి ఏర్పడే మంగళాభివృద్ధికి అంతటికి ధ్వజమైన ఓ లక్ష్మీదేవీ!- అని భావం.

**(యౌవనముఖాః అన్యేఽపి (గుణాః) యువయో స్సమానాః)**- పూర్వ శ్లోకంలో చెప్పబడిన కల్యాణగుణాలే కాకుండా, మఱి కొన్ని యౌవనం మొదలైన గుణాలు మీఇద్దఱికి సాధారణాలై ఉన్నాయి. **"యౌవనముఖాః"** అంటే- యౌవనం

మొదలైనవి- అని అర్థం. ఆదిశబ్దంతో సౌకుమార్యాదులను గ్రహించాలి. ఈ గుణాలు సమానమైనవి. ఈ రీతిలో "సమానాస్సంతః" ఉభయసాధారణాలై ఉండేవి,

**(తవ గుణాః తస్మిన్, తస్య గుణాః త్వయి చ సంస్తీర్య)**- నీ గుణాలు అతనిలో, అతని గుణాలు నీలో కలసి- అని అర్థం.

**(దర్పణే ఇవ)**- అద్దంలో దర్శిస్తున్నట్లుగా- అని భావం. లక్ష్మికి, లక్ష్మీపతి అద్దంగాను, లక్ష్మీపతికి లక్ష్మి అద్దంగాను అవుతున్నారు. లక్ష్మీదేవి భగవానుని చూచేటపుడు, "నాలో ఉండే గుణాలు ఇక్కడ ప్రతిబింబిస్తున్నాయే" అని తలుస్తుంది. భగవానుడు లక్ష్మీదేవిని చూచేటపుడు "నాలో ఉండే గుణాలు ఈమెలో ప్రతిఫలిస్తున్నాయే" అని భావిస్తాడు. ఇందువల్ల దివ్యదంపతులకు కల పరస్పర సామ్యం వ్యక్తం చేయబడింది.

**(పరస్పరేణ ప్రచురం స్వదంతే)**- ఉభయగుణాలు ఇద్దఱికి పరమభోగ్యాలవుతున్నాయి - అని భావం. ఈ విధంగా పల్కడం ద్వారా లక్ష్మీదేవికి, భగవానునకు ధర్మభేదమే లేదు- అని తెల్పుతున్నట్లు భావిస్తుంది. కాని, వాస్తవం అది కాదు. తావత్పర్యంతం (అంతగా) భావించే రీతిలోని సామ్యం తెలుపబడడంలోనే తాత్పర్యం. (అంతే తప్ప భేదం లేదని అర్థం కాదు)

**34) యువత్వాదౌ తుల్యేऽప్యపరవశతా శత్రుశమన -**
**స్థిరత్వాదీన్ కృత్వా భగవతి! గుణాన్ పుంస్త్వ సులభాన్ ।**
**త్వయి స్త్రీత్వైకాన్తాన్ మ్రదిమపతిపారార్థ్యకరుణా -**
**క్షమాదీన్వా భోక్తుం భవతి యువయో రాత్మని భిదా**

యువత్వ+ఆదౌ = యౌవనం మొదలైన కల్యాణగుణాలు, తుల్యే అపి = మీ ఇద్దఱికి సమానాలు అయినా, భగవతి = భగవానుడైన శ్రీరంగనాథునిలో, పుంస్త్వ సులభాన్ = పురుషత్వానికే సులభాలైన (పురుషునిలో మాత్రమే గోచరించే), గుణాలైన, అపరవశతా = పరవశత్వం లేకపోడం - అంటే - స్వాతంత్ర్యం, శత్రుశమన=విరోధులను నిరసించడం, స్థిరత్వ = స్థిరంగా-దృఢంగా ఉండడం, ఆదీన్= మొదలైన, గుణాన్= గుణాలను, (మనసి) కృత్వా = మనస్సులో భావించి, త్వయి= నీలో, స్త్రీత్వ+ఏకాంతాన్= స్త్రీత్వానికి మాత్రమే తగిన, మ్రదిమ = మనోమార్దవం (సున్నితమైన మనస్సును కల్గి

ఉండడం), పతిపారార్థ్య = పతికి పరతంత్రయై ఉండడం, కరుణా = దయ, క్షమా = ఓర్పు, ఆదీన్ = మొదలైన, గుణాన్= కల్యాణ గుణాలను, (మనసి) కృత్వా = (మనస్సులో) అనుసంధించి, భోక్తుం = (ఆయా గుణాలను) దర్శించి అనుభవించి ఆనందించడానికి, యువయోః = మీ ఇద్దఱియొక్క, ఆత్మని = స్వరూపంలో, భిదా = భేదం, భవతి = ఏర్పడుతున్నది (స్వామిలోని పురుషత్వానికి తగిన కల్యాణగుణాలు, నీలోని స్త్రీత్వానికి తగిన కల్యాణగుణాలు వేర్వేరుగా భాసిస్తూ మమ్ములను ఆనందింపజేస్తున్నాయి)

**వ్యాఖ్యానమ్ :-** పూర్వం పల్కిన రీతిలో దివ్యాత్మస్వరూపగుణాలు, దివ్యమంగళవిగ్రహ గుణాలు దివ్యదంపతులు ఇద్దఱికి అవిశిష్టంగా (సాధారణాలుగా) ఉన్నట్లయితే, వ్యక్తి భేదంతో ప్రత్యేకంగా అనుభవించే అనుభోక్తలకు వారిద్దరి మధ్య భేదప్రతిపత్తి (ఈమె లక్ష్మీదేవి, ఇతడు భగవానుడు - అనే భేదజ్ఞానం) ఏవిధంగా సంభవిస్తుంది? అని అంటే, దానికి తగిన సమాధానాన్ని ఈ శ్లోకం తెల్పుతున్నది. యౌవనం మొదలుగా చెప్పబడిన కల్యాణగుణాలు అన్నీ ఉభయసాధారణాలైనా, అనుభోక్తలకు భేదప్రతిపత్తి సౌకర్యార్థంగా ఉండే పురుషత్వానికి తగిన గుణాలను భగవానునకు, స్త్రీత్వానికి అనుగుణమైన గుణాలను లక్ష్మికి తెల్పుతున్నారు.

**(హే శ్రీః! యువయోః యువత్వాదౌ తుల్యే సత్యపి)**- ఓ శ్రీరంగనాయకీ! యౌవనత్వాదిగుణాలు మీ ఇద్దఱికి సాధారణాలై ఉన్నా,

**(పుంస్త్వసులభాన్ అపరవశతాశత్రుశమనస్థిరత్వాదీన్ గుణాన్ భగవతి కృత్వా)**- అపరవశత్వమంటే- పారతంత్ర్యం లేకుండా ఉండడమనే స్వాతంత్ర్యం. తరువాత ఉండే, **"శత్రుశమనస్థిరత్వాదీన్"** -అనే ప్రయోగాన్ని, శత్రుశమనం, స్థిరత్వం- అని రెండు గుణాలుగా విభజించి కొందఱు వివరిస్తారు. అంతకంటే, **"శత్రుశమనే స్థిరత్వమ్"** అనిష్టనివారణంలో పట్టిన పట్టు విడువకుండా ఉండడం- అని ఒకే గుణంగా గ్రహించడం తగినది. **"అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే! సలక్ష్మణామ్, న హి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః"** (సీతా ! నా ప్రాణాలను సైతం త్యజిస్తాను. లక్షణునితో పాటు నిన్ను కూడా వదలిపెడతాను. అంతే తప్ప, విశేషించి బ్రాహ్మణులకిచ్చిన మాటను మాత్రం తప్పను) ఇత్యాది ప్రమాణాలలో శత్రునిరసనంలోని స్థిరత్వాన్ని దర్శించవచ్చు. స్థిరత్వమంటే-

స్థిరప్రతిజ్ఞత్వం. ఈవిధంగా స్వాతంత్ర్యం, అనిష్టనివారణంలో స్థైర్యాన్ని కల్గి ఉండడం మొదలైన గుణాలు స్త్రీకు తగినవి కానివై, మగవారికి మాత్రమే చెందినవి అయినందున, వీటిని భగవానునకు మాత్రమే చెందినవిగా చెప్పబడ్డాయి.

ఇక, లక్ష్మికి మాత్రమే చెందిన గుణాలు తెలుపబడుతున్నాయి - **"త్వయి స్త్రీత్వైకాంతాన్"** ఇత్యాదిగా.

**(స్త్రీత్వైకాంతాన్ మ్రదిమపతిపారార్థ్యకరుణాక్షమాదీన్ గుణాన్ త్వయి కృత్వా)**- మ్రదిమా అంటే- మృదుత్వం. సౌకుమార్యమని భావం. ఇది దేహనిష్ఠంగాను, ఆత్మనిష్ఠంగాను- రెండు విధాలుగా ఉంటుంది. తిరుమేని సుకుమారంగా ఉండడం, ప్రకృతంలో చెప్పబడలేదు. సుకమారహృదయత్వమే తెలుపబడుతున్నది. లోకంలో పురుషులు కఠినహృదయులై ఉంటారు. స్త్రీలకు అది అసంభావితం. **"పతిపారార్థ్య"**మంటే- భర్తకే పరతంత్రంగా ఉండడం. కరుణ అంటే- పరదుఃఖాసహిష్ణుత్వం. క్షమ అంటే- సహనం. కరుణ, క్షమ- భగవానునకు కూడా ఉన్నాయని అనుసంధించినా, అతడు **"క్షిపామి"** అని, **"న క్షమామి"** అని మధ్యమధ్యలో పల్కుతాడు కనుక, ఈ గుణాలు అతనికి ఐకాంతికాలు- అని అనలేము. అందువల్ల **"స్త్రీత్వైకాంతాన్"** అని ఇక్కడ చెప్పబడింది. **"క్షమాదీన్ వా"** అనే చోటగల **"వా"** అనే పదం సముచ్చయార్థకం; వికల్పార్థకం కాదు.

నాల్గవ పాదంలో **"భోక్తుమ్"** అనే పాఠం కన్పిస్తుంది. **"భోక్తుః"** అనే షష్ఠ్యంతపాఠం వికారాన్ని పొందినట్లు కొందఱు పెద్దలు భావిస్తారు. అది యుక్తమే. **"భోక్తుః"** అనే ఏకవచనాంతమై ఉన్నా, ఇది జాత్యేకవచనం. సమష్టివాచకం. అనుభోక్తలకు- అని అర్థం. సంస్కృత వ్యాఖ్యాత **"అనుభవితౄణా మితి శేషః"** అని వివరించారు. ఈవిధమైన అధ్యాహారశ్రమ లేకుండా అన్వయం కుదురుతుంది.

**35) ఘనకనకద్యుతీ యువదశామపి ముగ్ధదశాం**
**యువతరుణత్వయో రుచిరమాభరణాది పరమ్ ।**
**ధ్రువ మసమానదేశ వినివేశి విభజ్య హరౌ**
**త్వయి చ కుశేశయోదరవిహారిణి! నిర్విశసి ॥**

కుశేశయ+ఉదర విహారిణి = తామరపూవు నడుమ విహరించే శ్రీరంగనాయకీ! ఘన = మేఘంయొక్క, కనక = బంగారంయొక్క, ద్యుతీ = కాంతులవంటి కాంతులను

కల్గినవి, యువదశామ్ = యౌవన దశకు, ముగ్ధదశామ్ అపి = అంత కంటే లేతవయస్సుకు, యువతరుణత్వయోః = యౌవన, తారుణ్యాలకును, ఉచితం= తగినది, అసమానదేశ = వేత్వేరు ప్రదేశాలలో, వినివేశి = పెట్టకొన బడినది, (అలంకరించుకో బడినది), పరం = గొప్పది అయిన, ఆభరణాది = దివ్యాభరణాలు మొదలైనదానిని, హరౌ = భగవానునిలో, త్వయిచ = నీలోను, విభజ్య = విభాగం చేసి, నిర్విశసి = ఆనందిస్తున్నావు, ధ్రువం = ఇది నిశ్చయం.

**వ్యాఖ్యానమ్ :-** దివ్యదంపతులకు స్వరూపవ్యావర్తకాలైన కల్యాణగుణాలు పూర్వశ్లోకంలో అనుసంధింపబడ్డాయి. దివ్యమంగళవిగ్రహ వ్యావర్తకాలైన గుణాలను ఈ శ్లోకం అనుసంధిస్తున్నది.

భగవానుడు **"కార్ కలన్ద మేని"** (మేఘంవంటి రూపాన్ని కలవాడు) కనుక అతని రూపం నీలమేఘనిభం. లక్ష్మీదేవి **"హిరణ్యవర్ణాం హరిణీమ్"** అని కీర్తింప బడుతున్నందువల్ల ఆమె రూపం కనకనిభం. భగవానుని పరువం యౌవనం. లక్ష్మీదేవి పరువం ముగ్ధదశ– అనదగిన ప్రాయం. దివ్యభూషణాలు కూడా "ఇవి పురుషునకు తగినవి; ఇవి స్త్రీలకు తగినవి" అనే భేదాన్ని కల్గి ఉంటాయి. కేవలం భూషణాలలో మాత్రమే భేదం కాదు. అవి ధరించే స్థానాలలో కూడా భేదం ఉన్నది. ముక్కెర– అని, కర్ణపుష్పాలని, మేఖల –అని, పాపిడి పూవు– అని ఈ విధంగా అసాధారణంగా స్త్రీలు ఆయా స్థానవిశేషాలలో అలంకరించు కొంటారు. అందువల్ల ఈ రీతిలో వ్యావర్తకాలైన ఆకారాలను పొందినవై, మీ ఇద్దఱికి పరస్పరానుభవాన్ని కల్గిస్తున్నాయని భావం.

**(కుశేశయోదరవిహారిణి!)** – కుశేశయమంటే తామరపూవు. దాని ఉదరంలో విహరించేదానా! – పద్మవనాలయా! అని అర్థం. ఓ అలర్మేల్మఙ్గా! అని తాత్పర్యం.

**(ఘనకనకద్యుతీ)**– "ఘన" మని మేఘానికి పేరు. "కనక"మని స్వర్ణానికి పేరు. భగవానుని ద్యుతి మేఘద్యుతి. లక్ష్మీదేవిది కనకద్యుతి. ఈ పదం ద్వితీయావిభక్తి ద్వివచనాంతపదం.

**(యువదశామపి ముగ్ధదశామ్)**– భగవానుని పరువం యౌవనం. లక్ష్మీదేవి పరువం కౌమారం. అదియే ముగ్ధదశ అనబడుతుంది. తారుణ్యమనబడేది కూడా

ఇదే. తరువాత, "సూతే శైశవయౌవనవ్యతికరో గాత్రేషు తే సౌరభమ్" అని అన్నందువల్ల కౌమారానికి, యౌవనానికి సంధిదశ లక్ష్మీదేవియొక్క పరువమని గ్రహించాలి. ఈ పరువాలు, సంసారుల పరువాలవలె క్షణం క్షణం మారేవి కాకుండా, దివ్యదంపతులకు నిత్యంగా కొనసాగుతాయి.

**(యువతరుణత్వయో రుచిరమ్ పరమ్ ఆభరణాది)**- భగవానుడు తన యౌవనపరువానికి తగిన భూషణాలను ధరిస్తాడు. లక్ష్మీదేవి తన పరువమైన తారుణ్యానికి తగిన భూషణాలతో అలంకరింపబడి ఉంటుంది. లోకంలో యువత్వం, తరుణత్వం- అనే వానిని పర్యాయాలుగా వ్యవహరిస్తున్నా, వాటి మధ్య భేదం ఉన్నది. యౌవనానికి ముందు దశ తారుణ్యం. ఈ పరువాలలోని భేదానికి తగినదై ఉంటుంది. వారి భూషణాలలోని భేదం కూడా (ఈ స్తుతిలో) తరువాత **"కనకరశనాముక్తాతాటంకహారలలాటికా"** ఇత్యాది శ్లోకంలో పలికే దివ్యాభరణాలు అనుసంధేయాలు.

**(అసమానదేశివినివేశి)**- ఈ పదంకూడా ఆభరణవిశేషణం. స్త్రీ-పురుషులకు గల ఆభరణాలోని భేదంవలె, అవి ధరింపబడే స్థానాలలో కూడా భేదం ఉన్నదికదా ! ఆ విషయాన్ని ఇది తెల్పుతున్నది. అందువల్ల, ఈ విధంగా

**(హరౌ త్వయి చ విభజ్య)** - భగవానునకు, నీకు మధ్య వ్యావృత్తిని తెలియజేస్తూ - అని భావం.

**(నిర్విశసి)**- దీనిని అంతర్భావిత ణిజంతంగా గ్రహించవచ్చు. భక్తులను అనుభవింపజేస్తున్నావు. (ఆనందింపజేస్తున్నావు)- అని భావం. మూడవ పాదం మొదటగల "ధ్రువమ్" అనే పదం ఉత్ప్రేక్షావాచకం.

**36) అఙ్గన్తే మృదుశీతముగ్ధ మధురోదారై ర్గుణైర్గుమ్ఫితః**
**క్షీరాబ్ధేః కిమ్మృజీషతా ముపగతా మన్యే మహార్ఘా స్తతః ।**
**ఇన్దుః కల్పలతా సుధా మధుముఖా ఇత్యావిలాం వర్ణనాం**
**శ్రీరఙ్గేశ్వరి! శాన్తకృత్రిమకథం దివ్యం వపుర్నార్హతి ॥**

శ్రీరంగేశ్వరి = ఓ శ్రీరంగనాయకీ!, తే = నీయొక్క, అంగం = దివ్యదేహాన్ని, మృదు = సౌకుమార్యం, శీత = చల్లనిదనం, ముగ్ధ = సౌందర్యం, మధుర = భోగ్యత,

ఉదారైః = గొప్పతనం మొదలైన, గుణైః = కల్యాణగుణాలతో, గుంఫతః= కూర్చే, క్షీరాబ్ధేః = పాలసముద్రంవల్ల, ఇందుః = చంద్రుడు, కల్పలతా = కల్పలత, సుధా = అమృతం, మధుముఖాః = మధువు మొదలైనవి, ఋజీషతాం = రసం లేని పిప్పి అయిన–అసారమైన స్థితిని, ఉపగతాః కిమ్ = పొందినవా! ఏమి! (మిగిలిన చంద్ర కల్పలతాదులు పిప్పివంటివి అయినవా? ఏమి!), తతః = అందువల్లనే, మహార్ఘాః = (అవి) గొప్ప విలువ కల్గినవి అని, మన్యే = అని తలుస్తాను, ఇతి = అని అంటూ, ఆవిలాం = కలతపడిన (దోషయుక్తమైన), వర్ణనాం = వర్ణనకు, శాంతకృత్రిమకథం= కల్పింపబడినది – అనేమాటయొక్క ప్రసక్తి ఏమాత్రం లేని, దివ్యం = నీ దివ్యమైన, వపుః = రూపం, న అర్హతి=తగినది కాదు.

**వ్యాఖ్యానమ్ :–** శ్రీరంగనాయకి దివ్యమంగళవిగ్రహవైలక్షణ్యాన్ని ఇందులో వర్ణిస్తున్నారు. ఒక విలక్షణమైన ప్రక్రియలో వర్ణిస్తూ, ఆ వర్ణనకూడా (ఆమెకు) తగినది కాదని విరమిస్తున్నారు. క్షీరసాగరకన్య –అనబడే లక్ష్మీదేవి భగవానుడు క్షీరాబ్ధిని చిలికినపుడు ఆ సముద్రం నుండి ఆవిర్భవించినది కనుక, అపుడు ఆమెతో పుట్టిన చంద్రుడు, కల్పలత, అమృతం, సుర– మొదలైన వస్తువులలో ఉండే గుణాలైన మృదుత్వం, చల్లదనం, మోహనత్వం మాధుర్యం, ఔదార్యం– అనేవానిని సారంగా గ్రహించి, ఈ (నీ) తిరుమేనిని క్షీరసముద్రుడు సృష్టించాడా ఏమి ? అని భావించవచ్చు. అయితే, అకృత్రిమమైన (అప్రాకృతమైన) ఈ తిరుమేనిని పూర్వం పల్కిన ప్రాకృతవస్తువుల సారంగా పల్కడం కూడా తగినది కాదు. అప్రాకృతమని అనాలి– అంతే తప్ప, వేఱు విధమైన వర్ణనకు తగినది– అని వర్ణనను నిగమిస్తున్నారు (పూర్తిచేస్తున్నారు.)

**(శ్రీరంగేశ్వరి)–** ఓ శ్రీరంగనాయకీ !,

**(మృదుశీతముగ్ధమధురోదారైః గుణైః తే అంగం గుంఫతః క్షీరాబ్ధేః)–** ఇక్కడ మృదుశీతత్వాది ధర్మివచనపదాలతో మృదుత్వం, శీతత్వం, ముగ్ధత్వం, మాధుర్యం, ఉదారత్వం– అనే ధర్మాలు వివక్షితాలు. మూడవ పాదంలో "ఇందుః" అని ఆరంభించి చెప్పబడిన చంద్రుడు మొదలైన వస్తువులలో ఈ గుణాలు ఉన్నాయి. చంద్రునిలో మార్దవశైత్యాలున్నాయి. కల్పలతలో ఔదార్యమున్నది. సుధలో, మధువులో మాధుర్యమున్నది. ఈ గుణాలన్నీ ఒకటిగా కలసి ఉండడం– శ్రీలక్ష్మీదేవిలోనే

కనుక, వానిలో ఒక్కొక్కటిలో ఒక్కొక్క గుణం ఉన్నందున, క్షీరాబ్ధి వానిని అన్నిటిని పిండి, వాటి సారాలను తీసి ముద్ద చేసి శ్రీమహాలక్ష్మిగా రూపొందించిందా ? అని చెప్పవచ్చు– అని భట్టర్ మనస్సులో ఈవిధంగా తోచడం పరమవిలక్షణమైన భావనావిశేషం. దీనికి మించి ఇంకొక విశేషంకూడా ఇక్కడ ఉన్నది, వినండి. చంద్రుడు, కల్పలత మొదలైన వస్తువులను పిండి సారంగా తీస్తే, తరువాత వాటిలో ఏమి మిగిలి ఉంటుంది? పిప్పి కదా మిగిలి ఉంటుంది. ఆ పిప్పియే లోకంలో గొప్పగా చెప్పబడుతున్నాయి– అంటే, సారసర్వస్వమైన లక్ష్మీదేవి తిరుమేనిలోని గొప్పతనం, వాచామగోచరమే కదా ! అందువల్ల ఈ రీతిలోని ఒక వర్ణనను చేయవచ్చు– అని భట్టర్ భావించారు. **"ఆక్షేపః స్వయ ముక్తస్య ప్రతిషేధో విచారణాత్"** (తాను పల్కిన మాటనే, తరువాత విచారించి నిషేధించడం ఆక్షేపాలంకారం) అని నిర్వచింపబడిన ఆక్షేపాలంకారప్రణాళికలో "ఈ వర్ణనకూడా తగదు"– అని ప్రతిషేధించి చివరి పాదంలో పల్కుతున్నారు– **"ఆవిలామ్ వర్ణనామ్"** అని అనడం ద్వారా. ఈ వర్ణనకూడా అనుచితమేనని దీనిద్వారా తెలుపబడింది. అనౌచిత్యం ఎందువల్ల? అని అంటే,

**(శాంతకృత్రిమకథం దివ్యం వపుః)**– అని అంటున్నారు. చంద్రుడు మొదలైన వస్తువులలో సారగుణాలను గ్రహించి, లక్ష్మీదేవి తిరుమేని నిర్మింపబడినది. అంటే, ఈ తిరుమేని కృత్రిమమైనది– అని కదా స్ఫురిస్తుంది. కృత్రిమకథా గంధలేశం కూడా లేని ఈ తిరుమేనికి ఈ వర్ణన కొంచెంకూడా తగినది కాదుకదా! లక్ష్మీదేవి తిరుమేనికి **"దివ్యమ్"** అనే విశేషణం ఇక్కడ ప్రాణస్థానీయం. అప్రాకృతమైన దీనిని ప్రాకృతవస్తువుల సారంగా ఏవిధంగా చెప్పవచ్చు? అని తాత్పర్యం.

మొదటి పాదం మొదట ఉండే **"గుంఫతః"** అనే పదం షష్ఠీవిభక్తి– ఏక వచనాంతం. క్షీరాబ్ధికి విశేషణం. **"గుంఫన్"** అనేది ప్రథమా ఏకవచనం శతృప్రత్యయాంతం. "ముద్దగా చేసే" అని అర్థం. **"ఋజీషతామ్"**– పిప్పియొక్క స్వభావాన్ని– అని అర్థం. గడచిన శ్లోకంలో **"ధ్రువమ్"** అనే పదంవలె ఇక్కడ కూడా **"మన్యే"** అనేది ఉత్ప్రేక్షాసూచకం. ఏ అంశలో ఉత్ప్రేక్ష? అని అంటే– పూర్వార్థంలో రెండు విషయాలు చెప్పబడ్డాయి. (1) క్షీరాబ్ధి చంద్ర కల్పలతాదుల

సారభూతాలైన గుణాలను గ్రహించి లక్ష్మీదేవి దివ్యరూపాన్ని నిర్మించాడు- అని అనడం ఒకటి, (2) దానినుండి మిగిలినది పిప్పియై, అసారమైనది అయినందువల్లనే ఆ చంద్రాదులకు కూడా ఏదోకొంత అతిశయం కల్గినది- అని అనడం ఇంకొకటి. ఈ రెండు ఉత్ప్రేక్షలు.

**37) ప్రణమదనువిధిత్సావాసనానమ్రమగ్రే**
**ప్రణయిపరిచిచీషా కుఞ్చితం పార్శ్వకేన ।**
**కనకనికష చఞ్చచ్చంపక స్రక్సమాన**
**ప్రవర మిద ముదారం వర్ష్మ వాచామభూమిః ॥**

అగ్రే = శిరస్సున, ప్రణమత్ = నమస్కరించేవారిని, అనువిధిత్సా=అనుసరించే (అనుకూలంగా ఉండాలనే) కోరికయొక్క వాసనా=సంస్కారంచేత (భావనాప్రకర్ష వల్ల), నమ్రం = కొంచెం ఒంగినది, పార్శ్వకేన = ఇరువైపుల, ప్రణయపరిచిచీషా= నీ ప్రియుడైన శ్రీరంగనాథునిపట్లగల, మచ్చిక (వాంఛ) చేత, కుంచితం = సన్నగిల్లినది, కనకనికష = మేలిమి బంగారంలో, చంచత్ చంపకస్రక్ = ప్రకాశించే సంపెంగ పూలమాలతో, సమానప్రవరం = సమానమైన గోత్రాన్ని కల్గినది (సాటి వచ్చేది) అయిన, ఇదం = ఈ ఉదారం = గొప్పదైన, వర్ష్మ = నీ దివ్యదేహం, వాచాం = వాక్కులకు, అభూమిః = అందనిది (మాటలతో వర్ణించలేనిది).

**వ్యాఖ్యానమ్ :-** ఇందులో శ్రీరంగనాయకియొక్క తిరుమేని సన్నివేశం ఉండే రీతినిగూర్చి కొంచెం పల్కి, అయ్యో! ఇది వాక్కుకు అందనిది కదా! అని అంటున్నారు. శిరోభారం ఉండే రీతిని మొదటి పాదంతోను, పార్శ్వభాగం ఉండే రీతిని రెండవ పాదంతోను పల్కుతున్నారు. ఈశ్లోకంలో **"హే శ్రీః"** అనే ఒక సంబోధనను, **"తే"** అనే ఇంకొక షష్ఠ్యంతపదాన్ని పూర్వశ్లోకంనుండి అనువర్తించుకోవాలి. ఓ శ్రీరంగనాయకీ!

**(ఇదం వర్ష్మ)-** ఈ (నీ) తిరుమేని ఏవిధంగా ఉన్నది? అని అంటే,

**(ప్రణమత్ అనువిధిత్సావాసనానమ్రమ్ అగ్రే)-** శ్రీచరణసమీపంలోకి వచ్చి నమస్కరించే భక్తులను అనుగ్రహించడంకోసం నీ శిరస్సు కొంచెం వంగి ఉన్నది. నీ తిరుముఖమండలం విస్తరించిన స్థితిని దర్శిస్తే, భక్తుల రాకను ఎదురు చూచి, వచ్చి చేరిన భక్తులకు అనుగ్రహించాలని.ఆశించి ఉండే క్రమమా ఇది!- అని ఉల్లేఖించేటట్లుగా ఉన్నది.

(ప్రణయిపరిచిచీషాకుంచితం పార్శ్వకేన)- "పార్శ్వకే చ" అని పాఠాంతరం. అదికూడా పొసగుతుంది. శ్రీరంగనాయకియొక్క పార్శ్వభాగం చాలా వినయం స్ఫురించేటట్లు ఒదిగి ముడుచుకొని ఉండే రీతిని చూస్తే, ఆశ్రితులపట్ల భగవానుని అనుగ్రహోన్ముఖుని చేయడంకోసం ఈవిధంగా ఉన్నదా? అని ఉల్లేఖించే రీతిలో ఉన్నది.

ఈవిధంగా అవయవైకదేశాలను ఉల్లేఖించి పల్కి, తరువాత, తిరుమేని అంతా ఉండే రీతిని గూర్చి పల్కుతున్నారు- "కనకనికషే" త్యాదిగా. కనక నికషమంటే - సువర్ణరేఖ. దానివలె ఉజ్జ్వలంగా తిరుమేని ఉన్నది.

(చంచచ్చంపకస్రక్సమానప్రవరమ్)- వికసించే సంపెంగ పూలమాలవలె పరిమళిస్తున్నది. "సమానప్రవర"మంటే- సామ్యాపన్నమని అర్థం. (సామ్యాన్ని పొందినది) ఈరీతిలో ఇటువంటి తిరుమేని వాచామగోచరమని అనాలి తప్ప, నోటితో వర్ణించడం సాధ్యం కాదు- అని తెల్పినట్లయినది.

**38) ఏకం న్యఞ్చ్య నతిక్షమం మమ పరం చాకుఞ్చ్య పాదామ్బుజం**
**మధ్యేవిష్టరపుణ్డరీక మభయం విన్యస్య హస్తామ్బుజమ్ ।**
**త్వాం పశ్యేమ నిషేదుషీం ప్రతికలం కారుణ్యకూలఙ్కష -**
**స్ఫారాపాఙ్గతరఙ్గ మమ్బ! మధురం ముగ్ధం ముఖం బిభ్రతీమ్॥**

అంబ = తల్లీ, మమ = నాకు, నతిక్షమం = నమస్కరించడానికి వీలుగా ఉన్నది అయిన, ఏకం = ఒక (కుడి) పాద +అంబుజం = శ్రీచరణ పద్మాన్ని, న్యంచ్య = కిందికి చాపి, పరం = ఇంకొక (ఎడమ) శ్రీచరణకమలాన్ని, అకుంచ్య= మడచి, హస్తాంబుజం = కరకమలాన్ని, అభయం = అభయముద్రను కల్గినదిగా, విన్యస్య చ= ఉంచి, మధ్యేవిష్టరపుండరీకం=ఆసనపద్మం మధ్యలో, నిషేదుషీం= ఆసీనురాలవై ఉన్నదానవు, కారుణ్య = దయయొక్క కూలంకష = ఒడ్డును ఒరసి కొని ప్రవహించే, స్ఫార = మిక్కిలి అయిన, అపాంగతరంగం = కటాక్షాలనే తరంగాన్ని కల్గినదియై, మధురం = ఇంపుగా ఉండే (ఆనందాన్ని కల్గించే), ముగ్ధం= మనోహరమైన, ముఖం= ముఖాన్ని, బిభ్రతీమ్ = ధరించి ఉండేదానవు అయిన, త్వాం = నిన్ను, ప్రతికలం = ప్రతిక్షణం, పశ్యేమ = దర్శిస్తాము (ఇది ధ్యానశ్లోకం)

వ్యాఖ్యానమ్ :- శ్రీరంగనాయకి ఆసనపుండరీకంపైన వేంచేసి ఉండే రీతిని తమ మనస్సు చల్లబడేటట్లు అనుసంధించి, ఈస్థితియే ఎల్లప్పటికి తమ కంటి ముందు నిలచి ఉండాలి- అని అంటున్నారు, ఈ శ్లోకంలో.

**(హే అంబ!)**- ఓ తల్లీ!,

**(ఏకం పాదాంబుజం మమ నతిక్షమం న్యంచ్య)**- ఒక నీ శ్రీచరణపద్మాన్ని దాసుడు నమస్కరించేటట్లుగా చాచి ఉంచి- అని అర్థం. కుడిపాదాన్ని ఆసనపద్మం కిందకు వేలాడదీసి ఉంచిన సన్నివేశాన్ని ఇది తెల్పుతున్నది. ఆ రీతిలో ఒక శ్రీచరణాన్ని కిందకు చాచి ఉండడానికి ఒక హేతువు **"మమ నతిక్షమమ్"** అని అంటూ తెలుపబడింది.

**(పరం పాదాంబుజమ్ ఆకుంచ్య)**- ఇంకొక (ఎడమ) పాదాన్ని మడచి ఉంచిన రీతిని ఇది తెల్పుతున్నది. ఇది ఆధిరాజ్యసూచకమైన స్థితి.

**(అభయం హస్తాంబుజం విన్యస్య)**- శ్రీహస్తాన్ని అభయముద్రాంచితంగా ఉంచి- అని అర్థం. ఈ రీతిలో,

**(మధ్యేవిష్టరపుండరీకమ్ నిషేదుషీమ్)**- విష్టరమని ఆసనానికి పేరు. విష్టరపుండరీకమంటే - ఆసనపద్మమని అర్థం. **"మధ్యేవిష్టరపుండరీకమ్"** అనేది సమస్తపదం. అవ్యయీభావసమాసం. **"నిషేదుషీమ్"** అనేది లిట్‌రూపంపై క్వసుప్రత్యయం రాగా ఏర్పడిన రూపం. ఇది ఛందస్సులో మాత్రం (వేదంలో మాత్రం) ఉపయోగింపబడేదైనా, మహాకవులు కూడా దీనిని ప్రయోగించడం కన్పిస్తుంది. లక్ష్మీదేవిని ఇంకొక విశేషణంతో కూడా విశేషిస్తున్నారు.

**(కారుణ్యకూలంకషస్ఫారాపాంగతరంగం ముఖం బిభ్రతీమ్)**- కరుణతో అలలు తీరాన్ని తాకే చాలా గొప్ప కటాక్షవిశేషధారలను కల్గిన తిరుముఖమండలాన్ని కల్గిన -అని అర్థం. ఇటువంటి,

**(త్వామ్)**- నిన్ను,

**(ప్రతికలం పశ్యేమ)**- ప్రతిక్షణం నిరంతరం దర్శిస్తూ ఉంటాము- అని అర్థం. **"మధురమ్"** అంటే -పరమభోగ్యమని అర్థం. **"భోగ్య"**మంటే -సుందరమని, లేక, మోహజనకమని అర్థం.

39) సురభితనిగమాన్తం వన్దిషీయేన్దిరాయాః
తవ కమలపలాశప్రక్రియం పాదయుగ్మమ్ ।
వహతి యదుపమర్దైః వైజయన్తీ హిమామ్భః
ప్లుతిభిరివ నవత్వం కాన్తబాహోన్తరాళే ॥

ఇందిరాయాః = పరమైశ్వర్యాన్ని కల, తవ = నీ యొక్క, సురభిత = పరిమళించేటట్లు చేయబడిన, నిగమాంతం = వేదాంతాలను కల్గినది, కమలపలాశ= తామరపూవు రేకుయొక్క, ప్రక్రియం = ప్రకారాన్ని కల్గినవై ఉండే, పాదయుగ్మం= చరణయుగ్మాన్ని, వందిషీయ = నమస్కరిస్తాను, యత్+ఉపమర్దైః = ఏ శ్రీచరణాల ఉపమర్దనాల ద్వారా, కాంత+బాహ+అంతరాళే = ప్రియుడైన భగవానుని వక్షఃస్థలంలో, వైజయంతీ = వనమాల, హిమ+అంభః = మంచునీటియొక్క, ప్లుతిభిః ఇవ= జల్లులచేత వలె, నవత్వం = కొత్తదనాన్ని, వహతి = వహిస్తున్నదో.

**వ్యాఖ్యానమ్:-** గడచిన శ్లోకంలో లక్ష్మీదేవిని శరణు పొందారు. **"అకలకిల్లేన్ ఇఱైయుమెన్ఱు అలర్మేల్ మఙ్గై యుఱై మార్బా!"** (క్షణం కూడా విడిచి ఉండలేనని పలికే పద్మనివాసిని నిత్యవాసం చేసే వక్షఃస్థలాన్ని కలవాడా!) అని, **"పూవార్ తిరుమకళ్ పుల్కియ మార్బా!"** (పూలు నిండుగా కల లక్ష్మీదేవినివసించే వక్షః స్థలాన్ని కలవాడా!) అని పలికిన రీతిలో లక్ష్మి భగవానుని వక్షస్సులో స్థిరంగా నిలచి, నిత్యవాసం చేసే రీతినికూడా అనుసంధిస్తున్నారు.

**(ఇందిరాయా స్తవ పాదయుగ్మం వందిషీయ)**- ఓ శ్రీరంగనాయకీ ! ఐశ్వర్యప్రదమైన నీ శ్రీచరణయుగ్మాన్ని ఆశ్రయించి, స్తుతిస్తాను. అది ఎటువంటిది? అని అంటే,

**(సురభితనిగమాంతమ్)** - వేదాంతాలను అన్నిటిని పరిమళింపజేసేది- వేదాంతవేద్యం - అని తాత్పర్యం. ఇంకా ఎటువంటిది? అని అంటే,

**(కమలపలాశప్రక్రియమ్)**- తామరపూవు రేకులవలె ఎఱ్ఱదనాన్ని అందాన్ని- కల్గినది. ఇంకా ఎటువంటిది?- అని అంటే - భగవానుని వక్షఃస్థలంలో వైజయంతితో పాటుగా వెలిగేది - అని చెప్పగోరి, దానిని ఒక చమత్కారోక్తితో ఉత్తరార్ధంలో పల్కుతున్నారు. భర్తయొక్క వక్షఃస్థలంలో వైజయంతి అనే వనమాల ఈ శ్రీచరణయుగ్మంయొక్క సంఘర్షాన్ని పొందినా, వాడకుండా నిగనిగ

లాడడమేకాక, పన్నీరు చల్లినట్లుగా అపుడే వికసించిన పూవువలె వెల్గుతున్నదట. దీనిద్వారా – అతని వక్షఃస్థలాన్ని విడచి ఉండకపోవడం, పరమసౌకుమార్యం తెలుపబడ్డాయి.

**40) త్వత్ స్వీకారకలావలేపకలుషా రాజ్ఞాం దృశో దుర్వచాః**
**నిత్యం త్వన్మధుపానమత్తమధుపశ్రీనిర్భరాభ్యాం పతిమ్ ।**
**దృగ్భ్యామేవ హి పుణ్డరీకనయనం వేదో విదామాస తే**
**సాక్షాలక్ష్మి! తవావలోకవిభవః కాక్వా కయా వర్ణ్యతే? ॥**

లక్ష్మి=ఓ లక్ష్మీదేవీ! రాజ్ఞాం = రాజులయొక్క దృశః = నేత్రాలు, త్వత్= నీయొక్క స్వీకార = స్వీకారంలోని (అనుగ్రహంలోని), కలా = అల్పభాగం వల్ల కల్గిన, అవలేప= గర్వంతో, కలుషాః = కాలుష్యాన్ని – ఎఱ్ఱదనాన్ని–పొందినవై, దుర్వచాః = మాటలతో వర్ణించరానివిగా అవుతున్నాయో, నిత్యం = సదా, త్వత్= నీవు అనే, మధు = మధువును, పాన = తాగడంచేత, మత్త= మదాన్ని (ఎఱ్ఱదనాన్ని) పొందిన, మధుప = తుమ్మెదల యొక్క శ్రీ = శోభతో, నిర్భరాభ్యాం = నిండినవైన, దృగ్భ్యామ్ ఏవ హి = నేత్రాలతోనే కదా, తే = నీయొక్క, పతిం = భర్త అయిన నారాయణుని, వేదః = వేదం, పుండరీక నయనం = **"తస్య కప్యాసం పుండరీక మేవమక్షిణీ"** ఇత్యాదిగా పుండరీకాక్షునిగా, విదామాస = తెలిసికొన్నది, తవ= నీయొక్క అవలోకవిభవః = కటాక్షవైభవం, కయా కాక్వా = ఏరీతిలో, సాక్షాత్ = నేరుగా, వర్ణ్యతే = వర్ణింపబడుతున్నది. (వర్ణించడానికి సాధ్యం కాదు)

**వ్యాఖ్యానమ్ :–** ఈ శ్లోకంద్వారా, శ్రీరంగనాయకికటాక్షాలయొక్క మహిమ మనం వాక్కులతో పలుకడానికి సాధ్యమైన రీతిలో లేదు– అని నిరూపింపబడు తున్నది. లక్ష్మీదేవియొక్క విషయీకార (కటాక్ష)లేశం పొందినవారైన రాజుల నేత్రాలను గూర్చి పలుకడమే మనవల్ల సాధ్యం కాని కార్యంగా ఉండగా, ఆ లక్ష్మీదేవి నేత్రాలనుగూర్చి సాక్షాత్తుగా పల్కడం మనకు సాధ్యమా? అనేది మొదటి పాదంలోని భావం.

**(రాజ్ఞామ్)**– ఈపదం లోకపాలకులనుండి ఈనాటివరకు గల పాలకులను సూచిస్తున్నది. ఇతఃపూర్వం **"అపాంగా భూయాంసః"** అనే శ్లోకంలో **"అమీ యత్ర ద్విత్రాః స చ శతమఖాది స్తదధరాత్"** అని అంటూ లక్ష్మీదేవియొక్క

స్వల్పకటాక్షానికి లక్ష్యభూతులైనవారే బ్రహ్మ మొదలైనవారు అయినారు- అని పల్కడం, **"ఆకుగ్రామనియామకాత్'** అనే శ్లోకంలోని ప్రమేయం ఇక్కడ అనుసంధేయాలు. లక్ష్మీదేవికటాక్షలేశాన్ని పొంది గొప్పతనాన్ని పొందినవారి కంటి చూపే మనకు వర్ణించడానికి వీలు లేని రీతిలో ఉన్నపుడు, ఇక ఆ లక్ష్మీదేవి కటాక్షవీక్షణాలనుగూర్చి సాక్షాత్తుగా పల్కడం ఏ విధంగా సాధ్యం ?- అని మొదటి పాదంలో తెలుపబడినట్లయినది.

ఇక, రెండవ పాదం, మూడవ పాదం కలసి ఒకే వాక్యార్థం. క్షుద్ర ప్రభువులనుగూర్చిన మాట అటు ఉండనీ. మహాప్రభువైన శ్రీమన్నారాయణుని గూర్చియే ప్రస్తావిద్దాం. అతడు లక్ష్మీదేవి అనే మధువును పానం చేసే విషయంలో తుమ్మెదవలె ఉండే తన తిరునేత్రాలకు, ఆ మధుపానమే కారణంగా ఒక గొప్ప అతిశయాన్ని పొందినవాడయ్యాడు. ఆయన నేత్రసౌందర్యం మనవంటివారి వాక్కులకు విషయం కాకుండా, వేదమే పలుకవలసిన రీతిలో ఉన్నదై, ఆ వేదంకూడా విస్తృతంగా దానినిగూర్చి పలుకలేకుండా **"తస్య యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ"** (పరమాత్మ నేత్రాలు రెండు తెల్ల తామరలవంటివి) అని అని అంటూ పుండరీకాక్షుడని మాత్రం పల్కి ఊరకున్నది. భగవానుని తిరు నేత్రాలకు ఈ విధమైన అతిశయం లక్ష్మీదేవిని నిరంతరం అనుభవించినందు వల్లనే (చూస్తూ ఉన్నందువల్లనే) కల్గింది.

అందువల్ల, లక్ష్మీదేవిచేత కటాక్షింపబడినవారైన ప్రభువుల వీక్షణ విభవమే మనకు పలుకడానికి కానిదై ఉన్నది. ఇక, లక్ష్మీదేవిని నిరంతరం వీక్షించే భగవానుని వీక్షణవిభవం అయితే వేదానికికూడా విస్తృతం పలుకడానికి సాధ్యం కానిదై, ఏదో ఒక మాటలతో మాత్రమే పలుకడానికి వీలయినదిగా ఉన్నది. ఈవిధంగా ఉండగా, ఇంతటికీ మూలకారణమైన ఆ లక్ష్మీదేవియొక్క కటాక్షాన్ని గూర్చి సాక్షాత్తుగా కొంచెం పల్కుదాం- అని అంటే ఈ పని ఏవిధంగా సాధ్య మవుతుంది? అని చెప్పినట్లయినది. ఒక ఉదారుడైన ధనికుని వద్ద ఒకనాడు క్షణకాలం దానం గ్రహించినవాని సంపదతిశయాన్నే మాటలతో పలుకడం వీలు కాకుండా ఉన్నది- అని అంటే, ఇక ఆ ఉదారుని ఐశ్వర్యాన్ని నేరుగా ప్రస్తావించి వర్ణించడం ఏవిధంగా సాధ్యం? అనే రీతిలో ప్రకృతార్థం తెలుపబడింది.

(త్వన్మధుపానమత్తమధుపశ్రీనిర్భరాభ్యాం దృగ్భ్యామ్)- ఈ ప్రయోగంలోని భావమేమంటే- భగవానుని తిరునేత్రాలు "కరియవాకి పుడై పరన్దు" (నల్లనివై, విస్తరించి) అనే తిరుప్పాణ్ ఆళ్వార్లయొక్క దివ్యసూక్తుల క్రమంలో నల్లగా ఉన్నాయి - అని. ఆ నల్లనిదనం దేనినిబట్టి చెప్పబడుతున్నది? అని అంటే, ఆ నేత్రాలలో ఉండే కనుపాపలను (కనీనికలను) బట్టి చెప్పబడుతున్నది. ఆ నల్లని కనుపాపలు మధుపానంతో మత్తెక్కిన తుమ్మెదలవలె ఉన్నాయి. తుమ్మెద మధువ్రతం కనుక, ఆ తుమ్మెదలకు ఏది మధువు? అని అంటే, "త్వన్మధు"- శ్రీరంగనాయకి (లక్ష్మి) యొక్క తిరుమేనియే ఒక మధువు. ఆ మధువును నిత్యం పానం చేసిన నల్లని తుమ్మెదలవలె భగవానుని తిరునేత్రాలు- ఉన్నాయి- అని భావం. "త్వమేవ మధు-త్వన్మధు" అనే సమానాధికరణ సమాసం ఇక్కడ వివక్షితం.

**41) ఆనన్దాత్మభి రీశమజ్జనమదక్షీబాలసై రాగల -**
**ప్రేమార్ద్రైరపి కూలముద్వహత్కృపా సంప్లావితాస్మాదృశైః ।**
**పద్మే! తే ప్రతిబిన్దుబద్ధకలిక బ్రహ్మాదివిష్కమ్భకైః**
**ఐశ్వర్యోద్గమగద్గదై రశరణం మాం పాలయాలోకితైః ॥**

పద్మే=ఓ శ్రీరంగనాయకీ!, తే=నీయొక్క, ఆనంద+ఆత్మభిః=ఆనంద స్వరూపాలు, ఈశమజ్జన = భగవానుని ఆనందంలో పూర్తిగా మునిగేటట్లుచేయడం చేత కల్గిన, మద=సంతోషమనే, మద=మద్యంతో, క్షీబ=మత్తును పొందినవై, అలసైః=అలసటను పొందినవి, ఆగళ=ఆకంఠం కల, ప్రేమ= ప్రీతిచేత, ఆర్ద్రైః=చల్లనివి (తడిసినవి), అపి=అంతేకాక, కూలముద్వహ = ఒడ్డును ఒరసికొని ప్రవహించే, కృపాసంప్లావిత = దయ అనే నీటితో ముంచెత్తిన, అస్మాదృశైః = మావంటి అనన్యశరణులను కల్గినవి, ప్రతిబిందు=ప్రతిబిందువులోను, బద్ధకలిక = స్పర్ధించే, బ్రహ్మాదివిష్కంభకైః = బ్రహ్మ మొదలైనవారిని ముఖ్యులుగా కల్గినది, తమ గొప్పతనాన్ని మఱచి "ఈ అనుగ్రహం నా కోసమే" అని కలహించే బ్రహ్మాదులను కల్గినది? ఐశ్వర్య+ఉద్గమగద్గదైః = ఐశ్వర్యంయొక్క ఉత్పత్తివల్ల తొట్రుపాటును కల్గినవి అయిన, ఆలోకితైః = నీ కటాక్షాలతో, అశరణం మాం = నిన్ను తప్ప ఏ శరణం లేని నన్ను, పాలయ = రక్షించు.

వ్యాఖ్యానమ్ :- శ్రీరంగనాయకియొక్క కటాక్షవీక్షణవైభవాన్నే మళ్ళీ వర్ణించి, ఆ కటాక్షవీక్షణం తమపై ప్రసరించాలని ఇందులో ప్రార్థిస్తున్నారు.

**(హే పద్మే! తే ఆలోకితైః మాం పాలయ)**- ఓ శ్రీరంగనాయకీ! నీ తిరునేత్రాలతో దాసుడనైన నన్ను రక్షించాలి. ఆ కటాక్షవీక్షణాలు ఉండే రీతి ఏది? అని అంటే, ఆఱు విశేషణాలతో ఆ కటాక్షాలను విశేషిస్తున్నారు.

**(ఆనందాత్మభిః)**- గొప్ప ఆనందమే మూర్తీభవించినవి- అని అర్థం. ఆనందసందోహగంధాలై ఉన్నది- అని భావం.

**(ఈశమజ్జనమదక్షీబాలసైః)**- ఉభయవిభూతినాథుడైన భగవానుడు కూడ, తరువాత (55వశ్లోకంలో) **"క్వచన హి విభ్రమభ్రమిముఖే వినిమజ్జతి తే"** అని పల్కిన రీతిలో, దానిలో మునిగిపోతున్నాడనే కారణంవల్ల ఏర్పడిన గర్వాన్ని కల్గినవై ఉంటాయి. క్షీబత్వమంటే -మత్తత్వం. లక్ష్మీదేవి కటాక్షవీక్షణాల ఒక మూలలో ఉభయవిభూతినాయకుడు మునిగి పోతున్నాడు అంటే, ఇది మదహేతువే కదా! అంతకుమించి, **"అలసైః"**- పదం కల్గినవారికి సహజంగా ఉండే స్వభావాన్ని తెల్పుతున్నది.

**(ఆగళప్రేమార్ద్రైః)**- ఆకంఠం పూర్ణంగా ఉండే ప్రేమతో తడుపబడినవి- పరిపూర్ణప్రేమగర్భాలు- అని భావం.

**(కూలముద్వహకృపాసంప్లావితాస్మాదృశైః)**- రెండు తీరాలను కూలగొడుతూ ప్రవహించే కృపాప్రవాహాన్ని మన వంటి ఎత్తైన స్థలాలలో కూడా అధిరోహించి ప్రవహించేటట్లు చేసేవి. మనవంటివారిపై కూడా కరుణ పొంగి పొర్లేవి- అని తాత్పర్యం.

**(ప్రతిబిందుబద్ధకలికబ్రహ్మాదివిష్కంభకైః)**- కటాక్షలేశం పడిన చోటు అంతటా బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు మొదలైన నిర్వాహకులుగా భాసించేటట్లున్నది. ఇతఃపూర్వమే **"అమీ యత్ర ద్విత్రాః స చ శతమఖాది స్తదధరాత్"** అని పల్కిన సూక్తి ఇక్కడ అనుసంధేయం. **"విష్కంభక"**శబ్దం నిర్వాహకుడనే తాత్పర్యాన్ని ఇస్తుంది.

**(ఐశ్వర్యోద్గమగద్గదైః)**- అతిశయితమైన సంపదను కల్గించగల్గినది- అని భావం. ఇటువంటి కటాక్షవీక్షణాలతో అనన్యగతికుడనైన నన్ను కటాక్షించాలి- అని అంటున్నారు.

భట్టర్ ఈస్తుతి ఆరంభంలోనే "**పరిచితమివాథాపి గహనమ్, త్వమేవ శ్రీః ! మహ్యం బహుముఖయ వాణీవిలసితమ్**" అని అంటూ విలక్షణవాగ్వైఖరిని ప్రార్థించినవారు కనుక, అటువంటి వాగ్విలసితాన్ని ఈ శ్లోకంలో విశేషించి దర్శించవచ్చు. ఇందులోని అతిగంభీరాలైన ప్రయోగాలను దర్శించాలి.

ఇందులోని మూడవ పాదం ఆరంభంలో "**పద్మే! తే**" అనే దానిని రెండు పదాలు గ్రహించకుండా, ఒకే పదంగా గ్రహించే శ్రమను కొందరు పడతారు. అది అనావశ్యకం.

**42) పాదారున్తుదమేవ పఙ్కజరజశ్చేటీభృశాలోకితైః**
**అఙ్గమ్లాని రథామ్బ! సాహసవిధౌ లీలారవిన్దగ్రహః ।**
**దోలా తే వనమాలయా హరిభుజే హా కష్టశబ్దాస్పదం**
**కేన శ్రీరతికోమలా తనురియం వాచాం విమర్దక్షమా! ॥**

అంబ = తల్లీ, శ్రీః = లక్ష్మీస్వరూపిణివి అయిన శ్రీరంగనాయకీ!, పంకజరజః= (మెత్తని) పద్మాల పుప్పొడి (కూడా), తే పాదారుంతుదః = నీపాదాలకు బాధకంగా ఉన్నది, చేటీ = (నీ) చెలికత్తెల, భృశ+ఆలోకితైః = మాటిమాటికి చూచే చూపులతో, అంగమ్లానిః = నీ దేహం వాడిపోతున్నది, అథ=అంతేకాక, తే లీలారవిందగ్రహః = నీవు లీలాపద్మాన్ని (చేతిలో) ధరించడం, సాహసవిధౌ = సాహసకార్యం అవుతున్నది, తే = నీయొక్క (నీవు), హరిభుజే = భగవానుని వక్షఃస్థలంలో, వనమాలయా = వైజయంతీ మాలచే, డోలా = ఊగిసలాడడం, (ఉయ్యెల ఊగడం), హాకష్ట శబ్దాస్పదం = "అయ్యో! కష్టం" – అని అనడానికి తగినది, అతికోమలా = మిక్కిలి సుకుమారమైన, ఇయం = ఈ, తనుః = (నీ) దివ్యదేహం, కేన = ఏ కారణంవల్ల, వాచాం = (నావంటి వారి) వాక్కుల, విమర్దక్షమా = విమర్దాన్ని సహించ గల్గినదిగా ఉంటుంది?

**వ్యాఖ్యానమ్ :–** శ్రీరంగనాయకి యొక్క సౌకుమార్యాతిశయం ఎవరికి. నోరు తెరచి వర్ణించడానికి సాధ్యం కానిది– అని ఇందులో పల్కుతున్నారు.

**(పంకజరజః తే పాదారుంతుదమేవ)** – తామరపూవులో ఉండే అతి సుకుమారమైన రజస్సుకూడ నీ శ్రీపాదాలకు అరుంతుదం – మర్మాలను తాకి బాధించేది – అవుతున్నది. అది నీ శ్రీచరణాలను దహించినందువల్లనే కదా, నీవు భగవానుని వక్షస్సును చేరి నిలచి ఉన్నావు.

**(చేటీభృశాలోకితైః అంగమ్లానిః)** – చెలికత్తెలు మాటిమాటికిగా నిశితంగా చూస్తే కూడా నీ దివ్యాంగాలు వాడిపోతాయి.

**(అథ లీలారవిందగ్రహః సాహసవిధౌ)** – ఇక, నీవు శ్రీహస్తంలో లీలార్థం పద్మాన్ని ధరించడం కూడా గొప్ప సాహసకార్యమనే రీతిలో ఉన్నది.

**(హరిభుజే వనమాలయా సహ డోలా హాకష్టశబ్దాస్పదమ్)** – భగవానుని భుజాలలో (వక్షస్సులో) వనమాలతోపాటు నీవు ఊగులాడడాన్ని చూస్తే, **"హా! కష్టం! హా! కష్టం"** అని అంటూ హాహాకారాలను చేయాలి; అంతే. ఇది అంతా నీ అపరిమితసౌకుమార్యనిబంధనం. తామరపూవులో నివసించడం ముళ్ళ పొదలలో నివసించేటట్లుగా ఉన్నది. భూదేవి, నీళాదేవి మొదలైన సపత్నులు గమనించి చూడడంకూడా నీ మేని వాడిపోవడానికి కారణమవుతున్నది. లీలాపద్మాన్ని నీవు చేతిలో ధరించడంకూడా సాహసకోటిలో లిఖించేటట్లున్నది. శ్రియఃపతి వక్షః స్థలంలో నీవు ఉయ్యాల ఊగడంకూడా అవద్యశంకావహమై ఉన్నది – అని అనడం ద్వారా లక్ష్మీదేవి సౌకుమార్యపరమావధి తెలుపబడింది. ఇటువంటి సౌకుమార్యం కవుల పరుషాలైన వాక్కులతో వర్ణింపబడినా వాడిపోతుంది. కనుక, దీనిని ఎవరు వర్ణించగలరు? అని అంటూ శ్లోకాన్ని నిగమిస్తున్నారు.

**43) ఆమర్యాద మకణ్టకం స్తనయుగం నాద్యాపి నాలోకితః**
**భ్రూభేదస్మితవిభ్రమా జహతి వా నైసర్గికత్వాయశః ।**
**సూతే శైశవయౌవనవ్యతికరో గాత్రేషు తే సౌరభం**
**భోగస్రోతసి కాన్తదేశికకరగ్రాహేణ గాహక్షమః ॥**

స్తనయుగం = నీ స్తనయుగ్మం, ఆమర్యాదం = ఉండవలసిన హద్దువరకు, అద్యాపి = ఈనాటికి, అకంటకం = అడ్డులేనిదిగా, న=లేదు, అలోకిత = కటాక్షాల యొక్క, భ్రూభేద = కనుబొమలు కదలికలయొక్క, స్మిత = చిఱునవ్వుయొక్క, విభ్రమాః వా=విలాసాలు కూడా, నైసర్గిత్వ=స్వాభావికత్వంవల్ల కల్గిన, అయశః = అపకీర్తిని, అద్యాపి = ఈనాటికీ, న జహతి=విడువడంలేదు (స్వతస్సిద్ధాలు), భోగ స్రోతసి = అనుభవప్రవాహంలో, కాంత = ప్రియుడైన భగవానుడనే, దేశిక = ఆచార్యుని, కర = హస్తాన్ని, గ్రామేణ = పట్టుకోవడంచేత, గాహ = లోపలకు దిగడంలో (మునగడంలో), క్షమః = సమర్థమైన, శైశవ = శిశుత్వం (బాల్యం), యౌవన = యౌవనం – అనే వీటి,

వ్యతికరః = సంబంధం (కలయిక), తే గాత్రేషు= నీ అవయవాలలో, సౌరభం సూతే= ఒక అపూర్వమైన సౌగంధ్యాన్ని కల్గిస్తున్నది.

వ్యాఖ్యానమ్ :- శ్రీరంగనాయకియొక్క పరువంలోని తారుణ్యాన్ని ఇందులో వర్ణిస్తున్నారు. "హే శ్రీః!" అనే సంబోధనపదాన్ని ఇక్కడ అధ్యాహరించుకోవాలి.

**(తే స్తనయుగమ్ అద్యాపి అమర్యాదమ్ అకంటకమ్ న)- "ములైయో ముழுు ముగ్ర్గుమ్ పోన్దిల"** (స్తనాలైతే ఇంకా పూర్ణంగా ఆవిర్భవించనే లేదు) అని నమ్మాழ்వార్లు, **"కొజ్జై యిన్నుమ్ కువిన్దెழுన్దిల"** (స్తనాలు ఇంకా ఆవిర్భవించ లేదు) అని పెరియాழ்వార్లు పల్కిన సూక్తులు ఇక్కడ అనుసంధేయాలు. స్తనోద్భేదానికి ఒక స్థలావకాశావధి ఉన్నదికదా! ఆ అవకాశానికి **"మర్యాదా"** అని పేరు. **"అమర్యాదమ్"** అని అంటే - మర్యాదపర్యంతం - అని అర్థం. **"అకంటకమ్ న"** అంటే ప్రతిరోధం ఏమీ లేకుండా లేదు - అని అర్థం. పరిపూర్ణమైన స్తనోద్భేదమ్ వయస్సువల్ల ప్రతిరుద్ధమవుతున్నది. అడ్డగింపబడుతున్నది- అని భావం.

**(ఆలోకితభ్రూభేదస్మితవిభ్రమానైసర్గికత్వాయశః న జహతి)** - విలాసార్థక మైన విభ్రమశబ్దం ఆలోకిత - అనే పదంలోను, భ్రూభేద - అనే పదంలోను స్మిత- అనే పదంలోను అన్వయించాలి. ఆలోకిత విభ్రమం, భ్రూభేదవిభ్రమం, స్మితవిభ్రమం - అని అర్థం చెప్పాలి. చూపు, ఆ చూపులో ఒక విలాసం ఉంటుంది. భ్రూభంగంలోను ఒక విలాసం ఉంటుంది. చిఱునవ్వులోను ఒక విలాసం ఉంటుంది. ఇవి అన్నీ సహజమైన రీతిలో ఉన్నవే తప్ప యౌవనపరువానికి తగిన రీతిలో లేవు- అని భావం. ఇది కూడా యౌవనదశాపూర్తి లేదనే విషయాన్ని సూచిస్తుంది. "వా" అనే అవ్యయం చకారస్థానంలో ప్రయోగింబడినందున సముచ్చయార్థకం. **"ఆలోకిత... విభ్రమాః నైసర్గికా ఏవ సంతి"** అని అనకుండా **"నైసర్గికత్వాయశః న జహతి"** అనే సూక్తి భట్టర్‌కు మాత్రమే అసాధాణమైన ఉక్తిచమత్కారంలో చేరుతుంది. నైసర్గికత్వమంటే- స్వాభావికత్వం. దానిని ఒక అపకీర్తిగా తలచి, అది ఇంకా తీరలేదు- అని అనడం ఒక విలక్షణసూక్తి ప్రక్రియయే. ఇక, ఈ శ్లోకంలోని ఉత్తరార్థంయొక్క భావం ఏమంటే-

**(శైశవయౌవనవ్యతికరః తే గాత్రేషు సౌరభమ్ సూతే)**- అధికమైన కౌమారంగాని, అధికమైన యౌవనంగాని ఉంటే విరసమే అవుతుంది. కౌమార

యౌవనాల సంధి అయిన పరువంగా ఉండే నీ దివ్యావయవాలలో ఈ నీ పరువం విలక్షణమైన పరిమళాన్ని కలుగజేస్తున్నది- అని భావం. శైశవమనే పదం శిశుప్రాయాన్ని మాత్రమే తెలుపదు. కౌమారావస్థనుకూడా తెలుపగలదు. **"శైశవేఽభ్యస్తవిద్యానామ్"** అనే రఘువంశప్రయోగాన్ని గమనించాలి. కౌమార యౌవనాల సంధి అయిన ఆ పరువం ఎటువంటిది? అని అంటే, దానిని నాల్గవ పాదంతో పల్కుతున్నారు.

**(భోగస్రోతసి కాంతదేశికకరగ్రాహేణ గాహక్షమః)**- భోగప్రవాహాన్ని ప్రస్తావిస్తే, వల్లభుల (భర్తల) కరావలంబాన్ని పురస్కరించుకొనే ప్రవేశించవలసి నట్లుగా ఉంటుంది. దేశికశబ్దం "ఆ అవస్థకు తగినవాడు" అనే అర్థాన్ని పురస్కరించుకొనే ప్రయోగింపబడింది. మహానదీప్రవాహంలో ప్రవేశించవలసి వస్తే, ఆ చోటు పరిచయమైన వారై, అక్కడ ఉండే మిట్టపల్లాల స్థితిని తెలిసినవారై ఉండే స్థానికుల చేయూతను గొని దిగేటట్లే, లక్ష్మీదేవికూడా భగవద్భోగప్రవాహంలో స్వతంత్రంగా అవగాహించలేని అవస్థ తెలుపబడింది. దీనివల్ల ప్రాయంలోని చిన్నతనం స్థిరీకరింపబడింది. పూర్వం **"భోగోపోద్ఘాతకేళీ చులుకితభగవద్వైశ్య రూప్యానుభావా"** అని పల్కిన సూక్తితోను, తరువాత పలుకబోయే **"దశశతపాణి పాదే"**త్యాది శ్లోకంతోను ఇది ఏవిధంగా పొసగుతుంది? అని శంకించరాదు.

**44) ఆమోదాద్భుతశాలి యౌవనదశావ్యాకోచ మమ్లానిమత్**
**సౌన్దర్యామృతసేకశీతల మిదం లావణ్యసూత్రార్పితమ్ ।**
**శ్రీరఙ్గేశ్వరి! కోమలాఙ్గసుమనస్సన్దర్భణం దేవి! తే**
**కాన్తోరఃప్రతియత్న మర్హతి కవిం ధిఙ్ మామకాణ్డాకులమ్ ॥**

శ్రీరంగేశ్వరి = ఓ శ్రీరంగనాయకీ, దేవి = దేవేరీ! ఆమోద + అద్భుతశాలి = సువాసనవల్ల ఆశ్చర్యంగా ప్రకాశిస్తున్నది, యౌవనదశా = యౌవనదశ-అనే, వ్యాకోచం= వికాసాన్ని కల్గినది, అమ్లానిమత్ = మ్లానాన్ని లేనిది (వాడనిది), సౌందర్య+అమృత= సౌందర్యమనే అమృత జలంతో, సేక= తడుపడంచేత, శీతలం = చల్లనిది, లావణ్యా= (సముదాయశోభ అనే) లావణ్య మనే, సూత్ర = దారంలో, అర్పితం = కూర్చబడినది అయిన, ఇదం = ఈ, తే = నీయొక్క, కోమలాంగ = సుకుమారాలైన అవయవాలు అనే, సుమనః = పూల, సందర్భణం = మాలిక అనేది, కాంత = నీ ప్రియుడైన

భగవానుని యొక్క ఉరః = వక్షస్సుకు, ప్రతియత్నం=గొప్ప అలంకారంగా, అర్హతి=తగి ఉన్నది. (ఇటువంటి నిన్ను కీర్తించాలని భావించి), అకాండ+ఆకులం=తగని మార్గంలో కలత పడిన, కవిం=కవి అయిన, మాం=నన్ను, ధిక్=నిందించాలి (ధిక్కరించాలి)

**వ్యాఖ్యానమ్ :-** శ్రీరంగనాయకియొక్క దివ్యమంగళరూపాన్ని ఒక పూమాలికగా రూపించి, ఈ మాలిక భగవానుని వక్షఃస్థలానికి అలంకారంగా భాసిస్తున్నదని పల్కి, ఈ విధంగా పల్కడంకూడా ఉచితం కాదుకదా- అనే అనుతాపంతో ఈ శ్లోకాన్ని పూర్తిచేస్తున్నారు.

**(హే శ్రీరంగేశ్వరి! దేవి!)**- దేవదేవదివ్యమహిషివి అయిన ఓ శ్రీరంగ నాయకీ!

**(తే కోమలాంగసుమనస్సందర్భణమ్)**- నీ పరమసుకుమారమైన తిరుమేని అనే పూమాలిక,

**(కాంతోరఃప్రతియత్న మర్హతి)** - శ్రీరంగనాథుని వక్షస్సుకు పరిష్కరణంగా కాదగిన అర్హతను కల్గినది. భగవానుని వక్షస్సును అలంకరించగల్గినది- అని భావం. లక్ష్మీదేవియొక్క తిరుమేనిని పూమాలికగా నిరూపించడానికి తగిన ఉపపత్తులను విశదంగా పూర్వార్ధం తెల్పుతున్నది. భగవానుని వక్షఃస్థలానికి అలంకారం కాదగిన పూమాలిక పరిమళ ప్రచురంగాను, వికాసశాలిగాను, వాడనిదిగాను ఉంటుంది. లక్ష్మీదేవియొక్క తిరుమేనికూడా ఆ విధంగా ఉన్నదని అంటున్నారు.

**(ఆమోదాద్భుతశాలి)**- అద్భుతమైన పరిమళాన్ని కల్గినదై ఉన్నది- అనేది పునరుక్తం- **"సూతే శైశవయౌవనవ్యతికరో గాత్రేషు తే సౌరభమ్"** అనేది గడచిన శ్లోకంలో చెప్పబడింది కదా.

**(యౌవనదశావ్యాకోచమ్)** - ఇక్కడ యౌవనశబ్దం గడచిన శ్లోకంలో నిర్ణయించిన కౌమార-యౌవనాల సంధియైన పరువాన్ని తెల్పుతున్నది. ఆ పరువానికి తగిన వికాసాన్ని కల్గినదని భావం.

**(అమ్లానిమత్)**- ఇంకా ఇంకా వికాసోన్ముఖమై ఉన్నందువల్ల వాడడానికి (మ్లానిని పొందడానికి) ప్రసక్తి లేనిదై ఉన్నది.

**(సౌందర్యామృతసేకశీతలమ్)** – అందమైన అమృతాన్ని చల్లినందువల్ల చల్లగా ఉన్నది.

**(లావణ్యసూత్రార్పితమ్)** – లవణ్యమనే దారంలో కూర్చబడినది. లావణ్యమనేది అన్ని అవయవాలలోను అనుస్యూతంగా ఉండేది కనుక, దానిని సూత్రంగా రూపించడంలో ఔచిత్యం ఉన్నది. అందువల్ల ఈ అయిదు స్వభావాల ద్వారా పూమాలికగా చెప్పడానికి తగిన లక్ష్మీదేవి తిరుమేని భగవానుని వక్షస్సుకు అలంకారం కాదగినది – అని అనగానే, ఇతఃపూర్వం 42వ శ్లోకంలో **"డోలా తే వనమాలయాహరిభుజే హాకష్టశబ్దాస్పదమ్"** అని పల్కిన దానిని భావించి, "ఆ రీతిలో పల్కడం ఉచితం కాదుకదా" అని తలచి, ఆ రీతిని విరమించి,

**(కవిమ్ ధిఙ్మామకాందాకులమ్)**– అని అంటూ తలపై మోదుకొంటున్నట్లుగా పల్కుతున్నారు. భగవానుని వక్షఃస్థలానికి పూమాలిక అలంకారం కావచ్చు. అది ఎక్కడ? ఈ తిరుమేని ఎక్కడ? వాచామగోచరమైన సౌకుమార్యాన్ని కల్గిన ఈ తిరుమేనికి తామరపూవు కాలు కాలినట్లుగా ఉంటుందికదా! ఏమని పలికాను? ఏమని పలికాను? అస్థానంలో సంభ్రమాన్ని పొంది పల్కిన నేను కూడా ఒక కవియేనా? అని అంటున్నారు. దీనివల్ల లక్ష్మీదేవి తిరుమేనియొక్క సౌకుమార్యాతిశయమే సూచితమైనది. కర్కశమైన స్వామి వక్షఃస్థలంలో లక్ష్మీదేవి **"అకలకిల్లేన్ ఇఱైయుమ్"** అని నిత్యవాసం చేయడం ఆమె సౌకుమార్యానికి తగినది కాక పోయినా, ఆశ్రితవాత్సల్యాతిశయంవల్ల అది సంభవించింది– అనేది ఆంతరమైన భావం.

45) **మర్మస్పృశో రససిరావ్యతివిధ్య వృత్తైః**
**కాన్తోపభోగలలితై ర్లులితాఙ్గయష్టిః ।**
**పుష్పావలీవ రసికభ్రమరోపభుక్తా**
**త్వం దేవి! నిత్య మభినన్దయసే ముకున్దమ్ ॥**

దేవి=శ్రీరంగనాయకీ!, మర్మస్పృశః = మర్మాలను తాకే, రససిరాః = రసనాడులను, వ్యతివిధ్య = తాకి, వృత్తైః = ప్రవర్తించినవి అయిన, కాంత+ఉపభోగ = కాంతుని అనుభవంయొక్క, లలితైః=విలాసాలతో, లులిత = సొక్కిన (అలసిన), అంగయష్టిః= కొమ్మవంటి సుకుమారశరీరాన్ని కల్గినదానవై, రసికభ్రమర= పుష్పరసాన్ని ఆస్వాదించే

తుమ్మెదచేత, ఉపభుక్త = పూర్ణంగా అనుభవింపబడిన, పుష్పావళీ+ఇవ = పూల వరుస (మాలిక) వలె, త్వం = నీవు, ముకుందం = ముకుందుని, నిత్యం = నిత్యం, అభినందయసే = ఆనందింప జేస్తున్నావు.

**వ్యాఖ్యానమ్ :–** లక్ష్మీదేవి, అழகియమణవాళన్ (శ్రీరంగనాథుని)తో కలసి ఆనందించే రీతిని తమ వాక్సామర్థ్యం భావించే రీతిలో ఈ శ్లోకంద్వారా అనుగ్రహిస్తున్నారు. లౌకికులైన నాయకీ నాయకులు ఉపభోగం గుహ్యమైనది కనుక, నాటకాదులలో అది చెప్పబడవలసిన ప్రసక్తి ఏర్పడినా, దానిని శబ్దతః పలుకకుండా గూఢంగా తెలుపబడుతుంది. శాకుంతల నాటకాదులలో దీనిని చూడవచ్చు. భగవానునకు, లక్ష్మీదేవికి కల భోగం అపరాధభూయిష్ఠులైన చేతనులను భగవానుడు స్వీకరించడంకోసం సంభవించే (ప్రయత్నించే) ఒక పరిచర్య కనుక, **"అల్లిమలర్ పోకమయక్కుక్కళాకియుమ్ నిఱ్కుమ్ అమ్మాన్"** (పద్మనివాసిని సంశ్లేషంవల్ల కలిగే ఆనందాన్ని పొందినవాడై ఉండే స్వామి) అని నమ్మాழ்వార్లు కూడా పలికే రీతిలో అది ఉన్నది. స్తుతిలో తరువాత **"పితేవ త్వత్ప్రేయాన్"** అనే శ్లోకంలో **"ఉచితై రుపాయైః విస్మార్య స్వజనయసి"** (తగిన ఉపాయాలతో స్వామి కోపాన్ని మఱపించి ఆశ్రితులను తన వారిగా స్వీకరించేటట్లు చేస్తావు) అని పూర్వం మఱుగుపరచి గుప్తంగా పలికిన పరిచర్యనుగూర్చి కొంతవరకు పలికారు.

**(హే దేవి! త్వం ముకుందం నిత్యమ్ అభినందయసే)**– ఓ శ్రీరంగనాయకీ! నీవు నిరంతరంగా భగవానుని ఆనందింపజేస్తున్నావు– అని అర్థం. ముముక్షుప్పడి రెండవ ప్రకరణంలోని 17వ చూర్ణికలో **"ఈశ్వర స్వాతంత్ర్యత్తైయుమ్, చేతనుడైయ అపరాధత్తైయుమ్ కణ్డు అకలమాట్టాళ్"** (భగవానుని స్వాతంత్ర్యాన్ని, జీవుని అపరాధాన్ని చూచి వెనుకంజ వేయదు) అని శ్రీపిళ్ళైలోకాచార్యులవారు పలికారు. "అపరాధాలకు తగిన రీతిలో దండనలను విధిస్తే తప్ప విడువను"– అని ఉండే భగవానుని స్వాతంత్ర్యాన్ని, అనవరతంగా చేసే ఈ చేతనుని అకృత్యకరణాది అపరాధాలను చూచి, లక్ష్మీదేవి – "ఏమవుతుందో! ఏమో!" అనే భయంతో ఈశ్వరుని విడచిపెట్టి, ఒక క్షణకాలం కూడా విశ్లేషించకుండా వెంట ఉండి, అతనిని తన మాటదారిలో వర్తించేవాడుగా చేయడంకోసం అతనిని ఆనందింపజేస్తూ

ఉంటుంది. అది ఏకత్రానురాగం కాకుండా, అతడుకూడా **"శువైయన్ తిరువిన్ మణాళన్"** (రసికాగ్రగణ్యుడు శ్రియఃపతి) అనే రీతిలో పరమరసిక సార్వభౌముడై నందున ఎదురు చూపులను సారిస్తాడు. (తానుకూడా తన ప్రేమను చూపుతాడు.) ఆ రీతిలో దివ్యదంపతులు ఒకరికొకరు చేసికొనే పరిచర్యలో లోకానుగ్రహంకోసం కనుక, వర్ణించవలసి వచ్చింది. **"నిత్యమ్ అభినందయసే"** అని అన్నందువల్ల ద్వయంలోని మతుబర్థమైన (మతుప్ ప్రత్యయార్థమైన) నిత్యయోగం అనుసంధింపబడినది అయినది.

**(రసికభ్రమరోపభుక్తా పుష్పావళీవ అభినందయసే)– "తూవియమ్ పుళ్ళుడై ద్దెయ్వ వణ్డు తుదైన్ద ఎమ్ ఎణ్ణ్మై అమ్ పూవిదాలో"** (అందమైన రెక్కలను కల గరుత్మంతుని వాసనంగా కల పరదైవమనే తుమ్మెదచే మర్దింపబడిన మా స్త్రీత్వమనే పూవు ఇది) (తిరువాయ్మొళ్ళి–9–9–4) అనే పాశురానికి ప్రతిచ్ఛందంగానే (ప్రతిరూపంగానే) ఇది పలుకబడింది. రసికమైన ఒక తుమ్మెద అనుభవించిన పూమాలికవలె సొక్కి, సొలసిన స్థితి తెలుపబడింది.

**(కాంతోపభోగలలితైః లులితాంగయష్టిః)**– శ్రీరంగనాథుని సంభోగక్రీడలతో శ్రమను, అలసటను పొందిన సుకుమారదేహాన్ని కల్గినదానవు అవుతున్నావు - అని అర్థం. మొదటి పాదంతో వాటిని విశేషిస్తున్నారు.

**(మర్మస్పృశః రససిరావ్యతివిధ్య వృత్తైః)** – **"సిరా"** – అని నాడికి పేరు. **"రససిరా"** అంటే – రసనాడి. **"రససిరాః"** అని ద్వితీయాబహువచనాంతం. మర్మస్పర్శియైన రసనాడులను అభిఘాతం చేస్తూ (శ్రమను పొందిస్తూ) ప్రవృత్తాలైన (సంభవించిన) సంభోగవిలాసాలతో సొక్కిన తిరుమేనిని కల్గినది – అని భావం. "యతిరాజసప్తతిలోని **"రసతమనివేదాయ సుధియామ్"** అనే ప్రయోగం ఇక్కడ ఒక రీతిలో సంభావనీయం.

ఈ శ్లోకంలోని పరమతాత్పర్యం ఏమంటే– సాపరాధ చేతనాంగీకారార్థంగా లక్ష్మీదేవి భగవానుని వశీకరించుకోవడంకోసం కొన్ని శృంగార లీలావిలాస చేష్టితాలను చేయగా, అతడు కూడా మనస్సులో ఆనందించి, కలసి ఆమెను ఆనందింపజేయగా, ఈవిధంగా దివ్యదంపతులిద్దఱు ఆనందప్రవాహంలో నిమగ్నులై ఉండే రీతి తెలుపబడింది.

**46) కనకరశనా ముక్తాతాటఙ్కహారలలాటికా**
**మణిసరతులాకోటిప్రాయైః జనార్దనజీవికే! ।**
**ప్రకృతిమధురం గాత్రం జాగర్తి ముగ్ధవిభూషణైః**
**వలయశకలైః దుగ్ధం పుష్పైశ్చ కల్పలతా యథా ॥**

జనార్దనజీవికే = జనార్దనుడైన భగవానుని జీవింపజేసే ఓపధిలతవంటి శ్రీరంగనాయకీ!, కనకరశనా = బంగారపు మొలనూలు, ముక్తాతాటంక = ముత్యాల దుద్దులు, హార = ముత్యాల హారాలు, లలాటికా = పాపిటబొట్టు, మణిసర= మణిహారాలు, తులాకోటి = కాళ్ళగజ్జెలు, ప్రాయైః = మొదలైన, ముగ్ధవిభూషణై= మనోహరాలైన ఆభరణాలతో, ప్రకృతిమధురం = సహజంగానే అందమైన, తే గాత్రం = నీ దేహం, వలయశకలైః = చక్కెర ముక్కలతో కలసిన, దుగ్ధం యథా= పాలవలె, పుష్పైః = పూవులతో, కల్పలతా యథా=కల్పలతవలె, జాగర్తి = ప్రకాశిస్తున్నది.

**వ్యాఖ్యానమ్ :-** ఇందులో శ్రీరంగనాయకికి దివ్యాభరణాల సంబంధంవల్ల కల్గిన శోభావిశేషాన్ని అనుసంధించి, ఆనందిస్తున్నారు, ఇందులో. సహజంగానే మధురమైన పాలలో ఖండశర్కరను చేర్చినట్లే, సహజంగానే మనోహారిణి అయిన కల్పలతలో పుష్పసంపదకూడా చేరినట్లే, సహజంగానే పరభోగ్యమైన నీ తిరుమేనిలో కనకరశనాది దివ్యభూషణాలు చేరి ఉండడం పరమశోభావహమై (గొప్ప కాంతిని కల్గించేదిగా) ఉన్నది- అనిభావం.

**(జనార్దనజీవికే!)**- ఈమె (సీతాదేవి) **"ఊర్ధ్వం మాసాన్న జీవిష్యే"** (ఒక నెలకు మించి నేను జీవించలేను) అని అంటే, అతడ **"న జీవేయం క్షణ మపి వినా తామసితేక్షణామ్"** (ఆ నల్లని నేత్రాలను కల సీతాదేవిని విడచి క్షణమైనా నేను జీవించలేను) అని అనేవాడు కనుక, ఆ భగవానునకు లక్ష్మీదేవి జీవనా ధారమైనది. అందువల్ల భగవానునకు జీవనౌషధమైన శ్రీరంగనాయకీ! - అని భావం.

**(ప్రకృతిమధురం తే గాత్రం ముగ్ధవిభూషణైః జాగర్తి)** - సహజంగానే పరమభోగ్యమైన నీ తిరుమేని పరమసుందరాలైన దివ్యాభరణాలతో చాలా వెల్గు తున్నది. దీనికి రెండు దృష్టాంతాలు నాల్గవ పాదంలో ప్రస్తావింప బడుతున్నాయి.

(దుగ్ధం వలయశకలైః యథా కల్పలతా పుష్పైః యథా) - వలయ శకల మంటే - కలకండపొడి. "ప్రకృతిమధురమ్" అనే పదం తిరుమేనికి మాత్రం విశేషణమైనా, పాలలోను, కల్పలలతలోను కూడా విశేషంగా అనుసంధేయం. సహజంగానే మధురమైన పాలలో కలకండ పొడిని కలిపితే, ఏవిధంగా పరమభోగ్యమై ఉంటుందో, సహజంగానే దర్శనీయమైన కల్పలతలో పుష్పసంపద ఉంటే ఏవిధంగా విశేషంగా దర్శనీయమవుతుందో, ఆ రీతిలోనే ప్రకృత్యా పరమభోగ్యమైన నీ తిరుమేని దివ్యభూషణాలతో విశేషమైన శోభాతిశయాన్ని పొంది వెల్లుతున్నది- అని అంటున్నారు. శ్లోకంలోని పూర్వార్ధంలో ఆ దివ్యాభరణాలు సంగ్రహింపబడుతున్నాయి.

(కనకరశనా)- స్వర్ణమయమైన మేఖల,

(ముక్తాతాటంక) - ముత్యాలతో తయారుచేయబడిన కర్ణభూషణాలు,

(హార)- ముత్యాల హారాలు,

(లలాటికా)- శిరస్సులో ఉచ్చభాగంలో (ఉచ్చిలో) ధరించే ఆభరణం, తిలకాభరణం, (పాపటిబొట్టు)

(మణిసరమ్)- రత్నమాలికలు,

(తులాకోటి)- రత్ననూపురాలు,

(ప్రాయైః) మొదలైనవి - అనే అర్థాన్ని ఈ పదం ఇస్తుంది.

**47) సామాన్యభోగ్యమపి కౌస్తుభవైజయన్తీ**
**పఞ్చాయుధాది రమణ స్స్వయమేవ బిభ్రత్ ।**
**తద్భారఖేదమివ తే పరిహర్తుకామః**
**శ్రీరఙ్గధామమణిమఞ్జరి! గాహతే త్వామ్ ॥**

శ్రీరంగధామమణిమంజరి = శ్రీరంగవిమానానికి అలంకారమైన రత్నాల గుత్తివంటి శ్రీరంగనాయకీ!, సామాన్యభోగ్యమ్ అపి = సాధారణంగా అనుభవింప దగినవి అయినా, కౌస్తుభ = కౌస్తుభమనే రత్నం, వైజయంతి = వైజయంతి - అనే వనమాల, పంచాయుధ+ఆది = పంచాయుధాలు మొదలైనవానిని, తత్ భార= పూర్వం తెల్పిన కౌస్తుభం మొదలైనవానిని మోయడంవల్ల కలిగే, ఖేదం = శ్రమను, తే = నీకు,

పరిహర్తుకామః ఇవ = లేకుండా చేయడం కోసమా! అన్నట్లు, స్వయమ్ ఏవ=తానే స్వయంగా, బిభ్రత్ = ధరించేవాడైన, రమణః = నీ ప్రియుడు, త్వాం= నిన్ను, గాహతే= పూర్ణంగా ఆనందిస్తున్నాడు.

**వ్యాఖ్యానమ్ :-** గచిన శ్లోకంలో, దివ్యాభరణాలనుగూర్చి పలికేటపుడు కౌస్తుభం, వనమాల, పంచాయుధాలు మొదలైనవి భగవానునకు ఆభరణాలుగా వెల్గుతున్నందున, అవికూడా స్మరణకు రాగా, వాటినిగూర్చి పలుకవలసిన ఒక మాటను ఈ శ్లోకంలో పల్కుతున్నారు.

**(హే శ్రీరంగరాజమణిమంజరి !)**- శ్రీరంగదివ్యాలయానికి రత్నమంజరివలె వెల్గుతున్న ఓ శ్రీరంగనాయకీ !

**(కౌస్తుభవైజయంతీపంచాయుధాది సామాన్యభోగ్యమపి)- "కురుమామణి పూణ్ కులావి త్తికళ్లుమ్ తిరుమార్బు"** (గొప్పమణి అయిన కౌస్తుభం ఊగిసలాడి ప్రకాశించే అందమైన వక్షఃస్థలం) అనే రీతిలోని వైజయంతికాని, **"మజ్గల ఐమ్బుడైయుమ్"** (మంగళకరమైన పంచాయుధాభరణం) అని, **"అళ్ళకియ ఐమ్బుడైయుమ్"** (అందమైన పంచాయుధాభరణం) అని చెప్పబడే పంచాయుధాభరణం కాని, - ఇటువంటి దివ్యాభరణాలు, దివ్యదంపతులిద్దతికి సాధారణంగా (సమానంగా) అలంకరించుకొనదగినవిగా ఉన్నా,

**(తద్భారఖేదమ్ తే పరిహర్తుకామ ఇవ రమణః స్వయ మేవ బిభ్రతి)**- ఆ దివ్యాభరణాలను నీవు అలంకరించుకొంటే పరమసుకుమారమైన నీ తిరుమేనికి అవి మిక్కిలి భారమై నీవు శ్రమను పొందవలసి వస్తుందని, ఆ శ్రమ నీకు కలుగరాదని భావించిన నీవల్లభుడు వాటిని తానే స్వయంగా ధరించేవాడై,

**(త్వాం గాహతే)** - నిన్ను అవగాహిస్తున్నాడు (నీతో ఆనందాన్ని పొందు తున్నాడు). సన్నిధులలో (ఆలయాలలో) జయ విజయాది ద్వారపాలకులను, శ్రీవిష్వక్సేనుని శంఖచక్రాది విభూషితులుగా దర్శిస్తున్నాము. అందువల్ల ఇవి లక్ష్మీదేవికికూడా ఆభరణాలై ఉండడంలో అడ్డులేదు కదా ! ఆవిధంగా ఉండగా, వీటిని ఎందువల్ల ఆమె ధరించడంలేదు? అనే సందేహం కలుగకుండా ఉండడం కోసం ఈవిధంగా చెప్పబడింది. పూర్వం **"అథాంబ! సాహసవిధౌ లీలారవింద**

గ్రహః" అని అంటూ తన చేతిలో లీలారవిందధారణం కూడా చాలా సాహస కార్యంగా తెలుపబడింది కదా!

**48) యది మనుజతిరశ్చాం లీలయా తుల్యవృత్తేః**
**అనుజను రనురూపా దేవి! నావాతరిష్యః ।**
**అసరస మభవిష్య న్నర్మ నాథస్య మాతః!**
**దరదళదరవిన్దోదన్త కాన్తాయతాక్షి ॥**

దర = కొంచెంగా, దళత్ = వికసించే, అరవింద = తామరపూవుయొక్క ఉదంత= వార్తను (సామ్యాన్ని) కల్గిన, కాంత=ఆకర్షణీయమైన, ఆయత= విశాలమైన, అక్షి = నేత్రాలను కల శ్రీరంగనాయకీ!, మాతః = తల్లీ, దేవి=దేవీ!, లీలయా = (కర్మవశంవల్ల కాకుండా) లీలతో, మనుజతిరశ్చాం = మానవులకు, తిర్యక్కులకు, తుల్య= సమానమైన, వృత్తేః = ప్రవర్తనను కల, నాథస్య = (నీ) నాథునియొక్క, అనుజనుః = ప్రతి అవతారంలో, అనురూపా = ఆయా అవతారాలకు తగిన రూపాన్ని కల్గినదానవై, న అవాతరిష్యః యది = నీవు అవతరించి ఉండకపోతే, నర్మ = (నీ నాథుని) విలాసం (అవతారాలు ఎత్తడం - అనే లీల), అసరసం = సరసం కానిది (విరసమైనది) అభవిష్యత్ = అయి ఉండేది,

వ్యాఖ్యానమ్ :- శ్రీవిష్ణుపురాణంలో (6-142) **"ఏవం యథా జగత్స్వామీ దేవదేవో జనార్దనః, అవతారం కరోత్యేషా తదా శ్రీ స్తత్సహాయినీ"** (ఈవిధంగా జగత్ ప్రభువు, దేవదేవుడైన జనార్దనుడు ఎపుడు అతరిస్తాడో, అపుడు లక్ష్మీదేవి ఆమెకు సహాయకురాలు) అని అంటూ భగవానుడు అవతరించే సమయాలలో అతనికి తోడుగా లక్ష్మీదేవి కూడా అవతరిస్తుంది - అని పల్కి, **"రాఘవత్వేఽభవత్ సీతా రుక్మిణీ కృష్ణజన్మని, అన్యేషు చావతారేషు విష్ణోరేషాఽనపాయినీ, దేవత్వే దేవదేహేయం మనుష్యత్వే చ మానుషీ విష్ణో ర్దేహానురూపాం వై కరోత్యేషాఽత్మన స్తనూమ్"** (శ్రీరాముడైనపుడు సీతగా, శ్రీకృష్ణావతారంలో రక్మిణిగా, మిగిలిన అవతారాలలో కూడా ఈమె విష్ణువును విడచి ఉండనిది అయినది. దేవరూపాన్ని స్వామి ధరించినపుడు దేవజాతిలో, మానవరూపాన్ని ధరించినపుడు, మానవ జాతిలో, విష్ణు రూపానికి తగిన రీతిలో తన రూపాన్ని స్వీకరిస్తున్నది) అని భగవానుడు శ్రీరాముడుగా అవతరించినపుడు లక్ష్మీదేవి జనకకులసుందరిగా,

అతడు శ్రీకృష్ణుడై అవతరించినపుడు ఈమె రుక్మిణీదేవిగా అవతరించింది – అని, అతడు దేవశరీరాన్ని పరిగ్రహిస్తే, ఈమెకూడా దేవశరీరాన్ని పరిగ్రహిస్తుంది– అని, అతడు మనుష్యశరీరపరిగ్రహం చేస్తే ఈమెకూడా మనుష్యశరీర పరిగ్రహం చేస్తుందని, ఈవిధంగా భగవానునకు తగిన రూపాలను లక్ష్మీదేవి పరిగ్రహిస్తుందని చెప్పబడింది.

ఈ రీతిలో భగవానుని తిరుమేనికి, అతని లీలలకు తగినట్లు రూప–చేష్టితాలను కల్గినదై లక్ష్మీదేవి అవతరించినందువల్లనే, భగవానుని అవతారాలు భోగ్యతను పొందాయి. ఆమెకూడా ఆ విధంగా అవతరించకపోతే బ్రహ్మచారి నారాయణుని కృత్యాలు ఫలితాన్ని పొందవు. పిరాట్టి (లక్ష్మీదేవి) చేసే పురుషకారం వల్లనే భగవానుని రక్షణత్వం పరిమళిస్తుంది కనుక, అటువంటి ఈమె కలయిక (నిత్యయోగం) లేకపోతే భగవదవతారాలు వ్యర్థాలే కాగలవు– అనే ఈ విషయాన్ని ఇతఃపూర్వమే ఈ రంగరాజస్తవంలోని ఉత్తరశతకంలో **"అనుజనురనురూప చేష్టా"** (49) అనే శ్లోకంలో అనుగ్రహించారు. అక్కడ శ్రీరంగనాథుని సంబోధిస్తూ పల్కిన ఆమాటయే ఇక్కడ శ్రీరంగనాయకిని సంబోధిస్తూ పల్కుతున్నారు.

**(దరదళదరవిందోదంతకాంతాయతాక్షి !)**– ఈ ప్రయోగంలో నాయకిని సంబోధిస్తున్నారు. కొంచెం విచ్చుకొన్న తామరపూవు వలె అందమైన, దీర్ఘమైన నేత్రాలను కలదానా! – అని భావం.

**(మాతః)**– అఖిలజగజ్జననీ !,

**(లీలయా మనుజతిరశ్చాం తుల్యవృత్తేః నాథస్య అనుజనుః అనురూపా నావతరిష్యో యది)**– కర్మవశంవల్ల కాకుండా స్వేచ్ఛతోనే మానవులకు, తిర్యక్కులకు తగి ఉండే వృత్తిని కల నాథునకు అతని అవతారాలు అన్నిటిలోను తగినవి అయిన అవతారాలను నీవు ఎత్తి ఉండకపోతే,

**(తస్య నాథస్య నర్మ అసరసమ్ అభవిష్యత్)**– ఆ భగవానుని లీలలు అన్నీ విరసమైపోయేవి. అంతే. ఇది విభవావతారాలనుమాత్రమే ఉద్దేశించి పలికిన మాట కాదు. అర్చావతారంలోకూడా శ్రీరంగనాథునకు తగిన శ్రీరంగనాయకిగా శ్రీరంగాలయంలో వేంచేసి ఉండకపోతే, సరసం కాకుండా పోతుంది – అని తెలుపడంలోనే ఈ మాటలోని తాత్పర్యవిశ్రాంతి.

**49) స్థలితకటకమాల్యై ర్దోర్భి రబ్ధిం మురారేః**
**భగవతి! దధిమాథం మథ్నత శ్శాన్తిశాన్త్యై ।**
**భ్రమదమృతతరఙ్గావర్తతః ప్రాదురాసీః**
**స్మితనయనసుధాభి స్సిఞ్చతీ చన్ద్రికేవ ॥**

భగవతి = షాడ్గుణ్యసంపదను కల పూజ్యురాలవైన శ్రీరంగనాయకీ!, స్థలిత= తొట్రుపాటు పడిన, కటకమాల్యైః = భుజవలయాలను, పూమాలికలను కల, దోర్భిః=తన నాల్గు బాహువులతో, అబ్ధిం = క్షీరసాగరాన్ని, దధిమాథం = పెఱుగును చిలికే రీతిలో, మథ్నతః = చిలికే, మురారేః = మురారి అయిన భగవానునియొక్క, శ్రాంతిశాంత్యై = అలసటను తీర్చడంకోసం, స్మితనయన = చిఱునవ్వును కల నేత్రాలనుండి వెలువడే చూపులు అనే, సుధాభిః = అమృతధారలతో, సించతీ= తడిపే, చంద్రికా ఇవ = వెన్నెలవలె, భ్రమత్ = పరిభ్రమించే, అమృతతరంగ = అమృతపు కెరటాల, ఆవర్తతః = సుడినుండి, ప్రాదురాసీః = ప్రాదుర్భవించావు.

**వ్యాఖ్యానమ్ :– "విణ్ణవర్ అముదుణ అముదిల్ అరుమ్ పెణ్ణముదుణ్ణ పెరుమాన్"** (అమరులు అమృతాన్ని భుజించగా, ఆ అమృతంకంటే గొప్ప అమృతమైన లక్ష్మీదేవిని ఆస్వాదించిన స్వామి) అని తిరుమఙ్గైయాళ్వార్లచేత కీర్తింపబడిన భగవానుడు అమరులకు అమృతాన్ని ఇవ్వాలని సముద్రాన్ని చిలికిన కాలంలో ఆ శ్రమను చూచి సహించలేని లక్ష్మీదేవి, ఆ గొప్ప పరిశ్రమ ఒక విధంగా సఫలం కావాలి అని తలచి, ఆ సముద్రం నుండి తానే అవతరించి, స్వామి వక్షఃస్థలాన్ని చేరిన రీతినిగూర్చి పల్కుతున్నారు, ఈ శ్లోకంలో. శ్రీరంగ రాజస్తవమ్ ఉత్తరశతకంలోని **"ఉన్మూల్యాహర మందరాద్రి మహినా... ఫలేగ్రహిర్ష్వి కమలాలాభేన సర్వశ్రమః"** (మందరాద్రిని పెకలించి తెచ్చి, దానితో సముద్రాన్ని చిలికావు... నీశ్రమ అంతా లక్ష్మిని పొందడంవల్ల ఫలవంతం అయినది.) అనే శ్లోకంతో శ్రీరంగనాయకినే ఉద్దేశించి పలికారు.

**(హే భగవతి)** – షాడ్గుణ్య పూర్ణతను కల ఓ శ్రీరంగనాయకీ !,

**(స్థలితకటకమాల్యైః దోర్భి రబ్ధిం మథ్నతః మురారేః శ్రాంతిశాంత్యై)**– సముద్రాన్ని చిలికేటపుడు స్వామి బాహువలయాలు, భుజాలలోని మాలికలు తొట్రుపాటు చెందినట్లు పల్కుతున్నారు. అంటే– అంతటి శ్రమను భగవానుడు

పొందాడు. సముద్రమథనం అనేది భగవానునకు అనాయాస సాధ్యమైనదే అయినా, మంగళాశాసనపరత్వానికి మూలమైన ప్రేమాతిశయంచేత ఈ విధంగా పలికారు.

**(దధిమాథం మథ్నతః)**– అని అంటూ పెరుగును చిలికిన రీతిలో చిలికినట్లు పల్కినందున ఈ మథనం అనాయాసకృతమని కూడా సూచింపబడింది. ఈ విధంగా చిలికే భగవానుని శ్రమ తీరడంకోసం,

**(భ్రమదమృతతరంగావర్తతః ప్రాదురాసీః)**– పరిభ్రమించే అమృత తరంగాలనుండి అవతరించావు. అవతరించిన క్రమం ఏది? అంటే,

**(స్మితనయనసుధాభిః సించతీ చంద్రికేవ)**– స్మితమంటే– చిఱునవ్వు. ఇక్కడ నయనపదం అవలోకనపర్యంతవాచకం. చిఱునవ్వుతో కటాక్షించడమనే అమృత ప్రవాహాన్ని వర్షిస్తూ, చంద్రిక ఆవిర్భవించినట్లు ప్రాదుర్భవించావు– అని భావం. పూర్వం "సామాన్యభోగ్యమపి" అనే శ్లోకంలో– ఈమె పరిశ్రమను భగవానుడు పోగొట్టిన రీతి తెలుపబడింది. ఇందులో– భగవానుని శ్రమను ఈమె తీర్చిన క్రమం తెలుపబడింది. దీనివల్ల దివ్యదంపతులు పరస్పరం ప్రేమాతిశయాన్ని కల్గి ఉండే తీరు తెలుపబడింది.

**50) మాతర్మైథిలి! రాక్షసీ స్త్వయి తదైవార్ద్రాపరాధా స్త్వయా**
**రక్షన్త్యా పవనాత్మజా ల్లఘుతరా రామస్య గోష్ఠీకృతా ।**
**కాకం తఞ్చ విభీషణం శరణ మిత్యుక్తిక్షమౌ రక్షతః**
**స న స్సాన్ద్రమహాగస స్సుఖయతు క్షాన్తి స్తవాకస్మికీ ॥**

మాతః = తల్లీ, మైథిలీ = మిథిలాధిపతి కుమార్తెవు అయిన శ్రీరంగనాయకీ!, త్వయి = నీవిషయంలో, తదా+ఏవ = అపుడే, ఆర్ద్ర+అపరాధాః = ఇంకా ఆరని (మఱపురాని) అపరాధాలను చేసిన, రాక్షసీః = రాక్షస స్త్రీలను, పవన+ఆత్మజాత్= హనుమానుని బారినుండి, రక్షంత్యా = కాపాడే, త్వయా = నీచేత, శరణమ్ ఇతి= "నీవే శరణు" అని, ఉక్తిక్షమౌ = పల్కడంలో శక్తిని కల్గినవాడైనపుడే, కాకం = కాకాసురుని, తం = ఆ (ప్రసిద్ధుడైన), విభీషణం = విభీషణుని, రక్షతః = రక్షించే వాడైన, రామస్య = శ్రీరాముని, గోష్ఠీ = గోష్ఠి, లఘుతరా = మిక్కిలి తక్కువగా, కృతా= నీయొక్క, క్షాంతిః = ఓర్పు, సాంద్ర = దట్టమైన (మిక్కిలిగా చేసిన), మహాగసః = గొప్ప అపరాధాలను కల, నః = మమ్ములను, సుఖయతు = ఆనందింప జేయాలి.

**వ్యాఖ్యానమ్ :-** లక్ష్మీదేవియొక్క క్షమాగుణానికి, భగవానుని క్షమాగుణానికి మధ్య "పర్వత పరమాణువుల మధ్య ఉండే అంతరం" వంటి అంతరం ఉన్నదని పల్కి, అటువంటి క్షమాగుణం తమపై ప్రవహించాలని ఇందులో అంటున్నారు.

**(శరణమితి ఉక్తిక్షమౌ తం కాకం విభీషణం చ రక్షతః రామస్య గోష్ఠీ మాతః! మైథిలి త్వయా లఘుతరా కృతా)**- పూర్వం సీతగా అవతరించిన తల్లీ! శ్రీరంగనాయకీ! కాకాసురుని, విభీషణుని శరణాగతులనే కారణాన్ని పురస్కరించుకొని రక్షించిన శ్రీరాముని గోష్ఠి, నిర్వ్యాజరక్షణదక్షిణవు అయిన నీచే చాలా తక్కువదిగా చేయబడింది- అని అర్థం. **"రామః లఘుతరః కృతః"** అని అనకుండా, **"రామస్య గోష్ఠీ లఘుతరా కృతా"** అని పల్కడం ఒక ఉక్తిచాతుర్యం. భావమాత్రం అదే. ఆసురప్రకృతిని కల జయంతుడు కాకరూపాన్ని పొంది వచ్చి, సీతాదేవి విషయంలో అకృత్యప్రవృత్తిని కలవాడు కాగా, భగవానుడు (శ్రీరాముడు) అతనిపై కోపించి, అతని శిరస్సును ఖండించడంకోసం బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. **"త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః"** (ముల్లోకాలలో తిరిగి తిరిగి చివరకు శ్రీరామునే శరణు పొందాడు) అనే రీతిలో అంతటా పరిభ్రమించి తిరిగి, తాను చేరిన చోట ఎక్కడా శరణు పొందలేనందున, అనన్యశరణ్యుడై, మళ్ళీ శ్రీరాముని సన్నిధిని చేరి, శరణాగతుడు కాగా, అతనిని రక్షించినది ఒక చరిత్ర. విభీషణుడు, రావణునకు పలుమార్లు హితోపదేశాలను చేసినా, అది ఫలించక పోవడంతో పాటు, **"త్వాం తు ధిక్! కులపాంసనమ్"** (కులాన్ని పాడుచేసేవాడవైన నీ పట్ల ధిక్కారం) అని అతనిచే గర్హింపబడడంతోపాటు, అక్కడ (లంకలో) నిలువలేనందున వెంటనే అక్కడినుండి బయలుదేరి, **"త్యక్త్వా పుత్రాంశ్చ దారాం శ్చ రాఘవం శరణం గతః"** (పుత్రులను, భార్యను విడచిపెట్టి శ్రీరాముని శరణు పొందాడు) అని శరణాగతి చేయగా, విభీషణునకు అభయాన్ని ఇచ్చి, అతనిని రక్షించినది ఇంకొక వృత్తాంతం. ఈ విధంగా శ్రీరాముడు చేసిన రక్షణాలలో ఏ ఆశ్చర్యం లేదు. ఇక, సీతాదేవి చేసిన రక్షణాలను గమనించండి. దేవకాంతలను (రావణుని) చెఱనుండి విడిపించడంకోసం ఈమె తాను చెఱలో ఉండే స్థితిలో తనను రాత్రి పగలు తర్జనభర్త్సనాలను చేసి, బాధించిన క్రూరరాక్షస స్త్రీలను, రావణుడు పరాజయాన్ని పొందినట్లు, శ్రీరాముడు విజయుడైనట్లు త్రిజట పొందిన స్వప్నాన్ని బట్టి తెలిసికొని, వారు చాలా భయపడి జంకే దశలో, **"భవేయం

**శరణం హి వః"** (మీకు శరణం కాగలను) అని "మీరు బాధపడే సమయంలో నేను ఉన్నాను. మీరు భయపడకండి" అని అభయప్రదానాన్ని చేసి, అది కేవలం మాటమాత్రమే కాకుండా, రావణవధానంతరం తనకు ఆ శుభాన్నిగూర్చి చెప్పడంకోసం వచ్చిన హనుమానుడు "వీరిని చిత్రవధ చేస్తాను. నాకు అప్పగించు" అని అనగా, అతనితో వాదులాడి, **"రాజసంశ్రయవశ్యానామ్"** ఇత్యాదులతో వారి దోషాలను గుణాలుగానే ఉపపాదించి, **"మర్షయామీహ దుర్బలా"** అని ఇతరుల బాధను చూచి సహించగల్గిన మనోనిబ్బరం లేని తన స్వభావాన్ని పురస్కరించుకొని, **"కార్యం కరుణ మార్యేణ న కశ్చిన్నాపరాధ్యతి"** (ఆర్యుడవైన నీవు వారిపై దయచూపాలి. తప్పు చేయనివాడెవడూ లేడు) అని, అతడు కూడా వారిపై దయ చూపించకపోతే నిలువలేని రీతిలో ఉపదేశించి– ఈ రీతిలో ఒకే విధంగా స్థిరంగా నిలచి ఉండి, ఆర్ద్రాపరాధీనులైన వారిని కదా రక్షించింది. ఇటువంటి రక్షణం శ్రీరామునిపట్ల ఎంతగా వెదకి చూచినా కన్పించదుకదా. అందువల్ల **"త్వయి తథైవ ఆర్ద్రాపరాధాః రాక్షసీః పవనాత్మజాత్ రక్షంత్యా త్వయా.... రామస్య గోష్ఠీ లఘుతరా కృతా"** అని పల్కిన ఈ సూక్తి సంప్రతిపన్నం. **"ఆర్ద్రాపరాధాః"** అనేది సీతాదేవి హనుమానునితో వాదులాడే సమయంలో కూడా రాక్షసస్త్రీలు రావణుడు వధింపబడిన సంగతిని తెలియక, హింసిస్తూ ఉండడం తెల్పుతున్నది. అందువల్ల ఇంతవరకు పిరాట్టియొక్క ప్రకృతి సిద్ధమైన అవ్యాజక్షమా వైభవాన్నిగూర్చి పల్కి, ఈ విధంగా అపరాధినులను అన్వేషించే ఆ క్షమాగుణానికి ఆ రాక్షస స్త్రీలకంటే మించిన మహాపరాధాలను చేసిన మనవంటివారి విషయంలో ప్రవేశం కలగాలి – అని ప్రార్థించి, శ్లోకాన్ని పూర్తిచేశారు.

**51) మాతర్లక్ష్మి! యథైవ మైథిలజన స్తేనాధ్వనా తే వయం**
**త్వద్దాస్యైకరసాభిమాన సుభగై ర్భావై రిహాముత్ర చ ।**
**జామాతా దయిత స్తవేతి భవతీసంబన్ధదృష్ట్యా హరిం**
**పశ్యేమ ప్రతియామ యామ చ పరీచారాన్ ప్రహృష్యేమ చ ॥**

మాతః = తల్లీ, లక్ష్మి = లక్ష్మీస్వరూపిణివి అయిన శ్రీరంగనాయకీ!, తే=నీకు, మైథిలజనః=మిథిలానగరంలోని జనులు, యథా+ఏవ = ఏవిధమైనవారో, తేన అధ్వనా= ఆ మార్గంలోనే, వయం=మేముకూడా (నీకు ఆత్మీయులము), త్వత్ = నీయొక్క దాస్య=

దాస్యంలోని, ఏకరసాభిమాన=అద్వితీయమైన ప్రీతి, అభిమానాలతో, సుభగైః = సొంపుగా ఉండే, భావైః = భావాలతో, ఇహ=ఇక్కడ (ఈ లోకంలోను), అముత్ర చ = అక్కడ (పరమపదంలోను), జామాతా=అల్లుడు, తవ=నీకు, దయితః = ప్రియుడును, ఇతి = అని, భవతీ సంబంధదృష్ట్యా = నీ సంబంధాన్ని పురస్కరించు కోవడం ద్వారా, హరిం= హరిని, పశ్యేమ= దర్శిస్తాము, ప్రతియామ = (అతనిని) శరణు పొందుతాము, పరీచారాన్= (అతనికి) పరిచర్యలను, యామ చ = చేస్తాము, ప్రహృష్యేమ చ = (ఆ స్వామి ఆనందాన్ని చూచి) ఆనందిస్తాము కూడా.

**వ్యాఖ్యానమ్ :-** శ్రీరామునికంటే సీతాదేవియే దయాగుణంలో మిక్కిలి గొప్పది - అని గడచిన ఈ శ్లోకంలో నిరూపించారు. ఈ ప్రసంగంలో అవశ్యవక్తవ్య మైనది ఒకటి ఉన్నది. అది ఏది? అంటే, ఈ విధంగా లక్ష్మీదేవి కరుణలో శ్రేష్ఠురాలైనది అయినపుడు, నమస్కరించడం, స్తుతించడం, కైంకర్యం చేయడం మొదలైనవి అన్నీ ఈమె విషయంలోనే చేయదగినవై ఉండగా, ఇవి అన్నీ ఇంచుమించుగా భగవానుని విషయంలో చేయబడుతున్నాయి కదా! అది పొసగుతుందా? - అనే ఒక సందేహం కల్గుతుంది. దానికి సమాధానం పలుకవలసిన ఆవశ్యకత ఉన్నది కదా! అది ఈ శ్లోకంలో నెఱవేర్చబడుతున్నది. భగవానుని ఉద్దేశ్య భూతునిగా గ్రహించడం- లక్ష్మీదేవి సంబంధాన్నిబట్టే కాని, స్వతంత్రంగా కాదు. అందువల్ల, భగవానుని సేవించడం పలు కైంకర్యాలను చేసి ఆనందించడమనే పనులు పొసగడంలో అడ్డు లేదు - అని ఇందులో అంటున్నారు. **(మాతర్మైథిలి)-** తల్లీ ! లక్ష్మీదేవీ !,

**(మైథిలిజనః యథా (రామమ్)- జామాతేతి తవ దయిత ఇతి చ భవతీ సంబంధదృష్ట్యా అపశ్యన్, తేన అధ్వనా వయం హరిం భవతీసంబంధదృష్ట్యా పశ్యేమ)-** సీతాదేవిని అభిమానించిన మిథిలానగరజనులు సీతావివాహం అయిన తరువాత శ్రీరామునికూడా అభిమానించడం ఆరంభించారు. అయితే దశరథాత్మజుడని గాని, కౌసల్యానందనుడని గాని అభిమానించినవారు కారు. మఱి ఏవిధంగా? అంటే, మన సీతాదేవియొక్క వల్లభుడని, సీతకు తండ్రి అయిన జనకచక్రవర్తికి అల్లుడని - ఈ విధంగా సీతాసంబంధాన్ని పురస్కరించుకొనే అభిమానించారు. అదే రీతిలో మేముకూడా శ్రీరంగనాథుని శ్రియఃపతి- అని, **అళ్గియమణవాళన్ (రమ్యజామాత)-** అని నీ సంబంధాన్ని ఉద్దేశించే

అభిమానిస్తాము. అభిమానించడం మాత్రమేకాక, అతనినే సదా దర్శిస్తాము, అతని శ్రీచరణాలలో శరణు పొందేవారం, అతనికి కైంకర్యాలను చేసేవారమై కాగలము. ఇది విరుద్ధం కాదు. ఎందుకు? అంటే,

**(త్వద్దాస్యైకరసాభిమానసుభగైః భావైః)** - నీకు ఒక్కదానికై కౌంకర్యం చేయాలనే ఆశ మాకు ఉన్నది. ఆ భావబంధంలో ఏ లోటు లేదు. మీ సంబంధం ఉండే చోట కైంకర్యం చేసినా, అది నీకు కైంకర్యం చేసినట్లే కాగలదు; అందులో లోటు లేదు. ఇది ఈ స్థితిలో మాత్రమే కాదు. **(ఇహ అముత్ర చ)** - లీలా విభూతితో, నిత్యవిభూతితో తేడా లేకుండా ఉభయవిభూతులలోను ఈ విధంగానే చేస్తాము. మిథిలావాసిజనులకు శ్రీరాముని విషయంలో **"సీతాపతి"**, **"జనకజామాత"** అనే రెండు రీతులలో ఉద్దేశ్యత్వం ఉన్నట్లే, శ్రీరంగనాథుని విషయంలో కూడా ప్రపన్నులమైన మనకు **"శ్రియఃపతి, విష్ణుచిత్తజామాత"** అనే రెండు దారులలో ఉద్దేశ్యత్వం ఉండడంలో లోటు లేదని గ్రహించాలి. **"ప్రతియామ"**- అంటే శరణు పొందుతాము- అని భావం. **(యామ చ పరీచారాన్)**- **"పరీచారాన్ యామ చ"** అని అన్వయించాలి. కింకర వృత్తులను (కైంకర్యాలను) భజిస్తాము. (చేస్తాము) - అని భావం. **"ప్రహృష్యేమ"** - వీటితో ఆనందశాలురం కాగలము.

**52) పితేవ త్వత్ప్రేయాన్ జనని! పరిపూర్ణాగసి జనే**
**హితస్రోతోవృత్త్యా భవతి చ కదాచిత్ కలుషధీః ।**
**కిమేత న్నిర్దోషః క ఇహ జగతీతి త్వముచితైః**
**ఉపాయైః విస్మార్య స్వజనయసి మాతా తదసి నః ॥**

జనని = తల్లీ!, త్వత్ప్రేయాన్ = నీ ప్రియుడైన భగవానుడు, పరిపూర్ణ+ఆగసి= పూర్ణంగా (నిండుగా) అపరాధాలను చేసిన, జనే = వ్యక్తివిషయంలో, పితా ఇవ= తండ్రివలె, హితస్రోతోవృత్త్యా=హితపరంపరలో ప్రవర్తించడంచేత, కదాచిత్ = ఎప్పుడైనా, కలుషధీః= కాలుష్యాన్ని (కోపాన్ని) పొందిన మనస్సు కలవాడై, భవతి చ=అవుతున్నాడు కూడా. (అపుడు), కిమ్ ఏతత్ = ఇదేమి?, ఇహ జగతి = ఈ లోకంలో, నిర్దోషః = దోషరహితుడు, కః = ఎవడు? ఇతి = అని, ఉచితైః = తగిన, ఉపాయాలతో, విస్మార్య= (ఆ కోపాన్ని) మఱపింపజేసి, స్వజనయసి = (మమ్ము లను) తన బిడ్డగా భావించేటట్లు చేస్తున్నావు. తత్ = అందువల్ల, నః = మాకు, మాతా అసి = తల్లివై ఉన్నావు.

వ్యాఖ్యానమ్ :- భగవానుని నారాయణత్వప్రయుక్తమైన స్వాభావిక సంబంధాదులను తెలిసికొని, అతని శ్రీచరణద్వయిలో కైంకర్యం చేయడం కర్తవ్యంగా కల్గిన చేతనునకు లక్ష్మీదేవిని పురుషకారంగా పురస్కరించుకోవడం అవశ్యకమా? అని కొందఱు సందేహించి పలుకవచ్చు. ఆ విషయంలో వక్తవ్యాంశాలు ఈ శ్లోకంలో తెలుపబడు తున్నాయి. లోకానికి భగవానుడు తండ్రి అని, ఈమె తల్లి అని కదా పేరు పొందారు. లోకంలో తండ్రి హితపరుడు కనుక, ఒక్కొక్క సమయంలో దండించడంలో అతడు ప్రవర్తిస్తాడు. తల్లి **"తన్దమ్ మక్కళ్ అ౹్ముదు శెన్నాల్ తాయ్‌మారావార్ తరిక్కకిల్లార్"** (తమ బిడ్డలు రోదిస్తే, తల్లులు భరించలేరు) (పెరియాౘ్వార్ తిరుమొ౹్రి 2-2-3) అనే రీతిలో "కన్నతల్లి మనస్సు పిచ్చిది" **("పెౘ్ౘమనమ్ పిత్తు")** అనే రీతిలోని ఆ సంబంధం మూలంగా బిడ్డల క్లేశాన్ని చూస్తే సహించలేనిది లక్ష్మీదేవి. భగవానుని సర్వభూతసుహృత్తు అనే పేరును పొందినవాడైనందున, అతని మనస్సు ప్రసన్నమై, చల్లనిదై ఉన్నా, చేతనుడు పూర్ణంగా చేసిన అపరాధాల కారణంగా **"క్షిపామి"** (గెంటివేస్తాను), **"న క్షమామి"** (క్షమించను) అనే రీతిలోని కోపం ఆస్వామి మనస్సులో కల్గుతుంది. అది హితపరత్వం కారణంగా ఏర్పడినది కనుక, దోషం కాదు. ఆ విధంగా కోపం కల్గితే, దానిని తీర్చడానికి లక్ష్మీదేవి పురుషకారం అవశ్యాపేక్షితం. ఆ కోపాన్ని ఈమె తీర్చడం ఏ విధంగా ? అంటే-

భగవానుడు కోపించిన సమయంలో "ఈ కోపానికి ఏమి కారణం?" అని ప్రశ్నిస్తుంది. "దీనిని నన్ను అడిగి తెలిసికోవాలా? ఇతడు అంతు లేకుండా చేసిన అపరాధాలను తెలియవా ?" అని భగవానుడు అంటాడు. అపుడు లక్ష్మీదేవి- "ఇసుకరాళ్ళు నిండిన అన్నంలో రాళ్ళను ఏరేవారుంటారా? ఈ జగత్తులో అపరాధం చేయనివారెవరు? ఇతని అపరాధాలను లెక్కించి, మీరు ఇతనిని పక్కకు గెంటివేస్తే ఇతనికి వేఱు గతి ఏమున్నది? మీకు, ఇతనికి మధ్య గల సంబంధవిశేషాన్ని చూస్తే అది **"ఉఱవేల్ నమక్కు ఇఙ్గొ౹్రిక్క వొ౹్రియాదు"** (మన మధ్య సంబంధం లేకుండా చేసికోవడానికి మనకు సాధ్యం కానిది) అనే రీతిలో ఘటశ్రాద్ధం చేసినా పోనిదికదా! మీ సొత్తు అయిన ఇతనిని పొందడం స్వామి అయిన మీకు ప్రయోజనం కదా. **"ఎదిర్ శూ౹్ౘల్ పుక్కు"** (ఎదురు ఉపాయాలను పన్నుతూ)

సంచరించే మీకు నేను చెప్పాలా? రక్షణను అపేక్షించేవాడై వచ్చిన ఇతనిని రక్షించనపుడు మీ సర్వరక్షకత్వం జీవిస్తుందా?" అని అంటుంది. దీనిపై మళ్ళీ భగవానుడు "అనాదికాలంగా నా ఆజ్ఞను ఉల్లంఘించి, నా కోపానికి లక్ష్యమై ఉండే ఇతని అపరాధాలకు తగినట్లుగా దండించకుండా సహించి, అంగీకరించిన వాడను అయితే, శాస్త్రమర్యాద నశించదా?" అని అంటాడు. దీనిపై లక్ష్మీదేవి "ఇతనిని రక్షించకుండా, అపరాధాలకు తగినట్లుగా దండిస్తే, మీ కరుణ మొదలైన గుణాలు జీవించడం ఏవిధంగా? ఇతనిని రక్షించినపుడుకదా అవి జీవిస్తాయి" అని అంటుంది. దీనిని ఆలకించిన భగవానుడు "ఇతనిని దండించక పోతే శాస్త్రమర్యాద జీవించదు. రక్షించకపోతే కరుణాది గుణాలు జీవించవు. ఏమి చేయను?" – అని తడబడి నిలుస్తాడు. అపుడు లక్ష్మీదేవి "శాస్త్రమర్యాద నశించ కుండా, మీ కరుణాదులు వ్యర్థాలు కాకుండా ఉండే ఉపాయాన్ని పల్కు తున్నాను. వినండి. అంతు లేని దోషాలను చేసి, మీ దగ్గరకు రాకుండా విముఖులైనవారి విషయంలో దండధరత్వాన్ని చూపండి. అనుతాపాన్ని పొంది, అభిముఖులైనవారి విషయంలో కరుణాది గుణాలను ప్రవహింపజేయండి. ఆవిధంగా అయితే రెండు జీవిస్తాయి" అని ఉపాయాన్ని పల్కుతుంది.

అపుడు భగవానుడు **"ఓమ్"** (సరే) అని తల ఊగించవచ్చు. లేక, నిరంకుశ స్వాతంత్ర్యం ఉన్నందున తన్మూలంగా "పో! నీకు ఇదేకదా పని" అని ఆమె ఉపదేశాన్ని త్రోసిరాజని అనవచ్చు. అటువంటి సమయంలో **"అల్లిమలర్ పోక మయక్కుక్కళ్ ఆకియుమ్ నిఱ్కుమమ్మాన్"** (పద్మనివాసిని అయిన లక్ష్మీదేవి భోగంలో వ్యాముగ్ధుడు) అని, **"పిత్తర్ పనిమలర్మేల్ పావైక్కు"** (చల్లని పద్మంపై ఉండే లక్ష్మిపట్ల వ్యామోహాన్ని కలవాడు) అని ఆళ్వార్లు పల్కినట్లుగా, అతనిని వశీకరించుకోవడంకోసం కళ్ళను తిప్పడం, కచ్చాన్ని జారవిడువడం వంటి కొన్ని లీలలను చేసి, తన అందంతో అతనిని పిచ్చివానినిగా చేసి, తాను పల్కిన రీతిలో చేస్తే తప్ప నిలువలేనివానినిగా చేసి, అతనిని అంగీకారోన్ముఖునిగా చేస్తుంది. ఈ విషయాలను అన్నిటిని ఈ శ్లోకంలో పొందు పరుస్తూ పరమరసికులైన భట్టర్ పలికారు. శ్రీవచనభూషణంలోని **"ఉపదేశత్తాలే మీళాదపోదు చేతననై అరుళాలే తిరుత్తుమ్, ఈశ్వరనై అழகాలే తిరుత్తుమ్"** (ఉపదేశంతో నివర్తించనపుడు జీవుని

కృపతో మారుస్తుంది, ఈశ్వరుని తన అందంతో మారుస్తుంది) అనే సూత్రం, దాని వ్యాఖ్యాన శ్రీసూక్తులు ఇక్కడ అనుసంధేయాలు.

**(హే జనని!)** – ఈ శ్లోకంలో పలికే అర్థాలకు ప్రాణస్థానీయమైన సంబోధనం ఇది. **(త్వత్ప్రేయాన్)** – మీ పరమప్రీతికి పాత్రమైన భగవానుని – అని అర్థం.

**(పరిపూర్ణాగసి జనే)**–నిండైన అపరాధాలను కల ఆశ్రితజనుల విషయంలో,

**(హితస్రోతోవృత్త్యా పితేవ కదాచిత్ కలుషధీః భవతి)** – వరాలను పొంది, ఎన్నో నోములు నోచి పొందిన పుత్రునికూడా హితపరత్వపరీవాహరూపంగా దండించే తండ్రివలె, కొన్ని సమయాలలో మనస్సులో కోపాన్ని పొందుతాడు. అటువంటి సమయంలో, **(త్వమ్)** – నీవు ఏమి చేస్తావు? అంటే,

**(కిమేతత్? ఇహ జగతి నిర్దోషః కః? ఇతి)** – "ఇది ఏమి? ఆశ్రితుని దోషాన్ని గమనించవచ్చునా? ఈలోకంలో తప్పులు చేయనివారున్నారా?" – అని పల్కి కొన్ని ఉపదేశాలను చేస్తావు. దానికి కూడా అతడు అంగీకరించకపోతే,

**(ఉచితై రుపాయైః విస్మార్య స్వజనయసి)** – పూర్వం చేసిన ఉపదేశాలు ఉచితోపాయశబ్దంచేత చెప్పబడినా, ముఖ్యంగా భగవానుని వశీకరించుకోవడంలో సాధనాలైన శృంగార చేష్టితవిలాసవిశేష ప్రదర్శనమే ఇక్కడ వివక్షితాలు. ఈవిధంగా ఉపదేశాలను చేసి, నీ రూపసౌందర్యాన్ని చూపి, వల్లభుని వశీకరించుకొని, దోషాలను మఱచిపోయేటట్లు చేస్తావు; కనుక,

**(నః మాతా అసి)** – మాకు తల్లివి అవుతున్నావు. **"హితస్రోతోవృత్త్యా"** – అనేచోట **"శిలరై సుఖికళాకవుమ్, శిలరై దుఃఖికళాకవుమ్ సృష్టిత్తాల్ ఈశ్వరనుక్కు వైషమ్య – నైర్ఘృణ్యజ్గళ్ వారాదో? ఎన్నిల్, కర్మమడియాక చ్చెయ్‌కైయాలుమ్, మణ్ తిన్న ప్రజైయై నాక్కిలే కుఱిప్పిట్టు అఞ్జప్పణ్ణుమ్ మాతావైప్పోలే, హితపరనాయ్ చ్చెయ్‌కైయాలుమ్ ఆకాదు"** (కొందఱిని సుఖపడేటట్లు, కొందఱిని దుఃఖపడేటట్లు సృష్టిస్తే, ఈశ్వరునకు వైషమ్యం, కృపారాహిత్యమనే దోషాలు రావా? అని అంటే, వారి వారి కర్మలనుబట్టి సృష్టి చేస్తున్నందువల్ల, మట్టిని తిన్న బిడ్డ నాలుకపై వాతపెట్టి, భయపెట్టే తల్లివలె హితాన్ని కోరి చేసినందున ఆ దోషాలు రావు) అనే తత్త్వత్రయసూక్తిలోని ఉత్తరార్థం స్మరణీయం.

**53) నేతుర్నిత్యసహాయినీ జనని! న స్త్రాతుం త్వమత్రాగతా**
**లోకే త్వన్మహిమావబోధబధిరే ప్రాప్తా విమర్దం బహు ।**
**క్లిష్టం గ్రావసు మాలతీమృదుపదం విశ్లిష్య వాసో వనే**
**జాతో ధిక్కరుణాం ధిగస్తు యువయోః స్వాతన్త్ర్యమత్యఙ్కుశమ్ ॥**

జనని = తల్లీ!, త్వం = నీవు, నేతుః = నాయకుడైన స్వామికి, నిత్య సహాయినీ= నిరంతరం తోడుగా ఉన్నదానివై, నః = మమ్ములను, త్రాతుం = రక్షించడానికి, త్వత్= నీయొక్క, మహిమ+అవబోధ బధిరే = మహిమను తెలిసి కోవడంలో చెవిటిది (తెలివి లేనిది) అయిన, అత్ర లోకే = ఈ లోకంలో, ఆగతా= అవతరించినదానివై, విమర్దం బహు = చాలా శ్రమను, ప్రాప్తా = పొందావు, మాలతీ మృదుపదం = (నీ) జాజిపూలవలె మృదువైన పాదం, గ్రావసు = రాళ్ళపై, క్లిష్టం= క్లేశాన్ని పొందింది, వనే = వనంలో, విశ్లిష్య = నాథుని ఎడబాసి, వాసః = లంకా నగరవాసం, జాతః = సంభవించింది, యువయోః = మీ ఇద్దటి, కరుణాం=దయను గూర్చి, ధిక్ = ధిక్కారం, అత్యంకుశం = అడ్డు లేని, స్వాతంత్ర్యం = మీ స్వాతంత్ర్యానికి, ధిగస్తు = ధిక్కారం కలగాలి.

**వ్యాఖ్యానమ్ :-** ఇంతకుముందు **"యది మనుజతిరశ్చాం లీలయా"** (48) అనే శ్లోకంలో భగవానుడు తన అవతారాలు అన్నిటిలోను లక్ష్మితోపాటుగా అవతరించే రీతినిగూర్చి పల్కి, ఆ విధంగా లక్ష్మీదేవి సహావతారాలను ఎత్తి ఉండకపోతే, వైరస్యమే కాగలదు - అని అన్నారు కదా! దానిని సింహావలోకన న్యాయంలో కటాక్షించి, శ్రీరామావ తారంలో దివ్యదంపతులు సంభవించిన క్లేశాతిశయాలను అనుసంధించి, ఇటువంటి అవతారం ఇకపై ఏనాడు మీకు సంభవించనక్కరలేదు- అనే అభిప్రాయం వ్యక్త మయ్యే రీతిలో పల్కుతున్నారు, ఈ శ్లోకంలో.

**(హే జననీ!)** - తల్లీ! **(నః త్రాతుమ్ అత్ర ఆగతా త్వమ్)** - మావంటి సంసారిచేతనులను రక్షించడం కోసం ఈ భూమిలోకి వచ్చి అవతరించిన నీవు - ఏవిధంగా అవతరించావు? అని అంటే,

**(త్వన్మహిమావబోధబధిరే లోకే)** - నీ మహిమను స్పష్టంగా ప్రస్తావించి పలికినా, వినడానికి కర్ణరంధ్రాలు లేని లోకంలోకి వచ్చికదా అవతరించావు. అవతరించి ఏమి చేశావు? అని అంటే -

**(ప్రాప్తా విమర్దం బహు)**–**"నాట్టిల్ పిఱన్దు పడాదన పట్టు మనిశర్క్కాయ్"** (ఈ లోకంలో జన్మించి, మానవులకోసం పడరాని పాట్లుపడి) అనే రీతిలో కర్మవశ్యులైన సంసారులుకూడా పడని క్లేశాలను పడ్డావు. ఆ క్లేశాలు ఏవి? అని అంటే, **(మాలతీమృదుపదం గ్రావసు క్లిష్టమ్)** మాలతీపుష్పంకంటే (సన్నజాజి పూవుకంటే) మృదువైన నీ శ్రీచరణాలు కఠినమైన వేడి రాళ్ళపై సంచరించి క్లేశాన్ని పొందాయి. **'నెయ్‌వాయ వేల్ నెడుఙ్కణ్ నేరి*ట్రి*యుమ్ ఇళమ్ కోవుమ్ పిన్బు పోక ఎవ్వాఱు నడన్దనై ఎమ్మిరామా! వో!"** (నేతిని పూసినట్లుగా మెఱిసే అగ్రభాగాన్ని కల వేలాయుధంవంటి కన్నులను, తగిన ఆభరణాలను కల సీతాదేవి, లక్ష్మణుడు వెంట రాగా, ఏ రీతిలో నడచావోకదా, మా శ్రీరామా!) అని, **"మెల్లణైమేల్ మున్ తుయిన్డాయ్ ఇన్ఱిని పోయ్ వియన్‌కాన మరత్తిని*ల్ట్రు*ల్ కల్లణైమేల్ కణ్‌తుయిల క్క*ర్ట్రు*నైయో! కాకుత్తా! కరియకోవే!"** (పూర్వం మెత్తని పడుకపై శయనించావు. ఈనాటి నుండి ఇకపై కఠినమైన అడవిలోని ఆకులు లేని చెట్లనీడలో శిలలనే శయ్యగా చేసికొని నిద్రించడం నేర్చావా!) అని, **"పొరున్దార్ కైవేల్ నుదిపోల్ పరల్ పాయ మెల్లడిక్కళ్ కురుది శోర, తిరుమ్బాద కాన్ విరుమ్బి వియలుళ్లైప్ప వెమ్ పశి నోయ్ కూర, ఇన్ఱు, పెరుమ్ పావియేన్! మకనే! పోకిన్డాయ్"** (శత్రువులు హస్తాలలో పదునైన వేలాయుధం అగ్రంవలె ఉండే సన్నని రాళ్ళు కాలికి గుచ్చుకోగా, మెత్తని పాదాలనుండి రక్తం కారగా, పైన ఎండ తపింపజేయగా, ఆకలి బాధ పీడించగా, మహాపాపిని అయిన నా కుమారా! ఏవిధంగా వెళ్ళావు?) అని దశరథుడు ఆక్రందించేటట్లు అరణ్యంలో సంచరించిన ప్రభువు శ్రీరామునివెంట నడచి వెళ్ళినది కనుక, అతని శ్రీపాదాలు పడిన క్లేశం అంతా ఈమె శ్రీచరణాలుకూడా పడ్డాయి కదా! ఎన్ని క్లేశాలు పడినా, **"అకలకిల్లేన్ ఇఱైయుమ్"** (క్షణం కూడా విడువలేను) అనే ప్రతిజ్ఞానుసారం విడువకుండా వెంట అనుసరించి ఉన్నది కదా!

**(విశ్లిష్య వనే వాసో జాతః)** – పదినెలల కాలం విశ్లేషించి, అశోకవనంలో కదా ఏకాక్షి, ఏకకర్ణి మొదలైన ఏడువందలమంది రాక్షసస్త్రీల మధ్య **"స్వగణేన మృగీం హీనాం శ్వగణేనావృతామివ"** (తన సమూహానికి దూరమైన, వేటకుక్కల మధ్య చిక్కుకొన్న లేడివలె) అనే రీతిలోని క్లేశాన్ని పొందావు.

ఈవిధంగా నిత్యసంశ్లేషాన్ని వీడి, విశ్లేషించడం ఎందుకోసం? అని విమర్శించి చూస్తే, **"పిరాట్టి ముట్పిడ ప్పిరిన్దదు తన్నుడై కృపైయై వెళియిడుకై క్కాక"** (సీతాదేవి మొదటి విశ్లేషం తన కృపను వ్యక్తీకరించడంకోసం) (శ్రీవచనభూషణమ్-8) అని కరుణనే వ్యక్తం చేయడంకోసం - అని అనేవారు, "స్వాతంత్ర్యంతో చేసిన కార్యంలో విచారణ ఏమి?" అని అనేవారు - ఈవిధంగా వివిధాలుగా పల్కుతున్నారు. అయ్యో! ఈ గుణాలను తెలిసి, ఆనందించేవారుంటే, అందమే. కాని, **"త్వన్మహిమావబోధబధిరే లోకే"** - అనే రీతిలో గుణాలను దర్శించి, ఆనందించే లోకం కాదు కదా, ఇది. ఈ కఠినమైన లోకంలో "కరుణను ప్రదర్శించడంకోసం విశ్లేషిస్తున్నాను" - అని, స్వాతంత్ర్యంతో విశ్లేషిస్తున్నాను - అని పల్కి విశ్లేషించడం అనేది మావంటివారికి హాహాకారయోగ్యం అవుతుంది, అంతే. ఇటువంటి సంకల్పం ఇక ఏనాడూ మీకు కలుగవద్దు - అనేది ఆంతరమైన అర్థం.

ఇందులో **"జనని"** అని లక్ష్మిని మాత్రం సంబోధించి విజ్ఞాపిస్తూ, చివరి పాదంలో **"యువయోః"** అని దివ్యదంపతులను ఇద్దఱిని ప్రస్తావించి గర్హిస్తూ పల్కడం - "అయ్యో! నీవు చేసే పనులే కాదు, నీ భర్త చేసే పనికూడా ఉచితం కాదు" - అని గర్హించే తాత్పర్యంలో పర్యవసిస్తుంది. లక్ష్మివిషయంలో కరుణను, భగవానుని విషయంలో స్వాతంత్ర్యాన్ని అన్వయించి అర్థనిర్వాహం చేయడం సరసం.

**54) అధిశయితవానబ్ధిం నాథో మమన్థ బబన్ధ తం**
**హరధనురసౌ వల్లీభఙ్గం బభఙ్జ చ మైథిలి! ।**
**అపి దశముఖీం లూత్వా రక్షఃకబన్ధ మనర్తయత్**
**కిమివ న పతిః కర్తా త్వచ్చాటుచుఞ్చుమనోరథః ॥**

మైథిలి = జానకీ!, అసౌ=ఈ, నాథః = నాథుడు, త్వత్ + చాటు చుంచు = నీకు ప్రియాన్ని కల్గించడంలో, మనోరథః = కోరికను కలవాడై, అబ్ధిం = సముద్రంలో అధిశయతవాన్ = శయనించాడు, మమంథ = (దానిని) చిలికాడు, తం బబంధ= దానిని సేతువుతో బంధించాడు, హరధనుః = శివధనుస్సును, వల్లీభంజం = లతను త్రుంచినట్లు, బభంజ చ = అవలీలగా భగ్నం చేశాడు కూడా, దశముఖీం = (రావణుని) పది తలలను, లూత్వా = ఖండించి, రక్షఃకబంధం = ఆ రాక్షసుని మొండాన్ని, అనర్తయత్ అపి = ఆడించాడు కూడా, (అందువల్ల నీకోసం), పతిః = నీభర్త, కిమివ = ఏ కార్యాన్ని, న కర్తా = చేయడు? (దేనికైనా నీకోసం చేస్తాడు)

**వ్యాఖ్యానమ్ :–** పూర్వం పల్కిన **"పితేవ త్వత్ప్రేయాన్"** (52) అనే శ్లోకాన్ని మళ్ళీ గమనించి, అందులో పల్కిన అర్థానికి ఉపపాదకంగా ఈ శ్లోకాన్ని అనుగ్రహిస్తున్నారు. ఆశ్రితజన సంరక్షణార్థంగా భగవానుని వశీకరించుకొనేటపుడు స్వాధీన పతికాత్వం (భర్తను తన స్వాధీనంలో కల్గి ఉండడం) అవశ్యాపేక్షితం. దానిని ఈ శ్లోకం విశదీకరిస్తున్నది. స్తోత్రరత్నంలోని **"తవ ప్రియం ధామ యదీయ జన్మభూః, యదర్థ మంబోధి రమంథి అబంధి చ"** (ఏ లక్ష్మీదేవి జన్మస్థలం నీకు ప్రియమైన నివాసమో, ఎవరికోసం నీవు సముద్రాన్ని బంధించావో, చిలికావో) అనే రెండు పాదాలను కటాక్షించి ఇందులోని మొదటి పాదాన్ని అనుగ్రహించారు.

**(హే మైథిలి!)** – సీతాదేవిగా అవతరించిన ఓ శ్రీరంగనాయకీ!,

**(అసౌ నాథః అబ్ధిమ్ అధిశయితనాన్)** – నీ పుట్టినిల్లు అయిన పాలకడలిని వీడిపోలేకుండా, **"మాకడల్ నీరుళ్ళాన్"** (గొప్ప సముద్రజలాలో శయనించి ఉన్నాడు) అనే రీతిలో అందులోనే నీవల్లభుడు శయనించి ఉన్నాడు.

**(తం మమంథ)** – నిన్ను పొందడంకోశమే తన శయనస్థానమనే విషయాన్ని కూడా గమనించకుండా, **"ఆழ்కడల్తన్నై మిడైన్దిట్టు మన్దరమ్ మత్తాక నాట్టి వడమ్ శుழ்ழி వాశుకి వన్కయిరాక క్కడైన్దిట్టార్"** (గంభీరమైన సముద్రంలో మందరాన్ని కవ్వంగా నిలిపి వాసుకిని దారంగా చుట్టి చిలికారు).

**(బబంధ)** – **"ఉణ్ణాదు ఉఱజ్గాదు ఒలికడలై యూడఱుత్తు పెణ్ణాక్కై యాప్పుణ్డు నాముழ்ழுపోదు"** (నాచ్చియార్ తిరుమొழி–11–7) అనే రీతిలో నీపట్ల గల వ్యామోహం కారణంగా కదా ఆ సముద్రంలోని రాళ్ళను, కొండలను పెట్టి ఆనకట్టను కట్టాడు. ఇంత మాత్రమేనా?,

**(హరధనుః వల్లీభంజం బభంజ చ)** – **"తిక్కు నిఱైపుకழ்ాళన్ తీవేళ్వి చ్చెన్ఱ నాళ్, మిక్కపెరుమ్ శబైనడువే విల్లిఱుత్తాన్"** అని **"కాన్దళ్ ముకిழ்విరల్ శీఱైతైక్కాకి క్కడుమ్ శిలై శెన్ఱిఱుత్తు"** అని పలికే రీతిలో నీకోసమేకదా హరుని వింటిని అనాయాసంగా భగ్నం చేశాడు. ఇంత మాత్రమేనా?

**(దశముఖీం లూత్వా రక్షఃకబంధమ్ అనర్తయదపి)** రావణుని పది తలలను నఱుకగా, నఱుకగా, మాటి మాటికి అవి మొలిచినపుడు, చివరగా ఖండించి,

యుద్ధ భూమిలో రావణుని మొండెం నాట్యం చేసేటట్లుగా చేశాడు. అందువల్ల, ఇవి అన్నీ నిన్ను పొందడంకోసమే కదా!

**(త్వచ్చాటుచుంచుమనోరథః పతిః కిమివ కర్తా)** – నీవల్లభుడు నిన్ను ఆనందింప జేయడం అనే ప్రయోజనాన్ని ఒక్కటిని మాత్రమే ఎదురు చూచేవాడు కనుక, దేనిని చేయడు? అతనికి దుర్ఘటమైనది ఒకటి ఉన్నదా? నీకోసం తలిస్తే ఏదయినా చేయగలడు? అని భావం. ఈ శ్లోకంలో పరిపూర్ణహృదయం కలవారై శ్రీపిళ్ళైలోకా చార్యుల వారు ముముక్షుప్పడిలో **"తన్‌శొల్ వరుమవనై ప్పొఱుప్పిక్క చ్చొల్లవేణ్డావిఱే"** (తన మాటప్రకారం నడిచేవానిని సహింపజేయగలదని చెప్పనక్కర లేదుకదా.) అని పలికారు.

**55) దశశతపాణిపాదవదనాక్షిముఖై రఖిలైః**
**అపి నిజవైశ్వరూప్యవిభవై రనురూపగుణైః ।**
**అవతరణై రతైశ్చ రసయన్ కమితా కమలే!**
**క్వచన హి విభ్రమభ్రమిముఖే వినిమజ్జతి తే ॥**

కమలే=లక్ష్మీ!, కమితా=నీ ప్రియుడు, దశశత = వేలాది, పాణి=చేతులు, పాద=పాదాలు, వదన=ముఖాలు, అక్షి = నేత్రాలు, ముఖైః = మొదలైనవానిని కల్గినవి, అఖిలైః = ఏ కొఱత లేని, అనురూపగుణైః = తగిన కల్యాణగుణాలను కల్గినది అయిన, నిజ=తనయొక్క, వైశ్వరూప్య విభు వైః+అపి = విశ్వరూప స్థితిలోని వైభవాలతోకూడా, అతైః = వాటికంటే వేఱయిన, అవతరణైః+చ = అవతారాలతో కూడా, రసయన్ = ఆనందించేవాడై, తవ = నీయొక్క, విభ్రమభ్రమిముఖే = విలాసాలనే సుడిగుండం ద్వారంలో, క్వచన = ఎక్కడో, వినిమజ్జతి హి = పూర్తిగా మునిగిపోతున్నాడు కదా!

**వ్యాఖ్యానమ్ :-** భగవానుని, సర్వప్రకారమైన ఉపభోగసామర్థ్యం కూడా, లక్ష్మీదేవియొక్క విలాస చేష్టిత వైభవంలోని ఏకదేశంలో మునిగిపోతున్నది; అంతే – అని అంటున్నారు, ఈ శ్లోకంలో.

**(హే కమలే)** – ఓ శ్రీరంగనాయకీ!, **(తవ కమితా)** – నీ వల్లభుడు,

**(దశశతపాణిపాదవదనాక్షిముఖైః)** – **"సహస్రశీర్షా పురుషః"** అని, **"సహస్ర బాహూదరవక్త్రనేత్రమ్"** (వేలాది బాహువులను, ఉదరాలను, ముఖాలను నేత్రాలను

కలవానిని) అని పలికే రీతిలో వేలాది బాహువులు, పాదాలు, ముఖాలు, కన్నులు-మొదలైన, **(అనురూపగుణైః)** – నీకు తగినవి అయిన గుణాలతో,

**(అఖిలైః నిజవైశ్వరూప్యవిభవైరపి)** తన విశ్వరూపాతిశయాలు అన్నిటితోను,

**(అతైశ్చ అవతరణైశ్చ)** ఇంతేకాక, అవతారవిశేషాలతోను అని అర్థం, "అతైః" అనే పదం తచ్ఛబ్దంపై నఙ్‌రాగా ఏర్పడిన రూపం. **"తద్భిన్నైః"** (దానికంటే వేఱయినవి – అని అర్థం). కొందఱు ఇక్కడ **"రతైః"** అని పదవిభాగాన్ని చేస్తారు. కాని, **"అతైః"** అనే పదవిభాగాన్నే పెద్దలు ఆదరించారు. **"అవతరణైః"** అంటే – **"అవతారైః"** – అని అర్థం. వాసుదేవాది చతుర్వ్యూహాలు, విధిశివులమధ్య విష్ణురూపాన్ని ధరించడం, ఉపేంద్ర మత్స్యకూర్మాది రూపాలలో అవతరించడం – ఈవిధంగా ఇటువంటి పలువిధాలైన అవతారాలతో, **(రసయన్)** – అనుభవించేవాడై– అని అర్థం.

**(తే క్వచన విభ్రమభ్రమిముఖే వినిమజ్జతి)** – మహాసముద్రంలో ఒక చిన్న కణంవలె నీ విలాస చేష్టితాలనే సుడిగుండంలో ఏకదేశంలో మునిగిపోతున్నాడు.

**56) జననభవనప్రీత్యా దుగ్ధార్ణవం బహుమన్యసే**
**జనని! దయితప్రేమ్ణా పుష్ణాసి తత్పరమం పదమ్ ।**
**ఉదధిపరమవ్యోమ్నోః విస్మృత్య మాదృశరక్షణ**
**క్షమమితి ధియా భూయ శ్రీరఙ్గధామని మోదసే ॥**

జనని = తల్లీ, జననభవనప్రీత్యా = పుట్టినిల్లు అనే ప్రీతితో, దుగ్ధ+అర్ణవం= క్షీరసాగరాన్ని, బహుమన్యసే = గొప్పగా భావిస్తున్నావు, దయిత ప్రేమ్ణా = భర్తపట్ల గల ప్రేమతో (మెట్టినింటిపట్ల గల ప్రేమతో), తత్ = (ప్రసిద్ధమైన) ఆ, పరమం పదం = పరమపదాన్ని, పుష్ణాసి = వర్ధిల్లజేస్తున్నావు, ఉదధిపరమవ్యోమ్నోః = ఇటువంటి క్షీరాబ్ధి – పరమపదాలను, విస్మృత్య = పూర్తిగా మఱచి, మాదృశ = మావంటి ఆశ్రితుల, రక్షణ = రక్షణకు, క్షమమ్ = తగిన చోటు, ఇతి = అనే, ధియా= భావనతో, శ్రీరంగధామని = శ్రీరంగనగరంలో, భూయః = మిక్కిలిగా, మోదసే = ఆనందిస్తున్నావు.

**వ్యాఖ్యానమ్ :–** లక్ష్మీదేవికి పాలసముద్రం పట్ల, ప్రీతి ఉన్నా, శ్రీరంగ దివ్యాలయంలోనే మిక్కిలి అభినివేశం ఉన్నది – అనే విషయాన్ని హేతూపన్యాస పూర్వకంగా ఈ శ్లోకంలో పల్కుతున్నారు,

**(హే! జనని!)** – సర్వలోకమాతవు అయిన ఓ శ్రీరంగనాయకీ!,

(దుగ్ధార్ణవం జననభవనప్రీత్యా బహుమన్యసే) – పుట్టినిల్లు అనే ప్రీతివిశేషంతో క్షీరాబ్ధిని గొప్పగా అభిమానిస్తున్నావు. లోకంలో స్త్రీలకు పుట్టినింటిపట్ల ఒక ప్రీతి విశేషం ఉంటుంది కదా! ఆ మర్యాదకు తగినట్లు, క్షీరసాగరకన్యక అయిన నీకు క్షీరాబ్ధి పట్ల ప్రీతి ఉన్నది. అంతకుమించి,

**(తత్ పరమం పదం దయితప్రేమ్ణా పుష్ణాసి)** – **"తద్విష్ణోః పరమం పదమ్"** అని శ్రుతిప్రసిద్ధమైన పరమపదాన్ని వల్లభుని పట్ల ప్రీతి విశేషంతో ఆదరిస్తున్నావు. స్త్రీలకు మెట్టినింటి విషయంలో ఉండే ప్రీతి ప్రసిద్ధమే కదా! ఈ విధంగా పుట్టినింటి పట్ల, మెట్టినింటిపట్ల నీవు ప్రీతిని కల్గి ఉన్నా,

**(ఉదధిపరమవ్యోమ్నోః విస్మృత్య)** – పుట్టినిల్లు అయిన క్షీరాబ్ధిని, మెట్టినిట్లు అయిన శ్రీవైకుంఠాన్ని మఱచిపోయి,

**(మాదృశరక్షణక్షమమితి ధియా శ్రీరంగధామని భూయః మోదసే)** – మావంటి సంసారిచేతనులను రక్షించడానికి ఇదే తగిన చోటు – అని తలచి, శ్రీరంగంలో అతిమాత్రమైన ప్రీతితో వేంచేసి ఉన్నావు – అని అర్థం. ఇందువల్ల లక్ష్మీదేవికి ఆశ్రితరక్షణంలోనే పూర్ణమైన దృష్టి – అనేది నిరూపింపబడింది. శ్రీరంగరాజస్తవ పూర్వశతకంలో **"ఉదధిపరమవ్యోమ్నో విస్మృత్య"** (79) అని ఆరంభమవుతున్న శ్లోకం ఇక్కడ అనుసంధేయం.

**57) ఔదార్యకారుణిక తాశ్రితవత్సలత్వ –**
**పూర్వేషు సర్వ మతిశాయిత మత్ర మాతః ।**
**శ్రీరఙ్గధామ్ని యదుతాన్యదుదాహరన్తి**
**సీతావతారముఖమేత దముష్య యోగ్యా ॥**

మాతః = తల్లీ, ఔదార్య = దాతృత్వం, కారుణికతా = దయ, ఆశ్రితవత్సలత్వ= ఆశ్రయించినవారిపట్ల వాత్సల్యం, పూర్వేషు = మొదలైన గుణాలలో, సర్వం = (పురుషకారానుగుణాలైన గుణాలు) అన్నీ, శ్రీరంగ ధామని = శ్రీరంగదివ్యాలయంలో, అత్ర = శ్రీరంగనాయకికైై ఉండే అర్చామూర్తి సన్నివేశంలో, అతిశాయితం = అతిశయాన్ని పొందింపబడినవి, ఉత = అంతేకాక, అన్యత్ = ఈ అర్చాస్థితి కంటే వేఱయిన, యత్= ఏ, సీతావతారముఖం = సీతగా అవతరించడం మొదలైనవానిని, ఉదాహరంతి=

(ఇతఃపూర్వం ప్రస్తావించిన గుణాలు ప్రకాశించే చోటుగా పురాణేతిహాసజ్ఞులు) ఉదాహరిస్తున్నారో, ఏతత్ = ఈ సీతావతారాదులు అన్నీ, అముష్య = ఈ అర్చాస్థితికోసం, చేసిన, యోగ్యా = అభ్యాసాలు.

వ్యాఖ్యానమ్ :- **"అజాయమానో బహుధా విజాయతే"** (కర్మమూలంగా జన్మించనివాడైనా కృపవల్ల అనేక విధాలుగా అవతరిస్తున్నాడు) అని, **"ఎన్నిన్న యోనియుమాయ్ ప్పిఱన్దాయ్ ఇమైయోర్ తలైవా"** (ఓ దేవదేవా! ఎన్నెన్ని జాతులలో పుట్టావో కదా,) అని పల్కిన రీతిలో భగవానుడు పలు అవతారాలను ఎత్తినట్లే, లక్ష్మీదేవికూడా ఎత్తుతుంది కదా! ఆ రీతిలో పలు అవతారాలు ఉన్నప్పటికీ, **"అర్చావతారవిషయే మమాప్యుద్దేశత స్తవ, ఉక్తా గుణా న శక్యంతే వక్తుం వర్షశతైరపి"** (అర్చావతార విషయంలోని గుణాలనుగూర్చి పల్కడానికి వందలాది సంవత్సరాలకాలం కూడా చాలదు) అనే రీతిలో మిగిలిన అవతారాలకంటే శ్రీరంగనాయకి అనే ఈ అర్చావతారంలోనే సకలకల్యాణగుణాలు అతిశయాన్ని పొందిన రీతినిగూర్చి ఈ శ్లోకంలో పల్కుతున్నారు.

**(హే మాతః)** - ఓ జగజ్జననివి అయిన శ్రీరంగనాయకీ!,

**(ఔదార్యకారుణికతాశ్రితవత్సలత్వపూర్వేషు (గుణేషు))** సర్వస్వదానాన్ని చేయడమనే ఔదార్యం, పరదుఃఖాసహిష్ణుత్వరూపమైన కారుణికత్వం, ఆశ్రిత దోషభోగ్యత్వం- ఇత్యాది కల్యాణగుణాలలో,

**(సర్వమ్ అత్ర శ్రీరంగధామని అతిశాయితమ్)** - ఒక్కొక్క కల్యాణగుణం శ్రీరంగదివ్యాలయంలో వేంచేసి ఉండే ఈ రూపంలో చాలా అతిశయాన్ని పొంది వెల్గుతున్నది.

ఈ విధంగా పల్కినట్లయితే, పూర్వం **"మాతః! మైథిలి!"** అనే శ్లోకంలో సీతావతార మనే విభవావతారంలో గుణోత్కర్షం చెప్పబడింది కదా! అది ఏవిధంగా పొసగుతుంది? అనే సందేహం కలిగే అవకాశం ఉన్నది కనుక, దానికి సమాధానం ఇస్తున్నట్లు ఇక పల్కుతున్నారు -

**(యదు తాన్యదుదాహరంతి)** - ఇత్యాదిగా! **(అన్యత్)** - అర్చావతారంకంటే వేఱయిన,

**(సీతావతారముఖమ్)** – సీతాదేవిగా అవతరించడం మొదలైన విభవావతారాలను,

**(అతిశాయిత ముదాహరంతీతి యత్)**–గుణోత్కర్షను కల్గినవిగా అంటున్నారే!– అని అంటే, వినండి.

**(ఏతత్ అముష్య యోగ్యమ్)** – ఈ సీతావతారాది విభవావతారాలలో శ్రీరంగనాయకి అనే ఈ అర్చావతారసన్నివేశానికి అభ్యాసం చేయబడింది – అంతే. లోకంలో బహిరంగంగా నర్తనం చేయగోరేవారు ముందుగా లోపల ఆడి, అభ్యాసాన్ని చేస్తారు కదా! అదేవిధంగా సీతావతారాదులలో గుణాలు అభ్యసింపబడ్డాయి – అని అర్థం. ఇందువల్ల, విభవావతారాలలో గుణాభ్యాసమే కనుక, అక్కడ అపరిష్కృతస్థితి, అర్చావతారంలో సుపరిష్కృతస్థితి – అని తెలుపబడింది.

ఈ శ్లోకం చివరలో "యోగ్యమ్" అనే పాఠభేదాన్ని కొందఱు పఠిస్తారు. ఇది అపపాఠం. అర్థం ఇది తెలియరాని అపపాఠం. "యోగ్యా" అనేదే శుద్ధపాఠం. అభ్యాస స్థలమని అర్థం. "యోగ్యా అభ్యాసః" అని అమరకోశవచనం. అభ్యాస స్థలమని తాత్పర్యం.

**58) ఐశ్వర్య మక్షరగతిం పరమం పదం వా**
**కస్మైచిదఞ్జలిభరం వహతే వితీర్య ।**
**అస్మై న కిఞ్చిదుచితం కృతమిత్యథాంబ!**
**త్వం లజ్జసే కథయ కోఽయ ముదారభావః ॥**

అంబ = తల్లీ! త్వం = నీవు, అంజలిభారం = అంజలి అనే బరువును, వహతే = మోసే (నీకు అంజలిని చేసే), కస్మైచిత్ = ఎవనికోసం అయినా (అతని కోరికకు తగిన రీతిలో), ఐశ్వర్యం = ఇహలోకంలోని సంపదను, అక్షరగతిం = కైవల్యాన్ని, పరమం పదం వా=లేక, పరమపదాన్ని, వితీర్య = ఇచ్చి, అథ = ఆ తరువాత కూడా, అస్మై = ఇతనికి, ఉచితం = ఇతడు చేసిన అంజలికి తగినది, కించిత్ = కొంచెంకూడా, న కృతం = చేయబడలేదు, ఇతి = అని, లజ్జసే = లజ్జను (సిగ్గును) పొందుతున్నావు, అయం = ఈ ఉదారభావః = ఔదార్యం, కః= ఎటువంటిదో, కథయ = చెప్పు.

**వ్యాఖ్యానమ్ :**– గడచిన శ్లోకంలో ప్రస్తావించిన కల్యాణగుణాలలో ముఖ్యమైన ఔదార్య గుణాన్ని ఒక చమత్కారం ఉట్టిపడేటట్లుగా ఇందులో పల్కుతున్నారు. స్త్రీల

లక్షణాలను పేర్కొనేటపుడు, **"నాణ్ మడమచ్చమ్ పయిర్ప్పు"** అనేవి లక్షణాలుగా చెప్పబడ్డాయి. **"నాణ్"** అంటే - లజ్జ. ఇది స్త్రీత్వానికి ఐకాంతికం (అసాధారణం) కనుక, శ్రీరంగనాయకికి అర్చావతారదశలోకూడా ఇది అవినాభూతంగా ఉన్నది- అని అంటున్నారు. లజ్జతోకూడి ఉండే స్వభావం ముఖంలోనే గోచరిస్తుందికదా! అది శ్రీరంగనాయకి యొక్క తిరుముఖమండలంలో కూడా దర్శించేటట్లుగా ఉంటుంది.

దీనికొక హేతువును ఉల్లేఖిస్తున్నారు. కృత్యాలను చేయనపుడు, అకృత్యాలను చేసినపుడు లజ్జ కల్గడం సహజం. శ్రీరాముడు దండకారణ్యాశ్రమంలో వేంచేసి ఉన్నపుడు, మహర్షులు తాము పడిన క్లేశాలనుగూర్చిమొఱపెట్టుకోవడంకోసం అతని వద్దకు వచ్చారు. అపుడు శ్రీరాముడు, తన లజ్జాతిశయాన్ని **"హ్రీ రేషా హి మమాతులా"** (నా ఈ సిగ్గు సాటిలేనిది కదా) అని వ్యక్తం చేశాడు. **"ప్రసీదంతు భవంతో మే హ్రీ రేషా హి మమాతులా, యదీదృశై రహం విప్రైః రుపస్థేయై రుపస్థితః"** (మీరు నాపట్ల ప్రసన్నులు కావాలి. నేనే మీవద్దకు రావలసి ఉండగా, మీరు నా దగ్గరకు రావడం వల్ల నాకు కల్గిన ఈ సిగ్గు సాటిలేనిది కదా!) అనేది శ్రీరాముని వచనం. మహర్షులుండే చోటును అన్వేషించి, తానే అక్కడకు పోయి, వారికి అభయాన్ని ఇవ్వవలసి ఉండగా, ఆపని చేయలేకపోయినందులకు తాను లజ్జపడుతున్నట్లు పల్కడం తగినదే. శ్రీరంగనాచ్చియార్ లజ్జ పడడానికి ఈమె పట్ల అకృత్యకరణంగాని, కృత్యాకరణం గాని - ఏది ఉన్నది? అని అంటే, వాస్తవానికి ఏమీ లేదు. అయినా, ఈమె తన భావంతో కృత్యాకరణమున్నదని, అదే లజ్జాహేతువు అవుతున్నదని నిరూపిస్తున్నారు.

**(ఐశ్వర్య మక్షరగతిమ్ - ఇత్యాది)** - ఐశ్వర్యం గాని, కైవల్యంగాని, **"నలమన్ద మిల్లైదోర్ నాడు"** (అవధి లేని ఆనందాన్ని కల పరమపదం కాని) దేనికైనా అడిగిన రీతిలోనే అనుగ్రహించడంలో ఏ కొఱత లేదు. ఆ విధంగా ఇచ్చినా, "వీరికి ఏమి ఇచ్చాను? ఏమీ ఇవ్వలేకపోయాను కదా! చాలా కొంచెమే కదా ఇచ్చాను. ఇదికూడా ఒక దానమేనా!" అని మనస్సులో కొఱత పడుతూ ఉన్నందువల్ల, దానివల్ల కల్గిన లజ్జ ఆమె ముఖంలో కన్పడుతున్నది - అని అంటున్నారు. నమ్మాళ్వార్ పెరియ తిరువన్దాది ప్రబంధంలో **"ఒన్టుణ్డు శెజ్గణ్‌మాల్! యానురైప్పదు, ఉన్నడియార్‌క్కు**

**ఎన్ శెయ్‌వన్! ఎన్ట్రే యిరుత్తి నీ"** (పుండరీకాక్షా! నే చెప్పదలచిన మాట ఒకటి ఉన్నది. ఎల్లప్పుడు నీవు నీ భక్తులకు ఇంకా ఇంకా ఏమేమి చేయాలి - అని భావిస్తావు) అని పల్కిన పాశురం ఇక్కడ అనుసంధేయం.

**"అంజలిం కృతవతే"** (అంజలిని చేసే) అని అనవలసినచోట **"అంజలిభరం వహతే"** (అంజలి భారాన్ని మోసే) అని అనడం లక్ష్మీదేవి అభిప్రాయానుసారంగానే. విడిగా వేఱు పడి ఉండే చేతులను ఒకటిగా చేర్చడమే అంజలి కనుక, అనాయాస కార్యమైన దీనిని ఒక గొప్ప భారంగా పల్కడం- అది ఆమెకు గొప్ప పనిగా తోస్తున్నందు వల్ల. **"భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ"** (నీ అభిప్రాయానుసారం గొప్పదైన **"నమః"** అనే మాటను పల్కుతాము) అనేచోట మన పూర్వాచార్యులు పలికే అర్థాన్ని ఇక్కడ అనుసంధించాలి.

**(కస్మైచిత్ పరమం పదమ్ వితీర్య)** - అని అనడంవల్ల లక్ష్మీదేవి తానే అద్వారకంగా పరమపదాన్ని ఇస్తుందని భావించరాదు. లోకంలో ఇప్పించేవారిని కూడా ఇచ్చేవారుగా పల్కడం ఉన్నది కనుక, ఆ రీతిలో చెప్పబడింది. అంతే. లేకపోతే, లక్ష్మీదేవికి పురుషకారత్వం పల్కడం వ్యాహతం కాగలదు. ఆమెకే అద్వారకంగా పరమపదాన్ని ఇచ్చే శక్తి ఉంటే, నిరంకుశస్వతంత్రునితో వాదు లాడడ మనే పురుషకార కృత్యంలో ప్రయత్నించి, ఆమె శ్రమపడనక్కరలేదు కదా! దీనిని గూర్చిన విస్తృతవిచారం నా శ్రీతత్త్వశోధనమనే గ్రంథంలో చూచి తెలియవచ్చు.

**59) జ్ఞాన క్రియాభజనసంపదకిఞ్చనోఽహమ్**
**ఇచ్ఛాధికారశకనానుశయానభిజ్ఞః ।**
**ఆగాంసి దేవి! యువయోరపి దుస్సహాని**
**బధ్నామి మూర్ఖచరిత స్తవ దుర్భరోఽస్మి ॥**

దేవి = శ్రీరంగనాయకీ! ఇచ్ఛా = ఫలాన్ని పొందడంలో కోరిక, అధికార = ఆ ఫలాన్ని పొందడంకోసం చేయవలసిన కార్యాన్ని చేయడంలో తగిన యోగ్యత, శకన= శక్తి, ప్రయత్నాన్ని చేయడంలో, అనుశయ = విహితకార్యాన్ని ఇంకా చేయలేదే! - అనే పశ్చాత్తాపం - అనేవానిని, అనభిజ్ఞం = తెలియనివాడను, జ్ఞాన = జ్ఞానయోగం, క్రియా=కర్మయోగం, భజన = భక్తి యోగం - అనే సంపదను, అకించనః = ఏమీ

లేనివాడనైయిన, అహం = నేను, యువయోః + అపి = మీ ఇద్దఱికి కూడా, దుస్సహాని= సహించరాని, ఆగాంసి = అపరాధాలను, బధ్నామి = చేస్తున్నాను, మూర్ఖచరితః =చెడ్డ ప్రవర్తనను కలవాడనై, (అందువల్ల), తవ = నీకు, దుర్భరః అస్మి = భరించ వీలుకానివాడనై ఉన్నాను.

**వ్యాఖ్యానమ్ :-** ఈ శ్లోకంలోను, అనంతర శ్లోకంతోను భట్టర్ తమ నైచ్యాలను అనుసంధిస్తూ, స్తోత్రపరిసమాప్తిని చేస్తున్నారు.

**(హే దేవి!)** ఓ శ్రీరంగనాయకీ!,

**(జ్ఞానక్రియాభజనసంపదకించనోఽహమ్)** – జ్ఞానయోగ–కర్మయోగ – భక్తి యోగాలలో దేనినీ లేనివాడనైన నేను – అని అర్థం. **"న ధర్మనిష్ఠోఽస్మి న చాత్మవేదీ న భక్తిమాన్"** (కర్మయోగ – జ్ఞానయోగ – భక్తియోగాలను కలవాడను కాను) అని, **"నోఱ్ఱ నోన్బు ఇలేన్ నుణ్ణఱివిలేన్"** (నోచిన నోము కలవాడను కాను; ఆత్మజ్ఞానాన్ని కలవాడను కాను) అని పూర్వులు అనుసంధించే క్రమం ఇది.

**(ఇచ్ఛాధికారశకనానుశయానభిజ్ఞః)** ఇచ్ఛామాత్రాన్నే అధికారంగా కల్గిన ప్రపత్తిని చేయడానికికూడా శక్తి లేనివాడను, "నాకు ఇవి ఏమీ లేవే!" అనే పశ్చాత్తాపాన్ని పడడంకూడా తెలియనివాడను – అని భావం. **"ఇచ్ఛాధికార"** ఇత్యాది ప్రయోగానికి రెండు విధాలుగా పెద్దలు అర్థాన్ని చెప్పారు.**"కణ్ణన్ కழలిణై నణ్ణుమ్ మనముడైయీర్"** (శ్రీకృష్ణుని పాదాలను ఆశ్రయించడంలో మనస్సు కల్గిన వారలారా!) అని, **"పోదువీర్ పోదుమినో"** (శ్రీకృష్ణుని పాదాలను ఆశ్రయించడంలో మనస్సును కలవారలారా!) అని పలికే రీతిలో ఇచ్ఛకు మించి ఇంకొక అధికారసంపద అక్కఱ లేనిదైన ప్రపత్తిలో – అని అర్థం. అందులో కూడా, శక్తి, అనుతాపాలను లేనివాడను– అనే అర్థాన్ని గ్రహించడం ఒక విధం. ఇంకొక రీతి ఏమంటే – **"ఇచ్ఛా, అధికారశ్చ, శకనం చ, అనుశయ శ్చ"** అని నాల్గు పదాలుగా చేర్చి ద్వంద్వసమాసాన్ని చేసి, ఈ నాల్గింటిని తెలియనివాడనే అర్థాన్ని చెప్పడం. వీటిలో, ఇచ్ఛ అంటే – ముముక్షుత్వం, అధికారమంటే – శమదమాదులు. శకనమంటే – అధ్యవసాయదృఢత్వం, అనుశయ మంటే – అనుతాపం. ఇవి ఈవిధంగా ఉంటాయని

కూడా తెలియనివాడను, నేను– అని అంటున్నారు – **"అనభిజ్ఞః"** అనేపదం ద్వారా ఇటువంటివాడనైన నేను,

**(యువయోరపి దుస్సహాని ఆగాంసి బధ్నామి)** దివ్యదంపతులైన మీరు కూడా సహించలేని అపరాధాలను చేస్తున్నానే! అయ్యో! అని అర్థం. **"దేవి!"** అని అంటూ ఏకవచనంగా సంబోధించి, **"యువయోః"** అని ద్వివచనంగా పల్కడంవల్ల, దివ్య దంపతులిద్దరు ఇక్కడ వివక్షితులని భావించాలి. దోషాలను గమనించనివారు, చూచినా గుణాలుగా గ్రహించేవారైన మీకు కూడా సహించరాని అపరాధాలను నిండుగా చేసేవాడను.

**(మూర్ఖ చరితః అహమ్)** – **"మూర్క్కనేన్ వన్దు నిన్ఱేన్ మూర్క్కనేన్"** (మూర్ఖుడనై వచ్చి నీ ముందు నిలిచాను) అనే దానికి ప్రథమలక్ష్యభూతుడను, నేను.

**(తవ దుర్భరోఽస్మి)** – నీకు కూడా చేయిదాటిపోతున్నాను – అని అర్థం. నీ విషయీకారానికి (దయకు) కూడా బాహ్యుడను అయిపోతున్నాను – అని తాత్పర్యం.

**60) ఇత్యుక్తి కైతవశతేన విడమ్బయామి**
**తానంబ! సత్యవచసః పురుషాన్ పురాణాన్ ।**
**యద్వా న మే భుజబలం తవ పాదపద్మ –**
**లాభే త్వమేవ శరణం విధితః కృతాసి ॥**

అంబ = తల్లీ! శ్రీరంగనాయకీ!, ఇతి = పూర్వం తెల్పిన రీతిలో, ఉక్తికైతవ శతేన=వంచనతో కూడిన వందలాది నైచ్యానుసంధానవచనాలతో, తాన్ = ప్రసిద్ధులైన ఆ, సత్యవచసః = సత్యాన్నే పలికే, పురాణాన్ = ప్రాచీనులైన, పురుషాన్= ఆచార్యులను (పూర్వాచార్యులను), విడంబయామి = అనుసరిస్తున్నాను, యద్వా= లేదా, మే = నాకు, తవ = నీయొక్క, పాదపద్మలాభే = పాదపద్మాలను పొందడంలో, భుజబలం= (తగిన ప్రయత్నాన్ని చేసే) భుజబలం సామర్థ్యం, న = లేదు, విధితః = కరుణతో, త్వమ్ ఏవ = నీవే, శరణం = శరణంగా, కృతా అసి = చేయ బడిన (పొందబడిన) దానవై ఉన్నావు.

**వ్యాఖ్యానమ్ :–** గడచిన శ్లోకంలో నైచ్యానుసంధానాన్ని చేశారు కదా! దేనిని అయినా హార్దంగా చేసిఉంటే, దివ్యదంపతుల కృపకు నాపై ప్రసరించడానికొక

ఆధారం ఉన్నది - అని ఊరటను పొంది ఉండేవాడను. అదికూడా లేదు కదా! పూర్వులైన ఆళ్వార్లు, ఆచార్యులు అనుసంధించిన నైచ్యాన్ని అదేవిధంగా అనుకరించానే తప్ప, వేరేమీ లేదు. అందువల్ల భగవానుని నిర్హేతుకకృపయే రక్షకమనే విషయాన్ని ఇందులో అనుసంధిస్తున్నారు.

**(అమ్బ)** - ఓ జగన్మాతవు అయిన శ్రీరంగనాయకీ!

**(ఇతి)** - పూర్వశ్లోకంలో అనుసంధించిన క్రమంలో

**(ఉక్తికైతవవశేన)** - విడంబనరూపంలోని బలమైన పలు పలు నైచ్యభాషణాలను పల్కడం ద్వారా,

**(తాన్ సత్యవచసః పురాణాన్ పురుషాన్ విడంబయామి)** - **"మయర్వఱ మదినలమ్"** (భ్రమ, విప్రలంభాది దోషాలు లేని, భక్తిగా పరిణమించిన జ్ఞానం) అనుగ్రహింపబడినవారని ప్రసిద్ధులై, పరమకారుణికులైన శ్రీపరాంకుశపరకాలాది ఆళ్వార్లను, ఆళవందార్‌వంటివారైన పూర్వాచార్యులను అనుకరిస్తున్నాను, అంతే. **"నీశనేన్ నిఱై ఒన్డు మిలేన్"** (నీచుడను, ఏ గుణం లేనివాడను) అని, **"నానే నానావిద నరకమ్ పుకుమ్ పావమ్ శెయ్‌దేన్"** (నేనే పలు నరకాలలో ప్రవేశించే పాపాలను చేశాను) అని, **"ఈవిలాద తీవినైకళ్ ఎత్తనై శెయ్‌దనన్‌కొల్!"** (సాటిలేని పాపాలను నేను ఎన్ని చేశానో కదా!) అని, **"న నిందితం కర్మ తదస్తి లోకే సహస్రశో యన్న మయా వ్యధాయి"** (లోకంలో నేను పలుమార్లు చేయని పాపం ఏదీ లేదు) అని అనుసంధించిన ఆళ్వార్ల, ఆచార్యుల భావనను అనుకరించి పలికాను తప్ప, యథార్థంగా మనస్సులో ఉండేదానిని చెప్పలేదు - అని భావం.

వాస్తవంగా తమకు ఏవిధమైన యోగ్యత లేకపోవడాన్ని, భగవానుని కృపయే రక్షమనే విషయాన్ని ఉత్తరార్ధంలో దృఢంగా పల్కుతున్నారు.

**(యద్వా, తవ పాదపద్మలాభే మే భుజబలం న)** - పూర్వం పల్కిన రీతిలో పూర్వాచార్యులు చేసిన నైచ్యానుసంధానాన్ని అనుకరించడం తప్ప, నీ శ్రీచరణాలను పొందడానికి నావద్ద ఏ సామర్థ్యం లేదు - అని భావం. **"భుజబలమ్"** - అనే పదం బాహుబలిమి - అనే అర్థాన్ని ఇచ్చేది అయినా, సామర్థ్యమనే తాత్పర్యాన్ని ఇక్కడ గ్రహించాలి. సర్వాత్మనా నేను అసమర్థుడను - అని తాత్పర్యం.

**(విధితః త్వమేవ శరణం కృతా అసి)** – నీవే నిర్హేతుకంగా అనుగ్రహించగా, కృప ఫలించింది – అని భావం.

**61) శ్రీరఙ్గే శరదశ్శతం సహ సుహృద్వర్గేణ నిష్కణ్టకం**
**నిర్దుఃఖం సుసుఖం చ దాస్యరసికాం భుక్త్వా సమృద్ధిం పరామ్।**
**యుష్మత్పాదసరోరుహాన్తరరజ స్స్యామ త్వమంబా పితా**
**సర్వం ధర్మమపి త్వమేవ భవ న స్స్వీకుర్వకస్మాత్కృపామ్ ॥**

శ్రీరంగే = శ్రీరంగనగరంలో, శతం శరదః = నూటేండ్లు, సుహృద్వర్గేణ సహ= స్నేహితులతోపాటు, నిష్కంటకం = ఏ అడ్డు లేకుండా, నిర్దుఃఖం = ఏ దుఃఖం లేకుండా, సుసుఖం చ = మిక్కిలి సుఖంగా, దాస్యరసికాం = భగవద్భాగవతకైంకర్య రూపమైన ఆనందాన్ని కల, పరాం = గొప్ప, సమృద్ధిం = సమృద్ధిని, భుక్త్వా= అనుభవించి, యుష్మత్ = మీ ఇరువురియొక్క పాదసరోరుహా = పాదకమలాల, అంతర = లోపల ఉండే, రజః = పుప్పొడిగా, స్యామ = అగుదుము గాక!, త్వం= నీవే, అంబా = తల్లిని, పితా = తండ్రివి, త్వమేవ = నీవే, నః = మాకు, సర్వం= సమస్తమైన, ధర్మమ్ అపి = ధర్మంగా కూడా, భవ = కావాలి, అకస్మాత్కృపాం = (మాపట్ల) నీ నిర్హేతుక కృపను, స్వీకురు = అంగీకరించు (ప్రసరింపజేయాలి).

**వ్యాఖ్యానమ్ :–** తమ అపేక్షితాన్ని విజ్ఞాపిస్తూ భట్టర్ స్తోత్రాన్ని పరిసమాప్తి చేస్తున్నారు."ఓ శ్రీరంగనాయకీ! శ్రీరంగదివ్యాలయంలో మిత్రమండలితోకూడ నిరపాయంగా, మహానందప్రవాహం ప్రవహించేటట్లుగా దాస్యరసం నిండిన సంపదను అనుభవిస్తూ, ఇంకా ఒక నూటేండ్లు దేవరవారి శ్రీచరణసాన్నిధ్యంలో ఉజ్జీవిస్తాము. సకలవిధబంధువైన నీవే, నీ నిర్హేతుకకృపను ప్రసరింపజేయాలి" – అని ఇందులో ప్రార్థిస్తున్నారు. శ్రీరంగ రాజస్తవంలో **"శ్రీరంగే శరదశ్శతం తత ఇతః పశ్యేమ లక్ష్మీసఖమ్"** (శ్రీరంగంలో అంతటా శ్రీరంగనాథుని మనం దర్శించాలి) (74) అని పల్కిన సూక్తి ఇక్కడ స్మరణీయం.

**(సహ సుహృద్వర్గేణ)** శోభనహృదయాన్ని కలవారు – సుహృత్తులు. అభీతిస్తవంలో **"నిరస్తరిపుసంభవే క్వచన రంగముఖ్యే విభో! పరస్పరహితైషిణాం పరిసరేషు మాం వర్తయ"** (ప్రభూ! శత్రువులు నశించిన శ్రీరంగంలో ఎక్కడో ఒకచోట పరస్పరం హితాన్ని కోరేవారి సమీపంలో నేను నివసించేటట్లుగా చేయి)

అని పల్కిన రీతిలో పరస్పరహితైషులై ప్రకాశించే ఉత్తములే సుహృత్తులు - అనబడ్డారు. "సుసుఖమ్" అని అంటేనే చాలి ఉండగా, "నిష్కంటకమ్", "నిర్దుఃఖమ్" అని ప్రతియోగి ప్రతిసంధానపూర్వకంగా పల్కడం - ఆకాలంలో శ్రీరంగవాసానికి పలు పలు ఆటంకాలు ఏర్పడిన విషయాన్ని సూచిస్తున్నది. అందువల్ల శ్రీరంగవాసాన్ని చిరకాలం కోల్పోయి, తిరుక్కోట్టియూర్‌లో వేంచేసి ఉండి, తిరిగి శ్రీరంగానికి వచ్చిన పిమ్మటకదా ఈ స్తుతిని అనుగ్రహించారు.

(దాస్యరసికాం పరాం సమృద్ధిం భుక్త్వా) - అక్కడ ఇక్కడ (ఈలోకంలో పరమ పదంలో) దాస్యమే పురుషార్థం. ముముక్షుప్పడిలో **"ఇరుక్కుమ్ నాళ్ ఉకన్దరుళిన నిలజ్ఞళిలే ప్రవణనాయ్ గుణానుభవకైంకర్యఙ్గళాలే పోదుపోక్కు కైయుమ్"** (ఈ లోకంలో ఉండే దినాలలో భగవానుడు ఆదరంతో వేంచేసి ఉండే క్షేత్రాల పట్ల ఆదరాన్ని కలవాడై, గుణానుభవ రూపమైన కైంకర్యాలతో కాలక్షేపం చేయడం) అని అనుగ్రహించిన సూక్తి ఇక్కడ అనుసంధేయం. **"దాస్యరసికామ్ సమృద్ధిమ్"** అనే దానికి **"దాస్యరసికత్వరూపాం సమృద్ధిమ్"** అని అర్థం. **"దాస్యరసికాః"** అనే విసర్గాంత పాఠాన్ని కొందఱు పఠిస్తారు. అది పెద్దలు ఆదరించిన పాఠం కాదు. నాల్గవ పాదంలో **"సర్వం ధర్మమపి త్వమేవ భవ నః"** అనే స్థానంలో **"సర్వం చ త్వమసి త్వమేవ భవ నః"** అనేది కొందఱి పాఠం. అదికూడా పొసగదు. ఇక్కడ ధర్మమనేది ఆముష్మిక ఫలసాధనాన్ని తెల్పుతుంది. సాధ్యానికి అపేక్షితాలైన సాధనాలు అన్నీ నీవే కావాలి- అని భావం. ఆ విధంగా కావడానికి తగిన నిర్హేతుకకృపను నీవు కల్గినదానవు కావాలి- అనే ప్రార్థనతో ఈ స్తుతిని భట్టర్ పూర్తిచేశారు.

మహావిద్వాన్ కాంచీ అణ్ణంగరాచార్య స్వామివారి
శ్రీగుణరత్నకోశ ద్రావిడ వ్యాఖ్యానానికి ఆంధ్రానువాదం సంపూర్ణమ్
భట్టరు తిరువడిగళే శరణమ్



# శ్లోక సూచి


| శ్లోక సంఖ్య | శ్లోకం |
|---|---|
| 36 | అజ్ఞన్తే |
| 54 | అధిశయితవాన్ |
| 8 | అనాఘ్రాతావద్యం |
| 3 | అనుకల |
| 33 | అన్యైఽపి |
| 30 | అపాఙ్గా |
| 13 | అస్యేశానా |
| 15 | అకుగ్రామ |
| 23 | అజ్ఞానుగ్రహా |
| 41 | ఆనందాత్మభిః |
| 43 | ఆమర్యాదం |
| 44 | ఆమోదాద్భుత |
| 11 | ఆహుర్వేదా నమానం |
| 60 | ఇత్యుక్తి |
| 14 | ఉద్వాహుస్త్వాం |
| 2 | ఉల్లాస పల్లవిత |
| 16 | ఏకో ముక్తాతపత్ర |
| 38 | ఏకం న్యఞ్చ్య |
| 58 | ఐశ్వర్య మక్షరగతిం |
| 57 | ఔదార్య కారుణికతా |
| 46 | కనకరశనా |
| 19 | కాలే శంసతి |
| 35 | ఘనకనకద్యుతీ |
| 56 | జననభవన |
| 59 | జ్ఞానక్రియా |
| 25 | తత్ర స్రక్స్రర్భగన్ధం |
| 29 | తవ స్వర్ణాదీశం |
| 24 | తస్యాఞ్చ త్వత్కృపా |
| 27 | తే సాధ్యా స్సన్తి |
| 40 | త్వత్స్వీకార |
| 55 | దశశతపాణిపాద |

| శ్లోక సంఖ్య | శ్లోకం |
|---|---|
| 10 | దేవి శ్రుతిం |
| 53 | నేతు ర్నిత్య సహాయినీ |
| 42 | పాదారున్తుద |
| 52 | పితేవ త్వత్ప్రేయాన్ |
| 37 | ప్రణమదనువిధిత్సా |
| 32 | ప్రశకనబలజ్యోతిః |
| 26 | భోగ్యా వామపి |
| 12 | మనసి విలసితాక్షా |
| 45 | మర్మస్పృశోరసిరాః |
| 50 | మాతర్మైథిలి |
| 51 | మాతర్లక్ష్మి |
| 48 | యది మనుజతిరశ్చాం |
| 21 | యద్ద్వారే మనసో |
| 4 | యద్భ్రూభఙ్గాః |
| 5 | యద్యావత్తవ |
| 34 | యువత్వాదౌ |
| 17 | రతిర్మతిసరస్వతీ |
| 20 | శబ్దాదీన్ విషయాన్ |
| 1 | శ్రియై సమస్త |
| 9 | శ్రియ శ్శ్రీః శ్రీరఙ్గేశయ |
| 61 | శ్రీరఙ్గే శరదశ్శతం |
| 18 | సహస్థిర |
| 47 | సామాన్యభోగ్య మపి |
| 39 | సురభితనిగమాన్తం |
| 7 | సూక్తిం సమగ్రయతు |
| 49 | స్థలితకటక |
| 6 | స్తోతారం తముశన్తి |
| 31 | స్వతశ్శ్రీస్త్వం విష్ణోః |
| 28 | స్వరూపం స్వాతన్త్ర్యం |
| 22 | హేలయా మఖిలం |

## దివ్యప్రబంధ రహస్యగ్రంథ వ్యాఖ్యానాలలో శ్రీగుణరత్నకోశ శ్లోకాలు ఉదాహరింపబడిన సందర్భాల వివరం.

| శ్లోకసంఖ్య | సందర్భవివరం |
|---|---|
| 4 | తిరువాయ్‌మొ౹గ్రి - 6-6-7 - ఈదుఅరుమ్బదమ్ |
| 7 | తిరువాయ్‌మొ౹గ్రి - 2-4-11 - ఈదు అరుమ్బదమ్,<br>తిరువాయ్‌మొ౹గ్రి - 5-1-11 - పన్నీరాయిరప్పడి వ్యాఖ్యానం |
| 8 | తిరువాయ్‌మొ౹గ్రి - 2-4-11 - ఈదు అరుమ్బదమ్ |
| 11 | తిరువాయ్‌మొ౹గ్రి - 3-9 - దశక ప్రవేశమ్ - అరుమ్బదమ్ |
| 12 | ఆచార్య హృదయం - 223 సూత్రం వ్యాఖ్యానమ్ |
| 14 | శ్రీవచనభూషణమ్ - 5వ సూత్ర వ్యాఖ్యానమ్ |
| 21 | తిరువిరుత్తమ్ - 26వ పాశురం - నమ్పిళ్ళై వాఖ్యానం |
| 22 | తిరువాయ్‌మొ౹గ్రి - 9-9-6 - పన్నీరాయిరప్పడి వ్యాఖ్యానమ్ |
| 24 | శ్రీవచనభూషణమ్ - 254వ సూత్ర వ్యాఖ్యానమ్ |
| 25 | తిరువాయ్‌మొ౹గ్రి - 3-10-8 - పన్నీరాయిరప్పడి వ్యాఖ్యానమ్ |
| 26 | తిరువాయ్‌మొ౹గ్రి - 4-9-1 - ఈదు వ్యాఖ్యానమ్,<br>తిరువాయ్‌మొ౹గ్రి - 6-2-6 - పన్నీరాయిరప్పడి వ్యాఖ్యానం |
| 28 | తిరుమాలై - 35వ పాశురం - పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానం,<br>ముముక్షుప్పడి - 97వ సూత్ర వ్యాఖ్యానమ్ |
| 29 | తిరువాయ్‌మొ౹గ్రి - 6-10-10 - ఈదు అరుమ్బదమ్,<br>ముముక్షుప్పడి - 46వ సూత్ర వ్యాఖ్యానమ్ |
| 30 | తిరువాయ్‌మొ౹గ్రి - 6-10-10 - ఈదు అరుమ్బదమ్,<br>మూన్హామ్‌తిరు - 62వ పాశురం-పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానం |
| 40 | తిరువాయ్‌మొ౹గ్రి - 1-4-2 - ఈదు అరుమ్బదమ్ |
| 42 | అమలనాదిపిరాన్ - 2వ పాశురం - పెరియవాచ్చాన్‌పిళ్ళై వ్యాఖ్యానం,<br>తిరువాయ్‌మొ౹గ్రి- 4-5-2 - ఈదు అరుమ్బదమ్ |
| 45 | తిరువాయ్‌మొ౹గ్రి - 6-7-8 - ఈదు, పన్నీరాయిరప్పడి వ్యాఖ్యానాలు |
| 47 | తిరువాయ్‌మొ౹గ్రి - 5-3-10 - ఈదు అరుమ్బదమ్ |
| 50 | శ్రీవచనభూషణమ్ - 9వ సూత్ర వ్యాఖ్యానమ్ |
| 51 | తిరువాయ్‌మొ౹గ్రి - 9-9-6 - ఈదు అరుమ్బదమ్ |
| 52 | తిరువాయ్‌మొ౹గ్రి - ఈదు ప్రవేశం - ముదల్ శ్రియఃపతి-అరుమ్బదమ్,<br>తిరువాయ్‌మొ౹గ్రి - 1-6-11 - ఈదు అరుమ్బదమ్,<br>శ్రీవచనభూషణమ్ - 11వ సూత్ర వ్యాఖ్యానమ్. |

